

"నాదీ ఆడజన్మే" లో సావిత్రి

మెరమెరలాడే వయసున్నోళ్లై
మిసమిసలాడే సొగసున్నోళ్లై
వెల్లువలాగా వెన్నెలలాగా
ముల్లోకాలను ముంచాలి




ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన తొలి తెలుగు సాంఘిక చిత్రం
అంతా కొత్తవారచే నటించిన సంచలన చిత్రం
బాబూ మూవీస్ వారు సగర్వంగా సమర్పించు

# తేనెమనసులు

దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు నిర్మాత సి.సుందరం రచన ఆత్రేయ సంగీతం మహదేవన్
స్టూడియో శ్రీసారథీ శ్రీ ఫిలింస్ విడుదల





STUDIO Kethna

శంకర్ మూవీస్

# ఘరానా హంతకుడు

ఆంధ్ర వెరైటీ పిక్చర్స్ లిమిటెడ్, నైజాం గామునాథ్ పిక్చర్స్

మాటలు: మహారథి, పాటలు: వేటూరి- బి.ఎన్.చారి, మ్యూజిక్: టి.వి.రాజు,

డైరెక్షన్ : నటేశ్, నిర్మాత : బి. శంకరరావు, సహనిర్మాతలు : ఎమ్. సురేంద్రరెడ్డి, ఎమ్. వి. ప్రసాద్.

# ఉత్తరాలు

## కథలు

"పాఠం నేర్పిన పాఠం" మానవుని విచిత్ర మనస్తత్వాన్ని విశిష్టంగా తెలియబరచింది. మానవుని మనస్సు మహా సాగరం వంటిది. ఆ సాగరాన్ని దూరంనుంచి చూస్తే నిశ్చలంగా నిర్మల నీల వర్ణంతో కనుపిస్తుంది. దగ్గరగా వెళ్ళి చూస్తే అంతులో చెలరేగే తరంగాలు కనబడతాయి. ఎప్పుడూ ఆలోచనావస్థలో కనిపించే మానవుని కదిపి, అతడి కళ్ళలోకి చూస్తే పెను కెరటాల వంటి వ్యధలూ, అగాధం వంటి సమస్యలూ కనుపిస్తాయి ఆ విషయాన్ని ఈ కథ స్పష్టం చేస్తున్నది.

ఆ విషయాన్ని విశిష్టంగా చూపేందుకు ప్రయాస పడిన రచయిత కథను అంతం చేసిన పద్ధతి ఆ విశిష్టతని కొంత తగ్గించిందని చెప్పక తప్పదు. అయినా సాహసించి వ్రాసిన ద్విభాష్యం మూర్తిగారికి అభినందనలు.

ఈ దే ధంగ విచిత్ర మానవ మనస్తత్వాల్ని చర్చిస్తూ వివరించే కథలు పత్రికా మూలంగా మాకు అందిస్తారని ఆశిస్తున్నాను.

శైలేష్ (మద్రాసు)

* * *

"పిరం నేర్పిన పిరం" కథ వాస్తవానికి చాలా దగ్గరలో న్నది. ఇంత చక్కని కథ వ్రాసిన రచయిత మూర్తిగారికి నా అభినందనలు.

— డాక్టర్ బి. వి. రమణ (బరంపురం)

* * *

"రేఖా చిత్రం" నన్నెంతో ఆనందింపజేసింది. ఇటువంటి మంచి కథను రచించిన పోరంకి దక్షిణామూర్తిగారికి నా హృదయ పూర్వక అభినందనలు.

కుప్పిలి సత్యనారాయణ (బొబ్బిలి)

* * *

22—1—65 సంచికలో ప్రచురించిన శ్రీ పోరంకి దక్షిణామూర్తిగారి "రేఖాచిత్రం" కథ చదివాను. చాల బాగుంది. కాని కథానాయకుడుగా మంద్రరామయ్య బొమ్మను సరిగా చిత్రీకరించలేదని నా అభిప్రాయము. కథ చదువుతున్నంతసేపు మంద్రరామయ్య వయస్సులో ఉన్నవాడు అన్న విషయం స్పష్టమవుతూనే ఉంటుంది. కాని బొమ్మలో వాళ్ళ ముసలివాడుగా చిత్రీకరించినారు. ఇది అంత సమంజసముగా కనిపించదు.

శ్రీ ద్విభాష్యం మూర్తిగారి "పాఠం నేర్పిన పాఠం" చాల బాగుంది. ఇటువంటి ఉత్తమ కథలు ప్రచురిస్తున్నందుకు నా ధన్యవాదములు.

నటి జయలలిత ముఖచిత్రం బాగుంది. కార్టూన్లు ప్రత్యేక ఆకర్షణ.

కె. ఎస్. ఎన్ శర్మ, (విజయవాడ)

* * *

"తిలాపాపం" అనే కథను మధురాంతకం రాజారాం చాల నేర్పరితనముగ వ్రాశారు.

శ్రీరాములురెడ్డి (చెన్నపట్నం)



## విచిత్రకథలు

విచిత్ర కథలు విచిత్రంగానే కాక చాల భయంకరంగా ఉన్నాయ్. ఎన్నో డిటెక్టివ్ పుస్తకాలు చదివానుకాని ఇంత భయం ఎప్పుడూ కలుగలేదు. రాత్రి చదువ మొదలుపెట్టి, భయంతో చదువలేక మర్నాడు పూర్తి చేశానంటే నమ్మండి మిగిలిన కథలు కూడ యింతకంటే బాగుంటాయని ఆశిస్తాను.

జి. ఎస్. నాయుడు (హుబ్లీ)

## ప్రత్యేక సంచిక

సర్వాంగ సుందరంగా సర్వులకూ సాక్షాత్కరించిన సంక్రాంతి సంచిక ఎంతో బాగుంది. ఆశించిన దానికంటే ఎక్కువగా మమ్ముల నానంద పరిచి మీకు మా ధన్యవాదాలు.

పి. లీల, శాంతి (రూర్కేలా)

* * *

క్రొత్తగా మీరు ప్రవేశపెట్టిన శీర్షికలు బాగున్నాయి. సరోజాదేవితో, శ్రీధర్‌తో పరిచయాలవల్ల తెలియని విషయాలు తెలిశాయి. ఇకపోతే "ఎవరెవరు" వలన అందరు చిత్ర వ్యక్తులను గురించి తెలుసుకొన వీలు కల్గింది. నటీమణులు తమ వయస్సు ఎవరికీ చెప్పరంటారు. కాని మీ శీర్షిక మూలంగా అది అబద్ధమని తేలింది. సీరియల్ 'సంపెంగలు, సన్నజాజులూ' మొదటినుంచి ఆసక్తికరంగ ఉంటుంది. ఆఖరు మారుగా "సంక్రాంతి సంచిక" అన్ని విధాలా చాలా బావుంది.

మురళి (మార్కాపుర్)

## ఇంటింటి పజ్యాలు

ఇంటింటి పజ్యాలు రాస్తూ ఆరుద్ర
నా మనముపై వేశాడు గట్టి ముద్ర
దేశభాషలందు తెలుగు లెస్స
అని మళ్ళీ నిరూపించాడు—హైలెస్సా
ఆయన ఉపయోగించే పదజాలం
జ్ఞప్తికి తెస్తుంది ఇంద్రజాలం
భాషపై ఆయన కెంత టనువు!
ధన్యమయ్యా! సాహిత్యంలో నీ తనువు!
నీ రచనల్లోని ప్రతి లైను
నిత్య సంఘటనల కొక సైను
జీవిత సత్యాలను ముద్దుగా చెప్పే నేర్పు!
ఎలా సాధించావు? సూర్యోదయంలా తూర్పు!
కొందరంటారు ఆంగ్లేతర పదాలు కలిపితే కలగూరగంప
దానివల్ల ఏదో మునిగిపోతున్నట్లు అమాంతం కొంప!
ఈనాడు దేశాల మధ్య దూరం తగ్గుతోంది
అందుకే ఒక భాష మరో భాషపై మొగ్గుతోంది
ప్రబల భాషలో ఇలాగే సాగాలి నీ కలం
అప్పుడే మాలాంటి వాళ్ళకు వస్తుంది బలం

కె. వి. భాస్కరరావు (మ్యాడిల్లి) ★

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 12—2—'65
క్రోధినామ సం॥ మాఘ మాస శు॥ ఏకాదశి
సంపుటము : 57 సంచిక 24
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1




'వియ్యాల కొచ్చిన ప్పటినుంచీ
పైతులకు కూడా గడ్డి కరవయ్యిందట'

## మన లో మాట

వివిధ ప్రాంతాల ప్రత్యేకతను వివరించే సచిత్ర వ్యాసాలను వీలున్నప్పుడల్లా ప్రచురిస్తూనే వున్నాము. ఈ సంచిక 28, 29 పేజీలలో కనిపించే 'కాంబోడియా' మీద వేసిన సచిత్ర వ్యాసం ఆ కోవకు చెందినదే.

* * *

"వేల్పులకైనా మార్పులు తప్పవు" శీర్షిక క్రింద శివుని గురించిన వ్యాసావళి పోయినవారమే ముగిద్దామనుకొన్నాము. మరి కొంత ఆసక్తికరమైన సమాచారాన్ని ఇస్తూ శ్రీ మహేష్ యీ వారం సంచికకు శివునికి సంబంధించిన చివరి వ్యాసాన్ని పంపారు. పైవారం 'శక్తి'ని గురించిన వ్యాసం వెయ్యాలనుకుంటున్నాము.

* * *

46, 47 పేజీలలో 'ఫిలింఫెస్టివల్' విశేషాలూ, ఒక ఉత్తమ చిత్రం సమీక్ష వేశాము. స్థలాభావం చేత నిలిపి వేయబడిన మరికొన్ని 'ఫిలింఫెస్టివల్' చిత్రాల సమీక్షలు వచ్చే వారం వేస్తున్నాము...

* * *

మేము ముందుగా వూహించినట్లే శ్రీమతి పవని నిర్మల ప్రభావతి గారి వ్యాసంపై చాలా మంది ఉత్తరాలు వ్రాశారు. అందులో కొన్నింటిని 19వ పేజీలో వేశాము.

* * *

పై వారం కథలకి సంబంధించినంతవరకు ఒక ప్రత్యేకత వుంటుంది.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : "దొరికితే దొంగలు"లో రాజశ్రీ


కథలు :

| | |
|---|---|
| లిఖితా రేఖా | — 12 |
| అప్పిచ్చువాడ | — 38 |

సీరియల్ కథలు :

| | |
|---|---|
| అపస్వరం | — 21 |
| సంపెంగలూ-సన్నజాజులూ | — 31 |

శీర్షికలు : వ్యాసాలు: సినిమా.

ఉత్తరాలు — 4, ఊమెన్ కార్టూన్—6, వ్యాధిర్నిరేఖ — 7, చప్పట్ — 11, వనితాలోకం — 17, వనితావాణి — 19, విచిత్ర కథ —26, కాంబోడియా దృశ్యాలు—28, వారఫలం — 35, వేల్పులకైనా మార్పులు తప్పవు — 42, వైజ్ఞానికగాథావళి — 45, ఫిలిం ఫెస్టివల్—46, సరాగం — 50, చిత్రంహారి — 52, చిత్రసమీక్ష — 53, అవీ ఇవీ అన్నీ—55.


హిందీ వాదులు
జాతీయ ఐక్యత


నిజమా? కలా?
సమితివ్యతిరేకులు
చైనా
ఆసియా
ఆఫ్రికా


సంగీత సాధన
హిందీ వాదులు
హిందీ వ్యతిరేక భావాలు
దక్షిణాది


కేరళలో కాంగ్రెసు ముఠాలు
కామరాజ్ కృషి



ఆసియాలోని జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టులో మిక్కిలి పెద్దదిగా పరిగణించబడుతున్న శరావతి జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు తాలూకు తొలి విద్యుదుత్పాదన కేంద్రానికి ప్రధానమంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి జనవరి 24 న ప్రారంభోత్సవం జరిపారు. మీట నొక్కి ప్రారంభోత్సవం జరుపుతున్న శ్రీ శాస్త్రిని, అమెరికా రాయబారి శ్రీ చెస్టర్ బౌల్సును, మైసూరు ముఖ్యమంత్రి శ్రీ ఎస్. నిజలింగప్పను చిత్రంలో చూడవచ్చు. రు 100 కోట్లు ఖర్చుకాగల యీ ప్రాజెక్టుకు అమెరికన్ ప్రభుత్వం 48 కోట్ల 70 లక్షలు సహాయం చేసింది.

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీకృష్ణ**

# కేంద్రంలో దక్షిణాది రాష్ట్రాలకు పలుకుబడి!

హిట్లర్ కాలం నాటిమాట అతని సైన్యానికి రొమెల్ అనే ప్రతిభావంతుడైన వ్యక్తి జనరల్‌గా వుండేవాడు. రొమెల్ సహజంగా చక్కని ఆలోచనలు కలవాడు. ఏ సమయానికి ఏది చేయాలో బాగా తెలిసినవాడు, కాని అతనితో వచ్చిన పెద్ద చిక్కు ఏమంటే, తన తెలివి తేటలను పదే పదే ఉపయోగిస్తూ, తుట్టతుదకు వాటిని అతి తెలివిగా తయారు చేసేవాడు. ఈనాటి కాంగ్రెసు సంస్థ పరిస్థితీ అంతే!

పాకిస్తాన్—ఇండియాల విభజన జరుగక పూర్వం భారతదేశంలోని మహమ్మదీయులంతా ప్రభుత్వ పక్షాన ఉండేవారేమీ, మహమ్మదలీ జిన్నా వర్గం చాలా చిన్నది [illegible] అనే ఇరు వర్గాలు ఉన్నాయన్నమాట. ఈ అభిప్రాయ ప్రభుత్వ పక్షంలో కూడా బాగా ప్రవేశ్లు తున్నకొనిపోయినా, మౌలానా అబ్దుల్ కలామ్‌లాంటి వ్యక్తులు కూడా విశ్రాంతిగా ఉండే వారు. ఈ ధైర్యంతోనే ఆయన ఏనాడూ ప్రత్యేకించి ఏ మహమ్మదీయుల పథకానికీ వెళ్ళే అవసరం కలగలేదు.

ఇంతలో జనరల్ ఎన్నికలు వచ్చాయి. కాంగ్రెసు బోర్డులో ఉండే మహమ్మదీయులకు, ముస్లింలీగ్‌కు బలాబలాలు చూపికొనేందుకు ఇది చక్కని సమయం. చివరకు ఈ 'అగ్ని పరీక్ష'లో కాంగ్రెసు ఓడిపోయింది. మౌలానా తన స్వీయ చరిత్ర వ్రాసికొంటూ పాకిస్తాన్ విభజనకు అంగీకరించిన గాంధీజీ, నెహ్రూలను కూడా నిందించారు.

ఈనాటి కాశ్మీర్‌లో జరిగే తంతు కూడా ఇదే. కాంగ్రెసు తరఫున మహమ్మదీయుల సంఘం ఒకటి అక్కడ ఏర్పాటైంది. బక్షీ గులాం మహమ్మద్ అనుయాయులంతా కళ్ళు మూసుకొని ఈ సంస్థలో చేరారు. ఇంకా విపులంగా చెప్పాలంటే కాంగ్రెసు మహమ్మదీయులు, షేక్ అబ్దుల్లా మహమ్మదీయులు అనే ఇరు వర్గాలు ఉన్నాయన్నమాట. — [illegible]

ఇలాంటి స్థితిలో బక్షీ గులాం మహమ్మద్ అరెస్టు కావటం, కారాగారానికి పంపబడటం— పైగా ఒక హైకోర్టు జడ్జి బక్షీసాహెబుగారిపై వచ్చిన ఆరోపణలను వినటం అంతా పరిశీలకులకు విడ్డూరంగా కనుపిస్తున్నది. ఉన్నట్టుండి కొంత వాతావరణం బక్షీసాహెబుగారికి అనుకూలించలేదని తెలిసి కాబోలు, ఆయన్ని విడుదల చేశారు. ఢిల్లీ వచ్చాడాయన. ఆయన్ను కుశల ప్రశ్నలు వేసేందుకు శ్రీ శాస్త్రి కూడా వెనుకాడలేదు. మరో వైపు బక్షీపైన న్యాయ విచారణ కొనసాగాలనే అభిప్రాయం కూడా కొనసాగుతూనే వచ్చింది.

ఇంత వ్యవహారం జరిగాక చర్చించవలసిందల్లా ఒకటే అంశం. ఇకముందు కూడా కాంగ్రెసు సంస్థ పట్ల కనీసం బక్షీ అనుయాయులైన మహమ్మదీయులు ఆదరణ, అభిమానం చూపుతారా? పదిహేడేళ్ళ స్వతంత్ర జీవనం తరువాత కూడా 'ముస్లింలీగ్'లాంటి పక్షాలు ఈ దేశంలో ఉండటం, పైగా లోకసభలో ప్రాతినిధ్యం పొందటం— ఇంకా విచారకరం ఇండియాలోని మహమ్మదీయుల — [illegible]

# హిందీ జులుం తప్పని సరేనా?

సభ్యులు తా మొక్కటిగా పథకం, పవమానికాలు జరపటం అనివార్యం అయిపోయింది.

* * *

హిందీ భాష పట్ల అదే రోమల్ విధానం కూడా ఆచరణలో వున్నదా అని భయం!

దక్షిణాది రాష్ట్రాలలోను, బెంగాల్‌లోను వుండే ప్రజల భావాలను ఏమాత్రము లక్ష్య పెట్టక, పోయిన నెల 26 నుంచి హిందీకి పట్టం గట్టారు. పాపం నందాగారు ఎంతో ఔదార్యంతో మాట్లాడుతూ, హిందీని నిర్బంధం చేయాలనే నిర్బంధం ఏమీ లేద న్నారు. కాని అన్ని ప్రభుత్వ కార్యాలయాలకు ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఈ ఉత్తర్వుల సంగతి శ్రీ నందాకు తెలియదా?

ఆమధ్య శ్రీ శాస్త్రి కూడా తన రేడియో ఉప న్యాసంలో, హిందీని ప్రవేశ పెట్టటానికి దృఢ మైన చర్యలు తీసికొంటున్నామన్నారు.

ఏమయితేనేం రాజ్యాంగం చెప్పే "భారతీయ ప్రజల"కూ హిందీ ఆమోదించే ప్రజలకు సహస్రం లేదా!

బాబు సత్యనారాయణ్ సిన్హా ఆధిపత్యాన వెలిగిపోతున్న తంతి, తపాలాశాఖ ఢిల్లీ పత్రి కలో ప్రకటన నొకదానిని వేయించి, ఏ భాషలో నైనా తంతి పంపవచ్చునని, లిపి దేవనాగరి అయితే చాలునని ప్రస్తావించింది. అంటే ఈ మహా వ్యక్తి హిందీయేతర భాషలను మాత్రమేకాక ఆ యా భాషల లిపిని కూడా ధ్వంసం చేద్దామని కలలు కంటున్నాడు కాబోలు!

ఒక్కమారు గతంలోకిమాస్తే, ఈనాటి హిందీ యేతర రాష్ట్రాలు, ప్రజలు ప్రభుత్వంచేత ఎలా మోసగింపబడ్డారో అర్థం అవుతుంది. మాజీ ప్రధాని చేసిన వాగ్దానాలకు విలువలేదని, వాటిని ఆచరణలో పెట్టే దిక్కు అంతకన్నా లేదని కూడా మరోసారి తేటతెల్లమయింది. రెండేళ్లక్రితం హిందీని గురించి శ్రీ నెహ్రూ చేసిన ఉపన్యాసం, తీర్మానం గమనించదగ్గవే. కాని అదంతా ఈవాడు [illegible]

ఏమయినా, ఒక్క సంగతి విస్మ రించకూడదు. 1947 ఆగస్టు 15 నుంచి కేంద్రంలో ప్రభుత్వం చాలా వరకు హిందీ వాదులతోనే నడుప బడుతున్నది, తాము గట్టిగా వాదించ గలిగినంతటి ప్రాతి నిధ్యాన్ని దక్షిణాది రాష్ట్రాలకు కేంద్రంలో ఇవ్వటం జరగలేదు.

# అలనాటి వాగ్దానాలు ఏమయినట్లు?

బెంగాల్‌లోను, దక్షిణాది రాష్ట్రాలలో ఈనాటి పరిస్థితి ఏమిటి?

కేరళలో కుంభకోణం కొనసాగుతూనే ఉన్నది. గవర్నరు పాలన కేరళకు అనివార్యమయిపోయింది. పైగా, ఇకనుంచి గవర్నరు పదవి శ్రీ ఎ. పి. జైను కు లభిస్తున్నది. మైసూరు ముఖ్యమంత్రి ఎక్కడో నీడపట్టున కాలక్షేపం చేస్తున్నాడు. ఇక మద్రాసు ముఖ్యమంత్రిని చూదామా అంటే, కామరాజు అంతటి వ్యక్తిత్వం, గాంభీర్యమూ ఏ కోశానా కనిపించవు. ఆంధ్రప్రదేశ్ రాజధానిలో ఇంకా నిజాం ముసల్మానుల ప్రభావం కనిపిస్తూనేఉంది. అతుల్య ఘోష్ ఈసారి కాంగ్రెసు అధ్యక్షుడు అవుతాడని అందరూ అనుకొంటున్నారు కనుక, ఆయన కూడా నోరు మూసికొని కూర్చొనే ఉన్నారు. హిందీయే తర రాష్ట్రాల నోళ్లను కేంద్రం ఎలా కట్టివేసిందో దీని ద్వారానే తెలుస్తుంది.



కానెన్నో సలహాలనిచ్చాడు: వాటన్నిటికి ఆదరణ ఏదీ?
శ్రీ కామరాజ్

17 మార్లు మార్పులు చేయబడినరాజ్యాంగం గురించి, కొందరి హిందీ ఉన్మాదులకే ఆవాస మైన పార్లమెంటును గురించి శ్రీ నందా గొప్పలు చెపుతున్నారు.

సుప్రీంకోర్టు నిర్ణయాన్ని సైతం మార్చ గలిగిన విధంగా రాజ్యాంగాన్ని మార్చుకొనే వ్యక్తు లకు, హిందీయేతర భాషలను మాట్లాడేవారి మనోభావాలను గౌరవించాలని తెలియకపోవటం సిగ్గుచేటు. ప్రజాస్వామ్యంలో "ఫలానాది ధ్యేయం" అని చెప్పటానికి వీలులేదని మాజీ ప్రధాని ఒకసారి అన్నారు.

హిందీయేతర రాష్ట్రాలన్నీ తమ అభిప్రాయాన్ని వ్యక్త పరచటానికి ఇది అనువైన సమయం. తమ తరఫున పార్లమెంటులో వాదించ మని సభ్యులను అడగాలి, దక్షిణాది రాష్ట్రాల విలువ కేంద్రంలో ఎంతో వున్నది. అందువల్ల తమ మాట చలామణీ చేయించుకో లేకపోవటం దక్షిణాది రాష్ట్రాల (సభ్యుల) బలహీనతనే తెలియచేయవచ్చు.

దక్షిణాది రాష్ట్రాల 'విలువల'ను గురించి చెప్పా లంటే, ఒక దృష్టాంతం ఉదహరిస్తే చాలు. ప్రధాని పదవికి ఎప్పుడూ ఉత్తరాదివారే వస్తు న్నారు. కారణం ఏమంటే పార్లమెంటులో హిందీ వాదులకే మెజారిటీ ఉన్నది. కాని అంతకన్నా ముఖ్యం ఏమంటే దేశం అవిచ్ఛిన్నంగా ఉండాలంటే ప్రధాని అయే వ్యక్తి ఈదక్షిణాది రాష్ట్రాల సహృ ద్భావాన్ని కూడా కూడగట్టుకొని రావాలి. బహుశా, ఇలాంటి సహృద్భావం శ్రీ శాస్త్రిమీద దక్షిణాది రాష్ట్రాలకు ఆమధ్య ఉండేది కనుకనే ఆయన ప్రధాని కాగలిగారు. మొరార్జీ దేశాయ్, జగ్జీవనరాం లాంటి వాళ్లకు అది లేదు.

'హిందీని బలవంతంగా రుద్దం' అనే వాగ్దానాన్ని శ్రీ శాస్త్రి చేయటంవల్లనే ఆయన ప్రధాని అయారు. కాని, ఆ వాగ్దానం ఏమయిందీనాడు? బహుశా అధికార దాహంధాటున మరుగుపడి పోయిం దేమో!

★

# అభిసారిక

ఆంధ్ర పాఠకుల ఆదరాభిమానాలను పొందిన మాస పత్రిక

ఎన్నో శాస్త్రీయ విషయాలకు గృహ సమస్యలకు, వ్యక్తిగత సమస్యలకు ప్రాధాన్యత నిచ్చే మాస పత్రిక

సంవత్సర చందా రు. 7–20
విడి ప్రతి — 0–60 పైసలు

లేనిచోట్ల ఏజెంట్లు కావలెను.

అభిసారిక, సామర్లకోట ఆంధ్ర,

---

## ఎలెక్ట్రిక్ & రేడియో గైడ్

ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్, రేడియో రిపేరింగ్, మెకానిజం, అసెంబ్లింగ్, ఎలెక్ట్రికల్ సూపర్ వైజరి, వైరింగ్, పూర్తి కోర్సు చదవండి. రు. 50లకు ట్రాన్‌సిస్టర్ తయారుచేయడంకూడ నేర్చుకోండి. ఎలెక్ట్రికల్ వర్కుషాప్ ప్రారంభించండి. (800 పటములు) ధర రు. 12/50 VPP రు 2.

## 350 చిన్న పరిశ్రమల గైడ్

పెన్సిళ్ళు, ప్లాస్టిక్ సామానులు, సోపులు, ఫౌంటెన్ పెన్నులు హాండ్‌లూం వగైరా 350 చిన్న పరిశ్రమలు, తక్కువ పెట్టుబడితో ప్రారంభించండి. ప్రతిపరిశ్రమయొక్క సాంకేతిక వ్యాపారరహస్యాలు, గవర్నమెంటు సహాయం, ఋణంపొందు మార్గాలు ఈపుస్తకంలో గలవు. ధర రు.12/50. V.P.P రు. 2/25

Sulekha Book Depot(AM 15)Aligarh

---



## జామ్-బక్
## శమనపర్చు మాన్పును!

మీరు జామ్-బక్‌ను వాడితే తరువాత మంట పెట్టదు. ఎందుకనగా, దానిలో ఎన్నబడిన మూలికా అంటునిరోధక ఔషధులు గలవు. చర్మవ్యాధులకు, తలగడ్డ వాపు నొప్పులకు, లోక ప్రసిద్ధమైన జామ్-బక్‌ను వాడండి. అయింట్‌మెంటు జామ్-బక్‌తో మీకు తక్షణ శమనము గలుగును. దీనిలో అంటు క్రొవ్వులు మాదిరి లేవని గ్యారంటీ చేయబడినది.

**Zam-Buk**

జామ్-బక
మూలికా బామ్



అన్ని మందుల వ్యాపారుల దగ్గరను దొరుకును.
టి. జి. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి.

డిస్ట్రిబ్యూటర్లు:
ఆంధ్రప్రదేశ్: మెస్సర్స్ వినోద్ & కం.,
పి ఓ బాక్స్ 148, హైదరాబాద్-12

---



ఉత్సాహానికి
హుషారుకు
కారణం:
రాగోలైన్




ఈ పుష్టికరమైన ఆహార పానీయమును
మీరుకూడా పుచ్చుకొని యెల్లప్పుడు
ఉత్సాహంగా వుండండి!!

ఫైన్ కెమికల్ వర్క్సు,
పి. బి. 71, మైసూరు-4

---




కండ్ల
అందానికి
రక్షణకు

## దర్‌బార్ కాజల్
కాటుక (రిజిష్టర్డు)

తయారుచేయువారు:—
రాంబీర్ కంపెని, బొంబాయి-4.

---



## ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన "దేవిపిల్సు" వాడండి!

పూర్తికోర్సుప్యాకెట్టు 28 మాత్రలు వెల రు 11/-
సగంకోర్సు ప్యాకెట్టు 14 మాత్రలు వెల రు 6/50
ప్రతి చోటు దొరకును

'దేవి పిల్సు' ముఖ్యంగా అలస్యమైన, క్రమముగా కాక పోయిన, బాధతో కూడిన, లేక ఆగిపోయిన బహిష్టుకు దేవిపిల్సు బాగుగ గుణమిచ్చును

1 అన్ని సందర్భములలోను శీఘ్రముగాను, అమోఘముగాను పనిచేయును
2 ఏస్థితిలోను ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగించదు

MFRS - SEENU & CO., MADRAS-21

స్టాకిస్టులు: సిటి ఫార్మ డిస్ట్రిబ్యూటర్స్, రాంగోపాల్ వీధి, విజయవాడ-1.

---

ఉచితము ! ఉచితము !!

## తెల్లమచ్చలు

మా ప్రఖ్యాతివహించిన 'డాగ్ సాఫా' ప్రత్యేక ఔషధము తెల్లమచ్చలను సులభముగ పోగొట్టుటలో 1925 సం|| నుండి ప్రఖ్యాతి వహించియున్నది. మూడురోజులు వాడినంతనే మచ్చల తెలుపుదనం ఆపైన కొన్ని రోజుల్లోనే పూర్తిగా బాగుచేయు శక్తి గలదు. ఉచితంగ ఒక పాకెట్ మందు ఇవ్వబడును నకలును చూచి మోసపోకండి.

**Ashoka Treatment Centre,**
**P. O. Katri Sarai (Gaya)**

---

మా క్రొత్త సామగ్రి

## ఐటెక్స్ కుంకుం పేస్ట్

ప్రవేశపెట్టబడుచున్నది.




అన్నిచోట్ల లభించును.




**అరవింద్ లేబరేటరీస్**
పి. బి. నెం. 1415, మద్రాసు-17.

---

## ఫోల్డింగ్ 50 షాట్ పిస్టల్

లైసెన్స్ అక్కరలేదు. అమెరికన్ మోడల్, దొంగలు, క్రూరమృగముల నుండి రక్షించుకోండి. ఉల్లాస ప్రయాణాలు, యాత్రలు, నాటకాలకు ప్రశస్తమైనది. ఆటోమేటిక్ 50 షాట్లు ఏర్పాటు గలదు. తేలికైనది. ఇందు నుండి వెలువడు నిప్పు రవ్వలు మిమ్ములను కాపాడును. ధర: 50 షాట్లు గల నెం.33 రు.13/50 జర్మన్ మోడల్ నెం. 99 రు. 15/50. వి.పి. చార్జీలు రు. 2/50. లెదర్ కేస్ రు. 3/50. అదనపు షాట్లు 100 కి రు. 5/-.




**SULEKHA TRADERS, (WAP-13)**
PHAPHALA, ALIGARH

---

ఇండియాలో శ్రేష్ఠమైనది

## బెంగాల్ కెమికల్స్

ట్రాన్స్‌పెరెంటు

## గ్లిజరిన్ సబ్బు

ఈ సబ్బు మీ శరీర చర్మమును శీతోష్ణ వాతావరణ తాకిడుల నుండి రక్షించును. ఇది అన్ని ఋతువులలో వాడదగిన ఆదర్శమైన సబ్బు.







చిన్న పెట్టెలో

కలకత్తా • బొంబాయి • కాన్పూరు

---




మడమ పగుళ్ళు?



## లిచెన్‌సా

వాడండి

DZ 1613 ATG

# మరణించని మహావ్యక్తి శ్రీ చర్చిల్

ఒకప్పుడు ప్రపంచంలో చాలా భాగం బ్రిటిష్ పరిపాలనక్రింద ఉండేది; నేరుగా పరిపాలించబడని ప్రదేశాలుకూడా ఎన్నో బ్రిటిష్ వారి చేతిక్రిందనే ఉండేవి. అందుకనే కొందరు 'కన్సర్వేటివ్' మేధావులు బ్రిటిష్ చరిత్ర ఉజ్వలఘట్టాలే తమకి ఆదర్శమయినవనీ, వాటి స్మృతి ఈనాటికీ తమని ఉద్వేగపరచ గలుగుతున్నాయనీ చెప్తారు. నేటి లేబర్ ప్రభుత్వం పరిపాలనలో ఒకనాటి బ్రిటన్ మహోన్నతస్థితిని గుర్తుకితెచ్చే అంశం ఏదీలేదని బాధపడ్తారు.

ఇతర దేశాలని జయించి వలస ప్రభుత్వాలను ఏర్పరచటం అన్యాయంఅని నేడు అందరూ ఒప్పుకుంటారు. ఏదేశం ఎంత మేలు చేసినా దాస దేశం ఒకప్పుడు విముక్తిఅయి తీరాలనేది లోక సామాన్యం అయిపోయింది. కాని పర ప్రభుత్వాలని ధిక్కరించేవారు సయితం గతంలో తమ దేశ ప్రతిభని తలుచుకుని సంతోషించకుండా ఉండలేరు. స్వరాజ్యాభిమానులే ప్రాచీనకాలంలో ఆసియా ఆగ్నేయ ప్రాంతాలలో భారతదేశం స్థాపించిన రాజ్యాలని తలుచుకుని గర్వపడ్తారు. 'గ్రేటర్ ఇండియా' అనే పదజాలం చరిత్ర పుస్తకాలలో కనిపిస్తూ ఉంటుంది. గతాన్ని మార్చలేము కాబట్టి వర్తమానంలో వలస రాజ్యాల స్థాపనకి ప్రయత్నించటంలేదు. కాబట్టి కేవలం భారత దేశపు 'సాంస్కృతిక వైభవాన్ని' తలుచుకుని సంతోషిస్తున్నామని ఈవిధంగా గర్వపడేవారు సమాధానం చెప్పవచ్చు. 'సంస్కృతి', 'రాజకీయాలు'



వేరు చెయ్యటం సాధ్యం అవుతుందా? అనే ప్రశ్నకి సమాధానం దొరకటం కష్టం. కాని గతంలో కాల్పనిక జగత్తునొక దానిని సృష్టించుకుని దాని ప్రమాణాలనే వర్తమాన పరిస్థితులకు అన్వయించాలని చూసినప్పుడు చిక్కులు వస్తాయి. అందులోనూ తక్కువ వ్యవధిలో పెద్దమార్పులు త్వరగా జరిగి పోతున్నప్పుడు ఈ చిక్కులు మరీ అధికం అవుతాయి. ఇక చరిత్ర గమనంమీదనే ప్రభావం కలవారి జీవిత కాలంలో ప్రపంచం మారిపోతూఉంటే వారిలో ఏర్పడే ఆందోళన ఊహించటం సాధ్యంకాదేమో!

విన్స్టన్ లిస్సర్ చర్చిల్ 19 వ శతాబ్దం రెండవ భాగంలో జన్మించాడు. పెరిగి 'బహిరంగ జీవితం'లో పాల్గొనే కాలానికి చర్చిల్ ఒక గొప్ప వంశంలో పుట్టిన వాడని మర్చిపో కూడదు: అతని పూర్వీకులలో ఎందరో మహా సేనానాయకులు ఉండేవారు—యూరప్‌లోనూ, ఆసియాలోనూ కూడా కొన్ని సంచలనాలు బయలుదేరాయి. భారతదేశంవంటి ప్రాంతాలలో స్వాతంత్రోద్యమాలు ప్రారంభం అయ్యాయి. జర్మనీ బ్రిటన్‌తో పోటీ పడటానికి సిద్ధం అవుతోంది. మొదటి ప్రపంచ యుద్ధం మొదలు అవటానికిముందు చర్చిల్ ప్రభుత్వంలో గొప్ప స్థానం సంపాదించుకున్నాడు. బ్రిటన్ యుద్ధ సన్నాహాలలో కొత్త ప్రాణం పోశాడని చరిత్రకారులు అంటారు. జర్మనీ ఓడిపోయింది. జయించినవారు జర్మనీకి ఎన్నో శిక్షలు వేశారు. వీటి తీవ్ర స్వభావం తిరిగి ఏదో ముప్పుకే దారి తీస్తుందని గుర్తించిన వారిలో చర్చిల్ ఒకడు. ఎవరు ఎన్ని చెప్పినా జరగవలసినదంతా జరిగి రెండవ ప్రపంచ యుద్ధం వచ్చేసింది. సరయిన నాయకుడులేక అయోమయంలో మునిగిఉన్న బ్రిటిష్ ప్రజలు చర్చిల్‌ని 'ఆశ్రయించారు.' ఆయన శత్రువులు సయితం చర్చిల్ నాయకత్వాన్ని స్వీకరించారు. చర్చిల్ మాటలలోనే చెప్పాలంటే అది అతని 'ఫైనెస్ట్ అవర్.'

అమెరికా సహాయంతో మిత్రరాజ్యమండలి జర్మనీని ఓడించింది. కాని యుద్ధం ముగిసిన తర్వాత బ్రిటన్ తన సామ్రాజ్యాన్ని నిలబెట్టుకునే పరిస్థితిలోలేదు.

చర్చిల్ సామ్రాజ్యాన్ని, క్రమంగానయినా వదులుకొనటానికి ఇష్టపడలేదు. ఆయనే ప్రధానమంత్రిగా ఉంటే ఏమి జరిగేదో చెప్పటం కష్టం కాని లేబర్ ప్రభుత్వం రావటంతో భారత దేశం మొదలు ఎన్నో దేశాలు స్వాతంత్ర్యం పొందాయి. బ్రిటన్ మునిగిపోకుండా రక్షించటానికి ఇంకెవరూ చెయ్యనంత చేసిన చర్చిల్ చివరికి బ్రిటిష్ సామ్రాజ్య క్షీణాన్ని స్వీకరించవలసి వచ్చింది. 1947 ప్రపంచానికి 1964 ప్రపంచానికీ చాలా భేదం ఉంది. చరిత్ర గమన వేగమే హెచ్చు అవుతోందేమో! ఏది ఎలా ఉన్నా విన్స్టన్ చర్చిల్ జీవించి ఉన్నప్పుడే చరిత్రలోకి వెళ్ళిపోయాడు. అందుకనే, ఆయన మరణం ఎవరికీ ఎంత విషాదం కలిగించినా కెన్నెడీ, నెహ్రూల మరణాలవలె ప్రపంచాన్ని కదిలించి వెయ్యలేదు!

—ఒక విలేఖరి ★

బీచ్‌లో చల్లగాలి 'స్వేచ్ఛపోవడానికి' దోహద పిస్తోంది.

ఆలోచించవలసిన విషయం నిద్ర 'పోవడానికి' దోహదం ఇస్తుంది. తలకింద రెండు చేతులు పెట్టుకుని, ఇసుకలో వెల్లకిలా పడుకున్నాను. నాన్నగారికి కోపం ఎక్కువ. అవతలి వాళ్ళను మాట్లాడనీయరు. అన్నిటి విషయం వదిలేసినా పెళ్ళివంటి విషయాల్లో కూడా—ఇవతలి వాళ్ళ ఇష్టా ఇష్టాలకు తావివ్వకపోతే ఎలా— పోనీ అమ్మయినా— నా మనస్సులో విషయం గ్రహించి, నాన్నగారితో చెప్పకూడదూ.

"ఆ పిల్లకేరా బంగారు బొమ్మలా ఉంది" అంటుంది.

"పోనీ యూనివర్శిటీలో ఎవర్నయినా ప్రేమించావా" లనడిగారు నాన్నగారు.

"ఛ" అన్నా డతను.

తనెవరినీ ప్రేమించలేదు. ప్రేమించడమనేది అంత తేలికయిన పనికాదు. అది కూడా ఒక కళే! ఆ మాటకొస్తే అదే గొప్ప కళ

మరి నీ "అభ్యంతరం దేనికి" అన్నారాయన.

ఉంది. కానీ చెప్పడం కుదరదు తనకు. చెప్పలేదు తను.

నా ఆలోచనలు తెగకముందె శేషగిరి వచ్చాడు. నా మౌనానికి కారణం అడిగాడు. నా సమస్య శేషగిరికి చెప్పాను. శేషగిరి చాలా తెలివైనవాడు. స్నేహంకోసం ప్రాణం వదులుతాడు నేను విషయం చెప్పగానే బుర్ర గోక్కుని, 'కొత్త రకంగా ఉంది అన్నాడు.

'నీ ఉద్దేశ్యం ఏమిటి? నువ్వే నా స్థానంలో ఉంటే ఏం చేసేవాడివి" అన్నాను లేచి కూర్చుంటూ. శేషగిరి సముద్రం వంక కాస్సేపు చూసి అనక గగనంవైపు చూశాడు గొంతు సవరించుకున్నాడు.

"నాకూ ఆ రకం నమ్మకాలున్నాయి. లోకంలో చాలామంది కీరకం నమ్మకాలుంటాయి. వీటినే మూఢ నమ్మకాలంటారు కానీ ఆ నమ్మకాలు మనలో బాగా పాతుకుపోయాయి. అంతెందుకు? పనిమీద వెళ్తున్నప్పుడు ఎదురుగా కిరసనాయిలు, కట్టెపుల్లలు వంటివి వస్తే ఆ పనిమీద ఇక బుద్ధి కాదు నాకు. అంత చిన్న విషయాలకే అంత పట్టింపయితే ఇక వివాహంవంటి విషయాల్లో ఆ నమ్మకాలని వదులుకోడం జరగని పని" అన్నాడు.

నాకు కావల్సిన సలహా అదే నేను స్వేచ్ఛగా గాలిపీల్చి వదిలాను. "అయితే ఏం చెయ్యమంటావు" అన్నాను.

"మీ వాళ్ళకు ఆ రకం నమ్మకాలు లేకపోయినా సరే నీ నమ్మకం నీది. అది మీ వాళ్ళకు తెలియజెయ్యడమే మంచిది" అన్నాడు నాకూ అదే మంచి దనిపించింది. సమస్య సులభంగా తేలిపోవడంవల్ల మనస్సు తేలికయింది. ఇద్దరం లేచి, హాస్టలు వైపు దారితీశాము.

ఆ మర్నాటి టపాలో నా ఉద్దేశ్యం రాసి, మా నాన్నగారికి పోస్టు చేశాను. దాంతో నా భారం తీరినట్టయ్యింది.

నాలుగు రోజులు గడిచాయి. చిన్ననాటిమిత్రుడు రామం, అతని భార్య సీత సింహాచలం దర్శించుకోడానికి వచ్చారు. రామాని అడగాలనిపించింది. రామం కూడా మూఢనమ్మకాలు లేనివాడే— కనుక సలహా అడిగి, ప్రయోజనం ఉండదు. అయినా "మూఢ నమ్మకాల మీద నీ అభిప్రాయం ఏమిటి?" అనడిగాను.

"ఆ మాటలోనే ఉందిగా అర్థం" అన్నాడు రామం.

"మీ అభిప్రాయం" అన్నాను సీతనుద్దేశించి.

"ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికి తెలుసు? దేన్నీ కొట్టి పారెయ్యకూడదు" అంది సీత. నాకు ఆమె చెప్పిన దాంట్లో సత్యం ఎక్కువ కనుపించింది.

రెండ్రోజులుండి వాళ్ళు వెళ్ళిపోయారు. బి. య్యే. చదివే రోజుల్లో రామం మా క్లాసుమేట్ సీతను ప్రేమించాడు. సీత కాలేజీ మొత్తానికి ఒక అలంకారం అనే వాళ్ళు అందరూ. అలాటి పిల్లను ప్రేమించిన వాళ్ళు చలా మంది ఉన్నారు. పైగా రామం పెద్ద అందగాడు కాడు. కాని మంచి విగ్రహం.... అయితే ఏం? అదృష్టవంతుడు.... సీతని పొంద గలిగాడు ... నా చేత ఆమెకు రాయబారం నడిపేవాడు. .. బెజవాడలో మా ఇంటి పక్క వాటాలో ఆమె, తలిదండ్రులు ఉండేవారు. నాకు ఆ రకంగా సీతతో పరిచయం ఏర్పడినా, కష్టపడి రామం గురించి గొప్పగా చెప్పేవాడిని.... చివరికి నా చేతుల మీదుగానే వాళ్ళ పెళ్ళి జరిగింది. రైలెక్కి వెళ్ళేముందు, "ఇకనైనా ఓ ఇంటి వాడివి అవు త్వరగా అన్నాడు రామం." అవును ఈ సారి మీ శ్రీమతితోనే మాకు మీరు కనుపించాలి" అంది సీత నేను నవ్వేసి వూరుకున్నాను.

* * *

రెండ్రోజులు గడిచాయి.

నాన్నగారి దగ్గ నుంచి ఉత్తరం వచ్చింది. విప్పి చదవడానికి భయం వేసింది. అయినా విప్పి చదివేను. ఆ రకం మూఢనమ్మకాలని దుమ్మెత్తి పోశారు. నా దుర్బలతకు జాలి పడ్డారు. ఆ పద్ధతిలో అయితే నేను జీవితంలో ఒక్క అంగుళం కూడా పైకి వెళ్ళలేనని వక్కాణించారు. అలాటి వూహలను నా మనస్సులో ప్రవేశ పెట్టిన వాళ్ళను చిత్రవధ చెయ్యాలన్నారు.

నా బుర్ర తిరిగి పోయింది అప్పుడే రూములోకి వస్తున్న శేషగిరికి ఉత్తరం చూపించాను. శేషగిరి ఉత్తరం చదివి, "మీ నాన్నగారు చాలా ఘాటు మనిషోయ్" అని, "ఏది ఏమైనా నీ అభిప్రాయం రాశావు గదా చాలు.." అన్నాడు నిజమేననిపించింది.

* * *

దశరా శలవులిచ్చేరు. ఇంటికి వెళ్ళాలంటే తగని భయం పట్టుకుంది. ముఖతా మరోసారి ఝాడించి పారేస్తారు నాన్నగారు. అయినా తప్పని సరిగా బయల్దేరాను. రాజమండ్రిలో దిగి, రాజవరం వెళ్ళాను. బొబ్బర్లంకలో లాంచ్ దిగి, రాజవరం టిక్కట్టివ్వమని ఒస్సు కండక్టర్నడుగుతే, "అన్నీ త్రూ లే సార్. రాజవరం, పేరారం కొయ్యం" అన్నాడు

"ఏడిశావ్ వెధవ కూతలు, కోతలు నువ్వూను" అనుకుంటూ సంచి ఎడం చేతిలోనికి మార్చుకుని ఆ రెండు మైళ్ళు నడక ప్రారంభించాను. కాలవ గట్టునే రామం కనుపించాడు. మూరుమేళ్ళ రైతులా వున్నాడు. తువ్వాలు భుజం మీదుంది. చేతిలో కర్ర ఉంది. వెంచేకట్టి, విడిచాడు. నన్ను చూస్తే బ్రహ్మానందపడ్డాడు. ... ఇంటికి వెళ్ళాము. సీత లోపల పని చేసుకుంటున్నట్టుంది. బయట కనపడలేదు.

* * *

"సీతా హంస .... హంపొచ్చాడు" అన్నాడు రామం, తన సీత మధ్య ప్రణయం నడిపినందుకు నన్ను నలదమయంతుల మధ్య ప్రణయం నడిపిన హంసతో పోల్చి 'హంస' అయాడు సీత గమ్మున వచ్చి, "ఒక్కరే వచ్చారా! పెళ్ళి చేసుకుని మీ ఆవిడతో వచ్చారనుకున్నాను" అంది. ముగ్గురం నవ్వేశాము.

రామం లైటు వెలిగించాడు. సీత గూట్లో ఉన్న సబ్బు మీది నురగ తీసి నుదుట పెట్టుకుని, దాని మీద కుంకుమ అద్ది పక్కలకు చెదిరిన భాగాన్ని వేలుతో దుర్చింది. నా దృష్టి ఆమె నుదురు మీదకు పోయింది. చక్కని విశాలమైన నుదురు ఆ నుదుట పడే ముంగురులు. కళకళలాడుతూ లక్ష్మీ దేవిలా ఉందామె. ఆ నుదుట పావలా కాసంత కుంకుమ పెట్టింది.

"ఏం అలా చూస్తున్నారు" అంది సీత తనవేపే చూస్తున్న నాకేసి చూసి నవ్వుతూ. "ఏం లేదు" అన్నాను నేను ఆమె మరోసారి నవ్వి, "తిలకం మాని కుంకం పెట్టేనేనా... ఈవూరు వద్దతిది... పట్నం వద్దతది అంది. నేను నవ్వేసి, మరి అన్నాను.

నాలుగు రోజులు ఆ వూళ్ళో ఆనందంగా గడిపి, ఐదో నాడు మా వూరు చేరాను. అదృష్టం కొద్దీ నాన్నగారు ఇంట్లో లేరు. అమ్మ బయటికి వచ్చి ఆప్యాయంగా పలకరించి, "అదేమిట్రా అంత చిక్కి పోయావు" అంది. "ఛలేదామవి. నేనెక్కడ చిక్కాను. నీ కంటికి చిక్కినట్టు కనబడతాను గానీ—" అన్నాను పెట్టె లోపల పెడుతూ. ఇంతలో ఉష వచ్చింది. వస్తూనే, "అన్నయ్యొచ్చాడు" అని అరుపరిచి, "నాకేం తెచ్చావ్" అని అడిగింది. తెచ్చిన బొమ్మలు, బిస్కట్లు గుమ్మరించాను.

సాయంకాలానికి నాన్నగారు వచ్చారు. "ఎప్పుడొచ్చావ్" అని పలకరించి, లోపలకు వెళ్ళిపోయారు. నా గుండె దడదడ లాడింది. రాత్రి భోజనాలయ్యాక, నాన్నగారు మేడ మీదికి రమ్మని ఉషచేత కబురు పంపారు. నా నరనాడులూ స్తంభించి పోయాయి. అమ్మ నా అవస్త చూసి, "అంత భయం ఎందుకురా— పిల్ల ఎందుకు నచ్చలేదని అడుగుతారనుకుంటా—" అంది.

"ఆ సంగతి రాశాగా" అన్నాను.

"నువ్వయితే రాశావురా. ఆ సంగతి వాళ్ళకి మేం ఎలా రాయం? అదేమైనా రాస్తే నలుగురూ నవ్వరూ— పైగా వాళ్ళకి, మనకి చుట్టరికం కూడా కలిసిందట. మన సంబంధం చేసుకోవాలని వాళ్ళు ముచ్చట పడుతున్నారు." అని "పదలే వెళ్ళు" అంది. గుండెకు ధైర్యం చెప్పుకుని, పైకి వెళ్ళాను. నాన్నగారు ఆరు బైటకుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నారు. నన్ను చూసి, "కూర్చో" అన్నారు. ఎదురుగా ఉన్న మరో కుర్చీలో కూర్చున్నాను. ఒక్కక్షణం నిశ్శబ్దం రాజ్యం చేసింది.

ఆ శబ్దం తరువాత తన్ని వెర్రితేరా వెలిగిస్తుందని నాకు తెలుసు. సిద్ధంగా ఉన్నాను.

"ఆ ఒక్క అభ్యంతరమేనా— లేక కట్నం కానుకలులాటి కోర్కెలేమైనా ఉన్నాయా— లేక ఎవరినైనా ప్రేమించి, పెళ్ళి చేసుకుంటానని మాట ఇచ్చావా ?" అన్నారు.

"లేదు" అన్నాను నేను.

"పెళ్ళి చూపులకు వెళ్ళి, ఏవంకాలేని పిల్లను చూసి, మాకెందుకో మీ అమ్మాయి నచ్చలేదని ఓవంక పెడితే— అనక ఆ పిల్లకి పెళ్ళవ్వాలంటావా— ఫలానావాళ్ళు వచ్చి చూశారట. వాళ్ళకెందుకు నచ్చలేదో అనే అనుమానం రాదూ. ఆ పిల్లకిక పెళ్ళి కావాలంటావా ? పైగా లక్ష్మీదేవిలాటి పిల్ల— అమ్మ ముచ్చట పడింది— సరే.... నీ పెళ్ళి విషయంలో మమ్మల్ని పోక్యం కలగజేసుకోవద్దు అని హెచ్చరించడానికి ఈ సాకు చెపితే.. ఇక జన్మలో మళ్ళీ ఈ మాట ఎత్తను. ఇవిగో.. ఆ పిల్ల తండ్రి మనకి రాసిన ఉత్తరాలు.... మధ్యవర్తి శంకరం మధ్యన వస్తున్నాడు నరిగి" అంటూ ఓకట్ట ఉత్తరాలు నా చేతికిచ్చారు.

నేనా ఉత్తరాలను ఒళ్ళో పెట్టుకుని కూర్చున్నాను.

"కిందకు వెళ్ళి అమ్మ ముఖంకేసి చూడు. తిరుపతి వెళ్ళి అక్క ముఖం చూడు. వాళ్ళక్క నుదురు ఎంతేసి ఉందో చూడు. నుదురు చిన్నదయితే ఆ పిల్ల 'విధవ' అవుతుందని ఏ బుద్ధిలేని వాడు నీకు నూరిపోశాడు ? ఐదోతనం నుదురు సైజును బట్టి ఉంటుందా ? నాకు పెళ్ళయి నలభై ఏళ్ళయింది. మీ అమ్మ నుదురు ఎంత చిన్నదో చూడు. అక్కకి పెళ్ళయి పదిహేనేళ్ళయింది. అక్క నుదురు చూడు. కాని నీ కోసంగతి చెప్పావని పిలిచాను. ఈ రకం అనుమానాలు పెట్టుకుంటే జీవితంలో అంగుళం ముందుకు పోలేవు. రేపు యూనివర్సిటీ పరీక్షలు అయ్యాక వాడు ప్రారం

# లిఖితా రేఖా

భిస్తారు. అప్పుడువాడు ఏదైనా ఉద్యోగంలో జేరాల్సి వస్తే షష్టికలహం అనివార్యమేస్తావా ? జీవితం నాశనం చేసుకోడానికి ఇలాంటి మూఢ చెత్త నమ్మకాలు బాగా పని కొస్తాయి." అన్నారు.

నేను ఊపిరి బిగపట్టి వింటూ కూర్చున్నాను.

"నువ్విక వెళ్ళచ్చు. ఆ ఉత్తరాలొక్కసారి చదువు. ఆడపిల్లల పెళ్ళి చెయ్యడానికి తల్లిదండ్రులెంత కష్టపడతారో నీకు కొంచమైనా తెలుస్తుంది." అన్నారు. నేను ఆ ఉత్తరాల కట్ట పుచ్చుకుని, కిందకు వచ్చి, పక్క మీదకు చేరాను. అమ్మ గ్లాసులో పాలుతెచ్చి, "ఇంద.." అని ఇచ్చి, "ఏమిటా ఉత్తరాలు ? ఓహో ఆయన రాసినవా.. ఆ ఉత్తరాలు చదివితే మన లక్ష్మికి మనం పెళ్ళిచెయ్యడానికి ఎంత కష్టపడ్డామో గుర్తుకొస్తుంది. ఐదారు వేలులేందే ఈ రోజుల్లో 'పెళ్ళి' అన్న రెండు ముక్కలు తలవడానిక్కూడా పనికి రాదు" అంది. నేను గ్లాసు ఖాళీ చేసి, మంచం కింద పెట్టి మరో ఉత్తరం తియ్యబోయి, అమ్మ వెళ్ళిక చదవడం మంచిదని ఊరుకున్నాను. అమ్మ గ్లాసు తీసుకుని "అస్సలు నీకీ అనుమానం, ఈ నమ్మకం ఎవరు కల్పించార్రా" అంది. నేను మారుమాట్లాడలేదు అమ్మ వెళ్ళిపోయింది.

లైటార్పేసి, పక్కమీద వాలాను.

నాకీ అనుమానం— భయం, నమ్మకం ఎలా కలిగింది ? అని విషయం మీదికి నా మనసు పోయింది.

"....ఆ రోజు పెళ్ళి చూపులకు రమ్మని నాన్నగారు వ్రాశారు. మెయిల్లో బయల్దేరాను కిటికీ దగ్గర సీటు చూసుకుని కూర్చున్నాను. రైలు రాజమండ్రిలో ఆగింది నేను జనం గోల వింటూ కళ్ళు మూసుకున్నాను. పెట్టెలో అరుపులు పితులు చెప్పడాలు, చెప్పుకోడాలు, నువ్వెంతంటే నువ్వెంతనుకోడాలు ప్రారంభమయ్యాయి. కళ్ళు తెరిచాను. ఓ బుగ్గ మీసాలాయన నా పక్కన కూర్చున్నాడు. నా ఎదురుగా ఉన్నటువంటి సీటులో ముసలాయన ఏవయ్యాడో— ఆ సీటులో ఇద్దరు ఆడవాళ్ళు సర్దుకుని కూర్చున్నారు. వాళ్ళలో ఒకామెకు నలభై పైన ఉంటాయి ఏళ్ళు. పచ్చటి బంగారు ఛాయలో ఉంది. నుదుట రూపాయి కాసంత కుంకుమ పెట్టుకుని ఉంది. చేతులకి పచ్చటి గాజులున్నాయి. నా దృష్టి ఆవిడ పక్క నున్నామె మీదకు మళ్ళింది.

ఆమె లేత తమలపాకులా ఉంది. మేలిమి బంగారు ఛాయలో ఉంది. తెల్లని చీర, రవికా ధరించింది. చేతులకి గాజులు లేవు— అది ఈ రోజుల్లో ఒక ఫ్యాషను. నా చూపులు ఆమె ముఖం వైపు మళ్ళాయి. ఆమె కళ్ళు బాగా వాచి ఉన్నాయి నాకేసి చూసి, గమ్మున తలదించుకుంది నాకేదో వెలితని పించింది. మరోసారి ఆమెకేసి చూశాను

ఉలిక్కి పడ్డాను.

ఆమె నుదుట తిలకంలేదు. పరీక్షగా చూశాను. ఆమె నుదురే అసలు చాలా చిన్నదిగా ఉంది. దాని మీద బొట్టు లేదు— మెళ్ళో.... బోసి మెడ సందేహం లేదు.... ఆమె......

నా ఆలోచనలు పక్క వాళ్ళ మాటలతో ఆగాయి. నా పక్కన మీసాలాయనతో ఆ పిల్ల పక్కన కూర్చున్నావిడ మాట్లాడుతోంది.

"పోనీ అన్నయ్యా పాడు నగలు. మనవా నగల్తోనే పోతావా— ఆ పాడునగల కోసం పిల్లనక్కడ వదిలేస్తే— వాళ్ళు చంపేసినా చంపేస్తారు నానా హింసా పెడుతున్నారట సరిగ్గా కూడు కూడా పెట్టటం లేదట. .. మన పిల్ల మనకి భారమేమిటి.... నా దగ్గరే ఉంటుంది." అందావిడ. ఎంత బింకంగా మాట్లాడినా, చివర మాటలు మాట్లాడేటప్పుడు ఆమె గొంతు బొంగురు పోయింది. నా కళ్ళు ఆవిడ మించి, ఆమె మీదికి తిరిగింది. ఆమె కంటివెంట నీరు టపటప రాలింది. ఆవిడ ఇవతల పక్కన కూర్చున్న మరో ముసలావిడ "ఏ వూరమ్మా" అని ప్రశ్నించింది.

"విడదవోలు" అందావిడ. పక్కావిడ మాటలు కలిపి, సంభాషణ కొనసాగించింది.

ఆ పిల్ల భర్త ఆ పిల్లని ఏరికోరి చేసుకున్నాడని, పెం తిరక్కముందే పొలంలో పాము కరిచి, చనిపోయాడని అత్తారింట్లో కూతురు పడేపాట్లు చూడలేక, వినలేక, కూతుర్ని తెగతెంపులు చేసి తీసుకొస్తున్నట్టు చెప్పింది.

నా హృదయం ద్రవీభవించింది

ఆమె కన్నీరు మౌనంగా విడుస్తూ కిటికీలోంచి బయటకు చూస్తోంది. ఉన్న ఆ కాస్త నుదురు ముంగురుల్లు పడడం వల్ల కప్పుకుపోయింది. ఆమె భవిష్యత్తు జీవితం మీద ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నాను. విడదవోలు వచ్చింది వాళ్ళు దిగి వెళ్ళిపోయారు. మా పెట్టెలో ఆ పిల్ల మీద సంభాషణ ప్రారంభమయింది.

"చూశావా పిన్నీ— ఆ పిల్ల నుదుట కుంకం పట్టుమని పదినాళ్ళైనా నిలవదనుకో— ఆ నుదురు చూశావా— వేలెడు లేదు. అలా ఉన్న నుదుట కుంకం నిలవనే నిలవదు. భగవంతుడు అన్నీ

హలో!– రోజ్ ఎరువుల కంపెనీయేనా?



నిర్ణయిస్తాడనుకో. మా మేనత్త కూతురులేదూ. దాని నుదురు రెండువేళ్ళుండేది పెళ్ళయ్యాక ఓ వారం తిరిగేలోగా మొగుడు చనిపోయాడు. ఏమీలేదు. గుండె ఆగి పోయాట్ట. అది ఓ గుండె జబ్బన్నారనుకో— అయితే ఏం ... ఆ చిన్న నుదురు వాళ్ళ నుదుట కుంకం నిలవవే నిలవదు.''

నా గుండె ఝల్లుమంది.

అంతే అది నాకేదో ముందుగా సూచించినట్టు అనిపించింది. నా మనస్సులోంచి ఆ సంఘటన పోలేదు. ఆ రైలుదిగి, పెళ్ళి చూపులకు మళ్ళీ రైలెక్కాము. ఏలూరులో రాధని చూశాను. రాధ నిజంగా చక్కని చుక్క. ఏ వంకాలేదు— కాని ఆమె నుదురు— రెండు వేళ్ళు కూడా లేదు— నా మనస్సుకు ఎన్ని రకాలుగా నచ్చచెప్పుకుందా మను కున్నా ఆ సంఘటన నన్ను పిరికివాణ్ణిగా చేసింది.

భళ్ళున తెల్లవారింది.

యాంత్రికంగా శలవలు గడిపి మళ్ళీ విశాఖ పట్టణం చేరాను. జరిగిన విషయాలన్నీ శేషగిరికి చెప్పాను. శేషగిరి నిట్టూర్చి, ''అసలు ఆ మాట నువ్వు బయల్దేరక పోయినా ఆ చిన్న నుదురు సంఘ టన చూసి ఉండక పోదువు— బాగుండిపోను'' అన్నాడు. కానీ అలా జరగలేదు కదా ! అదే దైవ ప్రేరణ. నాకు దేవుడో చిన్న సూచన చేసి నట్టనిపించింది. నా అనుమానం మీదే నాకు నమ్మ కం ఏర్పడింది.

రోజులు పొడిగా దొర్లి, పొడి నెలలుగా చేశాయి. ఒకనాడు నాన్నగారి వద్ద నుంచి, ఉత్తరం వచ్చింది. అమ్మకి వంట్లో అనారోగ్యంగా ఉందట. నన్ను రమ్మని వ్రాశారు ఓ వారం శలవుపెట్టి వెళ్ళాను అమ్మ బాగా చిక్కిపోయింది. ''ఒరేయ్ రాజూ— నీ పెళ్ళి ఆడపిల్ల పెళ్ళికన్నా ఎక్కువ గొడవైపోయింది. నీ పెళ్ళి చూసే యోగ్యం నాకు ఉందో లేదో'' అంది. నా మనస్సు చాలా బాధ పడింది. ''లేదమ్మా ! అలా అధైర్య పడకు'' అన్నాను.

ఒక వారం రోజుల్లో అమ్మ ఆరోగ్యం నిమ్మ దించింది. తిరుగు ప్రయాణం పెట్టాను. రాజ మండ్రి రైలు చేరేసరికి, రాజవరం వెళ్ళాలనిపిం చింది. గమ్మున రైలుదిగి, లాంచి ఎక్కి, బొబ్బ ర్లంక చేరాను. సంచి భుజాన్న వేసుకుని సరుకు చెట్ల మధ్య నడుస్తూ ప్రకృతి సౌందర్యం చూస్తూ ఆలోచిస్తూ నడక సాగించాను. ఈసారెలాగయినా సరే ఈ 'విషయం' రామంతో చెప్పి రామం సలహా కూడా తీసుకోవాలని నిర్ణయించుకున్నాను. నా చూపులకు దూరాన్న ఒక చోట కూర్చున్న వ్యక్తి కనుపించాడు.

అతను రామం ! !

గబగబ అటువైపు నడిచాను, రామం నన్ను చూసి, లేచి, నిలబడ్డాడు. నిలబడి, ''ఏరా ! ఇదేనా రావడం'' అన్నాడు. ''అవును గాని ఇక్కడ కూర్చుని ఏం చేస్తున్నావ్'' అన్నాను.

''ప్రకృతి చూస్తున్నాను'' అన్నాడు.

అతని ముఖంలోకి చూశాను. అబద్ధం చెపు తున్నట్టు తోచింది. రామం నా చూపులను తప్పించుకున్నాడు. నేను రామం భుజంమీద చెయ్యివేసి ''నువ్వు నిజం చెప్పటంలేదు. నీకు నామీద నమ్మకంలేదా'' అన్నాను.

''ఏం'' అన్నాడు రామం.

''అదే చెప్పమన్నది'' అన్నాను.

''చెప్తా— నడు. నీతో చెప్పకపోతే ఎలా'' అన్నాడు. ఇద్దరం కలిసి కొంతదూరం నడి చాము. రామం చాలా నీరసంగా ఉన్నాడు. తల వంచుకుని, ఏవో అప్పుడప్పుడు ప్రశ్నలు వేశాడు కాని, వెనకటి ఆత్మీయత కనబడలేదు'' 'సీతతో పోట్లాడే వేమిటి ?'' అన్నాను.

''అంతదృష్టం కూడానా'' అన్నాడు.

''అంటే'' అన్నాను.

''సీత పోయింది'' అన్నాడు.

''ఎక్కడికి'' అన్నాను గమ్మున. అంతలో ఆ ముక్కకి అర్థం తెలిసింది. నా పాదాల క్రిందు భూమి కదిలినట్టయింది. ''ఏమి నువ్వనేది ? నిజమేనా. ఎలా జరిగింది'' అన్నాను.

''చెప్తాను'' అంటూ రామం కన్నీళ్ళు తుడుచు కుంటూ ప్రారంభించాడు.

ఇంటి యజమాని (పాల వాడితో): ఏమిటయ్యా! రోజూ పాలు తొందరగా తెచ్చేవాడివి. ఈవేళ ఇంత ఆలస్యమైం దేమిటి?

పాలవాడు : ఏం లేదండి బాబూ ! ఈ దినం కొళాయి ఆలస్యంగా వచ్చింది. అందు వల్ల పాలు తేవడానికి ఆలస్య మైంది. (అని వెంటనే నాలుకను కొరుక్కున్నాడు.)

పి. సురేంద్రనాథ్, (మద్రాసు)

''. . . ఉన్నట్లయ్యింది . . నేను పొలం నుంచి దీపాలవేళ యింటికి వెళ్ళాను. ఇంటినిండా జనం .. అంతే ఏమిటి నడుగుతే .... సీత కాలుజారి నూతిలో పడిందని, ఆ శబ్దానికి పరుగెట్టుకు వచ్చామని వాళ్ళు చెప్పారు నేను పెరట్లోకి పరిగెట్టాను. సీతను అప్పుడే నూతిలోంచి తీశారు నలుగురు పడక గదిలోకి మోసుకు వచ్చారు బిందెకు ఉచ్చు వేసి నీళ్ళు తోడుతుంటే కాలికి తాడు మెలేసు కుని నూతిలోకి లాగేసిం దన్నారు జనం అంతే అయిఉండాలి. అసలే దానికి చుట్టూ గోడ లేదు. చాలాసార్లు చెప్పింది ''గోడ కట్టించండి'' అని అంటూ రామం బావురుమన్నాడు.

''ఊర్కో రామం. మన చేతిలో ఏమి లేదు. అంతా ఆ విధి రాత ప్రకారం జరగాల్సిందే'' అన్నాను.

''అవును వూర్కోడం కన్నా చేసేది ఏముంది? అసలు సీతని చేసుకుంటే నేను బతకనని అంతా చెప్పారు. ఆమె జాతకంలో అలా ఉందిట ! నన్ను చేసుకున్నందువల్లే ఆమె పోయిందేమోననిపిస్తోంది'' అన్నాడు.

నా కదంతా ఓ కథలా అనిపించింది.

ఓ రెండ్రోజులు రామం బలవంతంమీద ఉండి, విశాఖపట్నం చేరాను. ఏమిటో యీ మూఢ నమ్మకాలు .... సీతని పెళ్లి చేసుకుంటే రామం చనిపోతా డన్నారుట .... కానీ సీతే పోయింది .... ఇవి నమ్మాలో, నమ్మకూడదో బోధపడలేదు..... అంతా శేషగిరితో చెప్పాను. శేషగిరి నవ్వేసి, ''ఆ అనుమానాలు లేకపోతే ఫరవాలేదు కాని ఉంటే మాత్రం అవి వదుల్చుకోడమంత తేలికయిన పని కాదని'' చెప్పాడు. నాకు అవుననిపించింది.

కొన్ని నెలలు యాంత్రికంగా గడిచాయి. పరీ క్షలు పూర్తిచేసి, యింటికి చేరాను. రాజమండ్రి రాగానే రామం గుర్తుకు వచ్చాడు నా కళ్ళు చెమ్మ గిల్లాయి మెయిల్ ఏలూరులో ఆగింది. కిటికీ లోంచి బయటకి చూస్తున్నవాడినల్లా ఉలిక్కి పడ్డాను.

రాధ ! !

రాధ, ఆమె తండ్రి పక్క పెట్టెలోంచి దిగి, పెట్టెలో వాళ్లతో ఏదో మాట్లాడుతున్నారు. రాధ నన్ను చూసింది. నేను 'ఆవేళ' చూసినకన్నా యింకా అందంగా ఉంది— రాధని చేసుకోకపోడం నిజంగా నా దురదృష్టమే ననుకున్నాను— రాధ మరోసారి నాకేసి చూసింది . . ఆమె ముఖంలో లేత సిగ్గు కొట్టొచ్చినట్టు కనబడింది. నన్ను చూసేనా ? లేక .. . వాళ్ళ మాట్లాడుకునే మాటలకా ఆ నవ్వు అనిపించింది. తల లోపలకు పెట్టేసుకున్నాను

రాధ— చక్కని చుక్క

అయితేనేం— చిన్న నుదురు. నేను నా నిర్ణ యాన్ని జయించలేను ధైర్యంచేసి వివాహం చేసు కున్నా అది మనస్సులో ఉన్నంతకాలం .... ఇక ఆలోచించలేకపోయాను

ఇంట్లో కూడా అమ్మా, నాన్నగారూ చాలా ముభావంగా ఉన్నారు నా పెళ్లి విషయం వాళ్లకి పెద్ద సమస్య అయిపోయింది నాన్నగారు లాంఛ నంగా పలకరించి, ''పరీక్షలు బాగా రాశావా .... ఆమాట కాస్త అడిగే అధికారం నాకు లేదనుకో ... నీ కెందుకని నువ్వడగమ్ము . అయినా ఉండబట్ట లేక అడిగాను'' అన్నారు. తల నేలకేసి బాదుకుని చద్దామనిపించింది. అమ్మ ఆ రాత్రి భోజనం దగ్గర మళ్ళీ కదిపి, ''ఆ పిల్ల తండ్రి వచ్చాడురా మొన్న.... పాపం, కట్నం యిచ్చుకోలేని పిల్లను పెళ్లవడం అంటే మాటలు కాదు పాపం కట్నం వద్దన్నామని మన సంబంధం కోసం యిదైపోతు న్నాడు ఇంకోటి ఇంకోటి అయితే తెగేసి చెప్పెయ్ .. ఈ సంగతెలా చెప్తాం ... పెళ్లి లవేది దేవుడు ఎవరెవరికి రాసిపెట్టాడో'' అంది.

కట్నపిశాచి అలా ఎంతమంది ఆడపిల్లల జీవి తాలు బలిచేస్తోందో— ఎంతమంది ఆడపిల్లల తలి దండ్రుల మనస్సులు ముక్కలుగా అవుతుందో . .... నా మనస్సుకు ఎంత నచ్చచెప్పుకున్నా కుదర లేదు. రానురాను నా మనస్సు మొండికేసింది. ఓ నెల గడిచింది

ఇంట్లో— ఆ వూళ్లో ఉండలేక, తిరుపతి అక్కయ్య యింటికి వెళ్లాను. నెలరోజులు హాయిగా వూరంతా తిరుగుతూ, దేవుళ్లని దర్శిస్తూ— సాయంకాలాలు కపిలతీర్థం వైపు వెళ్లి ఏకాంతంగా కూర్చుని ఆలోచనలతో గడిపాను— రాధ నా మన

మ్మాలో వెలిగాని ముద్ర వేసుకుపోయినట్లే ఆ రైల్లో సంఘటన అంతకన్నా గట్టి ముద్ర వేసుకు పోయింది.

"మూఢనమ్మకం మనస్సులో ప్రవేశిస్తే అది వదలదు. దాన్ని జయించడం అసాధ్యం ... ఒకవేళ దాన్ని కాదని మనం ఏ పనయినా చేసినా, మళ్లీ అది విజృంభించి .... మానసిక శాంతి లేకుండా చేస్తుంది." అన్న శేషగిరి మాటలమీద నాకు విపరీతమైన నమ్మకం కుదిరింది. నా మనస్సంతా విషకుంభంలా అయ్యింది. చాలాసార్లు బొమ్మ బొరుసూ వేసి చూశాను. కొన్నిసార్లు బొమ్మ పడి, రాధని పెళ్లి చేసుకోవాలని తేల్చింది. మరి కొన్నిసార్లు బొరుసుపడి వద్దని హెచ్చరించింది.

విషయమంతా అక్కయ్యతో చెప్పాను. అక్కయ్య జాలిగా నవ్వింది. "ఆ రైల్లో ఎవరో చెప్పుకున్న కబుర్లు విని యిలా మానసికంగా నాశనం అయిపోతావట్రా .. సంవత్సరం క్రితం ఎలా ఉండేవాడివి.... ఈనాడెలా ఉన్నావు..... నాకు తెలీ కడుగుతాను నా నుదురెంతుందో చూడు .... నీలా అనుమానం పెట్టుకుని మీ బావగారు వస్తుంటేనే రనుకో .... అప్పుడు నువ్వేమంటావు! చిన్న నుదురు కారణానికి పదిహేనేళ్ల కాపరంచేసి వదిలేస్తావా అని దెబ్బలాడవూ? ఆయనకీరకం అనుమానం వస్తే .... నా జీవితం ఏమైపోతుంది చెప్పు ... అమ్మ .... అమ్మ నుదురెంతుంది? నా నుదురుకన్నా చిన్నది ... నాన్నగారైనా పెళ్లి అయ్యేం దిగటే కొమ్మ పెళ్లయి .. ఛీ ముద్ద పెరిగి తిన్నావ నాయనరా .... నువ్వు .. జీవితంలో ముందడుగు వెయ్యాలి గాని, యిలా పాత ఎమ్మ బాలను పట్టుకుని వేళ్లాడుతావా .." అంది.

ఆ రాత్రి అక్క చెప్పిన మాటలు మననం

# లిఖితా రేఖా

చేసుకున్నాను అవును, రాజారావు అక్కని వదిలి పెట్టేసి, "మీ అక్కది చిన్న నుదురోయ్—నేను చస్తే—నాకు నీలాగే భయం పట్టుకుంది.... అంటే తను పోట్లాడడూ .... అవును......

ఆలోచించినకొద్దీ నాలో ఉద్రేకం ఎక్కువయ్యింది. తెల్లారేసరికి రాజారావు కాఫీ తాగుతూ అదే అన్నాడు. "మీ అక్క నుదురు మరీ చిన్నదోయ్—షి అనుమానమే నాకూ వచ్చింది. మీ అక్కకి విడాకులు యివ్వాలనుకుంటున్నాను—అంటే నీ కెంత కోపం వస్తుంది .... నిజానికి ఆ రాధకి ఓ అన్న ఉండి ఉండి, వాడీ మాట వింటే ....." అంటూ నవ్వాడు.

నా బుర్ర గిర్రున తిరిగినట్టయ్యింది.

"అయితే నన్నేం చెయ్యమంటారు" అన్నాను.

"ఆరాధ కనుక నీకు నచ్చితే— ఆవాక్క వంకే అయితే వెంటనే ఆ మూఢాను తోసేసి వివాహం చేసుకో—జీవితంలో తెగించి ఒక్కపని చేసిన వాడివవుతావు. నీ చావు నీ రేఖల్లో ఆ పిల్ల నుదుట రసిన రేఖల్లో ఉంటుందిగాని నుదురు సైజులో ఉండదు. చిన్ననుదుర్ల వాళ్ళందరూ మాంగల్యం నిలవనివాళ్ళూ—పెద్ద నుదుళ్ళ వాళ్ళందరూ మాంగల్యం పోవనివాళ్ళు అనేమీ లెక్కలులేవు. ఇదిగో ఇక్కడి రేఖ— నాకూ నీకూ తెలియదు.... అది నిర్ణయిస్తుంది" అంటూ నుదురుమీద ఎడంచేయి చూపుడు వేలు తాటించాడు.

నాలో చైతన్యం కలిగింది. పెట్టె అడుగున దాచిన రాధ ఫొటో తీసి చూశాను. రాధ నావేపే చూసినట్టనిపించింది అనాడు మధ్యవర్తి శంకరయ్యగారు ఆ ఫొటో తీసుకొచ్చి ఇచ్చారట అమ్మ




వాళ్ళని చూడమని. నేను వెళ్ళేసరికి నేరుగా అమ్మాయిని చూస్తుండగా ఫొటో ఎందుకు అని నాకు చూపించలేదు. తరువాత ఆ ఫొటో నాకు దొరికింది. దాన్ని జాగ్రత్త చేశాను. జేబులోంచి పావలా కాసుతీసి బొమ్మ బొరుసు వేశాను. బొమ్మ పడింది. వరసగా మూడుసార్లూ బొమ్మ పడింది.

రాధను వివాహం చేసుకు తీరాలి. నాలో ఆరాటం ఎక్కువయ్యింది. అంత అనుమానమూ ఎందుకలా మంచులా కరిగిపోయిందో బోధపడలేదు. సాయంత్రం నా అభిప్రాయం అక్కతోను రాజారావుతోను చెప్పాను. రాజారావు భుజంతట్టి "అదీ. అలా ఉండాలి. వెళ్ళి వెంటనే వచ్చేయ్" అన్నాడు. ఆనాడే ప్రయాణమై ఇల్లు చేరాను.

ఇంటికి తాళం!

నాన్నగారు అమ్మ రాజమండ్రి మావయ్య గారింటికి వెళ్ళారని చెపుతూ పక్కావిడ తాళం ఇచ్చింది నా ఉత్సాహం నీరసంగా మారిపోయింది. తాళంతీసి ఇంట్లో పెట్టె పడేసి, కుర్చీలో వాలిపోయాను. స్థిర నిశ్చయానికి వచ్చాక మళ్లీ ఏమిటీ ఆలస్యం..... రాజమండ్రివెళ్ళి నాన్నగారితోను, అమ్మతోను ఈ విషయం చెప్పాలి. ఆ తరువాత ఏలూరు వెళుతూ వెళ్ళి నాన్నగారే సంగతి తెలియజేస్తారు......తరువాత నిశ్చయతాంబూలాలు పుచ్చుకుంటారు......ఆ తరువాత....

కళ్ళు మూసుకున్నాను. నా కళ్ళ ఎదుట వివాహం సీను పూహించుకున్నాను. మనస్సు ఆనందంతో తేలిక పడింది.

రాజమండ్రి వెళ్ళడానికి మళ్ళీ మధ్యాహ్నం వగకు రైళ్ళులేవు......శుభస్య శీఘ్రం అనుకుంటే ఏమిటీ ఆలస్యాలు......

ఇంతలో పక్కింటి కుర్రాడు రెండు కవర్లు తెచ్చి, "మావయ్యా మీకే ఉత్తరాలు మొన్న వచ్చాయి" అంటూ ఇచ్చాడు. ఒకటి నాన్నగారి వద్దనుంచి వచ్చింది. ఏదో తిడుతూ రాసి ఉండిఉంటారు. రెండోదానిమీద రామం దస్తూరీ ఉంది.

విట్టాల్సాను.

పాపం రామం!! ఎంతలో అతని స్థితి ఎలా అయ్యింది!

కవరు తీశాను.

లోపల శుభలేఖ!

రామం పెళ్ళి చేసుకుంటున్నాడా మళ్ళీ!

పోన్లే పాపం అనుకున్నాను

పెళ్ళి తిరుపతిలో......ఈరోజే!!

హ్రేే......అనుకున్నాను.

నా కళ్ళు వధువు పక్కకు చూశాయి.

ఉలిక్కిపడ్డాను.

చేతిలో శుభలేఖ వణికింది.

మొగంటి చెమట పట్టింది. కాళ్ళు వణికాయి.

క్రిందో కూలబడ్డాను.

రాధ!!

నేను పనికిరానివాణ్ణి— జీవితంలో ముందడుగు వేయలేను. నాన్నగారు చెప్పింది నిజం.....బావ చెప్పింది నిజం......

"......లిఖితారేఖా పరిమార్ష్టుం న శక్యతే!!"

బావ, అక్కయ్య నవ్వినట్టయ్యింది.

"....లిఖితారేఖా......"

★

# వనితాలోకం

సహించాలి. వీలున్నంతవరకు అధిక వ్యయాలకు దూరంగా ఉంటే ఇద్దరూ కష్టపడ్డ ఖర్చులకు అలవడ్డారంటే ముందు ముందు సుఖ శాంతులు లభిస్తాయి. పొదుపరులై జీతంలో ఏదో కొద్దిగా నన్నా నిల్వచేస్తే సంతానవంతులయ్యాక ఇబ్బంది పడనవసరంలేదు. ఆమె ఉద్యోగార్హతలు కలదై, ఇరువురికీ ఇష్టమైన ఉద్యోగం లేక టైలరింగూ మొదలైనవి నేర్చుకొని తమ కుటుంబ వ్యయం కొంత తగ్గించవచ్చు.—

## పిల్లలున్న కుటుంబం :

పిల్లలున్న గృహస్థులైతే ఎవరో కొందరు తప్ప చాలవరకు సంసారంలో తాపత్రయం గల వారై ఉంటారు. ఇలాంటి వారిలో ముఖ్యంగా 'స్త్రీని' గురించి చెప్పాలంటే ఈ రకం స్త్రీలు సంసారం జాగ్రత్తగా దిద్దుకొనే వారే ఉంటారు. ఐనా జీతం చాలక నానా ఇబ్బంది పడుతుంటారు. పాపం మానసికంగా, శారీరకంగా బాధ పడినా అంతకంటె ఏం చేయగలగుతారు? ఇద్దరూ ఉద్యోగస్థులైననాడు ఏ రకం సమస్య లేదు లైనా ఈ ఆర్థిక సమస్యలంతగా వేధించవు. అలా కానినాడు తప్పవు. ఐనా వారు సహనంగా ఇంకాస్త కృషి చేసారంటే కొంత ఆర్థిక స్థితి మెరుగవుతుంది. ఒట్టలుతకడం లాంటి పనులు తప్పని భావించేవారు ఇంకా లేకపోలేదు. రెండే చేయరాని పనులు. అంతేకానీ లక్కినవి ఏమైనా సంసార సుఖశాంతులకోసం అనుసరించతగ్గ మార్గాలే ఎవరో నవ్వుతారనే యోచన మానే యాలి. నిజంగా మన సంసారం గడవనినాడు ఆ నవ్వినవారు ఏమైనా సహాయం చేస్తారా? ఈ రోజుల్లో చాకలివాడికి అంతడబ్బిచ్చి ఉతికించు కోవడం మాటలా? పిల్లలు బట్టలు రోజూ మాపేస్తుంటాయి. రోజూ ఇస్త్రీ ఒట్టలు మార్చ గలమా? అలా ఎన్ని బట్టలని ఉతికించుకోగలరు. మధ్యాహ్నం ఖాళీ సమయాల్లో బట్టలుతుక్కోవడం అలవాటు చేసుకోవాలి. పెద్దవాళ్ళవి, మగవాళ్ళ బట్టలు కూడా ఉడకపెట్టడం, నీలిమందుపెట్టి ఆరవేసి ఇస్త్రీ చేయడం నేర్చుకొని వో ఇస్త్రీ పెట్టెకొనుకున్నారంటే ఖర్చు కూడిరావడమేకాక, ఒక్కొక్కరికి నాలుగైదు జతలున్నా సరిపోతాయి. ఈవిధంగాఐతే ఇంటి ఇల్లాలికి కూడా ఎక్కువ వస్త్రాలు కావాలన్నా సమస్య ఉండదు. ఎలా గైనా ప్రయత్నించి కాఫీ మాన్పించి చద్దన్నం అలవాటుచేస్తే పిల్లలకి ఆరోగ్యకరము. ఇక కూరలు సంగతి చెప్తే ఈ రోజుల్లో కూరల ధరలు చూస్తుంటే ఎన్నటికొని వండగలరా అనిపిస్తుంది. చిన్న పెరడుంటే ఎక్కువ ఖర్చు పెట్టక్కర లేకుండా శ్రమవల్ల ఫలించేవి చిక్కుడు, బీర వంటిపాదులు, కాయగూరల మొక్కలు పెట్టి సాయంకాలం పిల్లలచేత రోజూ నీరు పోయిస్తూ పాదులు చేయిస్తూవుంటే వారికి ఆరోగ్యంతో పాటు ఇంటికి కొన్నన్నా కూరలు లభిస్తాయి. అంటే పెరటి తోటవల్ల ఇక కూరలే కొనక్కర లేదనికాదు కానీ కొంతైనా ఉపయోగిస్తాయి. ఈ రోజుల్లో కిలో ఆరణాలు అమ్మే బీరకాయలుకొని నలుగురు పిల్లలున్న ఏ తల్లి సరిపెట్టగలదు? అందుకే వాటి పైపెచ్చు కూడ పడేయ్య డానికి ఇష్టపడని తల్లులు కొందరు వాటిని కూడా పచ్చడి చేస్తున్నారు. చేయక మరేం చేస్తారు. కాలం అలా ఉంది.

ఈ రీతిగా అనేక రకాలు ఆ భార్యా భర్తలు పొదుపరులుగా ఉండిననాడు శారీరక శ్రమ ఎంతైతే మాత్రం ఒకరంటే ఒకరికి ఎంతో అభిమాన ముతో సంతృప్తిగా జీవిస్తారు. ఎంత శ్రమకోర్చి అయినా తమ పిల్లలైనా సుఖపడాలనే ఆకాంక్షతో శ్రద్ధగా చదివిస్తారు. తాము ఎంత బాధపడినా తమ బిడ్డల శ్రేయస్సు కోరతారు. ఒకోసారి కొడుకు కాలేజీఫీజు కట్టలేక సతమతమయ్యే కాలములో భర్తకు తమ చేతి బంగారు గాజులు తాకట్టు పెట్టి డబ్బు తెచ్చి పెట్టమనే తల్లుల్ని ఎంతమందిని చూడటంలేదు. దేనికోసమిదంతా? ఈతరం ఇలా గడచినా ముందుతరం వారైనా సుఖ పడాలనేగా తాపత్రయం. ఇవన్నీ సరిగా ఒరిగితే సరేసరి లేక ఎవరిలో లోపమున్నా ఆ సంసారం ఎలాగుంటుందో వేరే చెప్పక్కరలేదు.

ఇక సామాన్య సంసారాల్లో జీవిస్తూ తోటి వారిలా ఉండాలనే కోర్కెలతో ఉండే పిల్లల సంగతి. పిల్లలు చిన్నవారైతే ఆర్థిక పరిస్థితులు తెలియక తమతోటివారిలా ఉండాలని ఏవేవో కోర్కెలు వెలి బుచ్చుతారు తల్లితండ్రుల దగ్గర. ఆ కోర్కెలు విని 'బిడ్డల కోర్కె తీర్చలేని వారముకదా?' అని వారు బాధపడతారు. ఇక సమవయస్సు, యుక్త వయస్సు వచ్చిన పరిస్థితులు కొద్ది కొద్దిగా అర్థం చేసుకొంటున్నా తీరని కోర్కెలు గురించి బాధ పడేవారు కూడా ఉన్నారు. వీరు ఇంటిలో పరిస్థితిని ఎరిగున్నా తమ స్నేహితులలాగ తమకు కూడా అన్ని రకాలు (అన్నికాకపోతే కొన్నైనాసరే) ఉండాలని అనుకుంటారు. అసలు యుక్త వయ సులో ఎన్నో సరదాలు ఉండటము సహజమే. కానీ తీరని పరిస్థితులలో సర్దుకుపోగలగాలి. తమ ఇంటి పరిస్థితిని అర్థం చేసుకొనే సానుభూతి ఉన్నవా రైతే తమలో తామే బాధ పడి వూరుకుంటారు. అలా లేనినాడు అమ్మ దగ్గర, నాన్న దగ్గర తేలి పోయేవారు కూడా ఉన్నారు. విరిసీ విరియని జీవిత సమయంలో కోర్కెలుండటం సహజమే కదా? కొందరబ్బాయిలకు కాలేజిలో తమ స్నేహి తుడు అందమైన సూటు వేసుకొని వాచి పెట్టు కొని తిరుగుతుంటే తమకు ఏదో లోటు అని పిస్తుంది. దాంతో కుటుంబ ఆర్థికస్థితి అర్థం చేసుకోకుండా తన కోర్కెలు వెలిబుచ్చి అవి తీరే వరకు వూరుకోరు. ఇంట్లో ఏ తీరుగా గడచినాసరే ఇక అబ్బాయి చదువు పూర్తి అయి ఆఫీసరైతే తమ కష్టాలు గట్టెక్కుతాయని తల్లి తండ్రుల వూహ. అందుకే ఎలాగో వీలున్నంతవరకు అతని కోర్కెలు తీర్చడానికి ప్రయత్నిస్తారు. ఇక యుక్త వయస్సులోఉన్న ఆడపిల్లలు ఏవేవో కోర్కెలతో ఉంటే వేరే చెప్పక్కరలేదు. తన నేస్తాలకు రక రకాల ఆభరణాలున్నాయని, మంచి మంచి ఒట్టలున్నా యని, తనకేం లేవని మథనపడుతుంది. అందులో నగవైనా తనకు రావని, గొడవ పెట్టినా బాధ పడినా ప్రయోజనంలేదని తెలిసి కూడా తల్లి తండ్రులు తీర్చలేరని తెలిసుండి చిరాకు పడుతుం టుంది. కానీ అందరికీ తీరతాయా? తల్లితండ్రు లందరూ తీర్చగలరా—అని ఆలోచించి ఎక్కడి కక్కడే తృప్తి పరచుకొని మనస్తత్వము ఏర్పరుచు కోవాలి.

ఇటువంటి మధ్యతరగతి కుటుంబీకులకు నెల నెల వచ్చే ఆదాయం భుక్తికి సరిపోతుంటే ఇంక మిగిలేదేముంది. ఇటువంటి కుటుంబాలలో తల్లి తండ్రులకు కన్యల వివాహ సమస్య ఒక గడ్డు సమస్య దానిని ఏవిధముగాను దాటలేక చివరికి అప్పులుచేసి, ఆ సమస్య తీర్చుకొనేప్పటికి రిటయి రయ్యేకాలము సమీపిస్తుంది. కొడుకు ప్రయో జకుడయ్యేడు అని సంతోషించే కాలము అనాటకీ అందదు. కోడలొచ్చి తన మావగారు అప్పుచేసి భర్తకు అంటగడుతున్నారని ఆమెకు కోపం. ఇలా నడుస్తుంది మధ్యతరగతి కుటుంబీకుల ఆఖరి అధ్యాయము. సామాన్యంగా ఈ రీతిగా నడుస్తాయి ఆర్థిక చిక్కులతో. ఎవరో అదృష్టవంతులకు మినహా చాలమందికి ఇవి తప్పవు. ★



# "మధ్యతరగతి జీవనపరిధి..."

కుమారి కాకర్లపూడి జయలక్ష్మి

ఈ మధ్య చాలా వ్యాసాలు చూస్తుంటే రచయిత్రులదృష్టి భాగ్యవంతుల పరిసరాలకు అనుగుణంగా ఉంటుందేమో అనిపిస్తుంది. లేక వారు భాగ్యవంతులై మధ్య తరగతి కుటుంబీకుల పరిస్థితులు తెలియకనో ఏమో ఏ వ్యాసం చూసినా వెయ్యిగైదు వందలపైన జీతం వచ్చేవాళ్ళకే వర్తించేటట్లు వ్రాస్తున్నారు. ఇలా ఎందుకన్నానంటే ఈ మధ్య ఏదో వ్యాసములో ఓ రచయిత్రి "పొదుపుగా సంసారం గడుపుకోడానికి చాకలి ఖర్చు తగ్గించుకోడానికి రెండు పట్టు చీరలు(కనీసం అరవై, డెబ్బై రూపాయల ఖరీదువి) కొనుక్కొని కట్టుకొని ఇంట్లోనే ఉతికి ఆరవేసుకోవచ్చు. వాడవచ్చు" అని వ్రాశారు. పొదుపుగా వాడవచ్చు అన్నైతే మాత్రం సుమారు రెండు వందల రూపాయలు లోపు జీతం వచ్చేవారి భార్యలు అంత ఖరీదువి కొని వాడగలరా? ఎలాగో తంటాలుపడి కొనుక్కున్నా రోజూ వాడడానికి అటువంటివారి మనసు ఒప్పుతుందా? పోనీ అలా వాడినా ఎంతమందివల్ల ఎన్ని రకాల అపహాస్యం పాలవుతారో మనమేమన్నా ఆలోచించగలమా? చుట్టూ ఉన్నవారి విసుర్లు తట్టుకోవడమే కష్టం. "వెంగ ముద్ద లేకపోయినా మీసాలకి సంపెంగ నూనె వాడేవాడట వెనుకొకరు" ఇలాగే ఎన్ని రకాల విమర్శలు, ఇవి తట్టుకోడమే కష్టం. ఇదంతా చూస్తుంటే విద్యావంతులు ధనవంతులు వ్యాసపోటీకు వ్రాస్తుంటే ఆ కోవకు చెందినవారే కాలక్షేపానికి చదవడానికా? అన్నట్లుంది. అటువంటివారేకాని మధ్యతరగతి గృహిణులు సామాన్య జీవన పరిధికి సంబంధించిన వ్యాసాలు పంపరా? ఎందువల్ల అని ఆలోచన కలుగుచున్నది.

సామాన్య గృహిణి ఎంత అనుభవజ్ఞురాలైనా వ్యాసాలు రాయడానికి జంకుతుందేమో? లేక ఆ వ్యాసం పంపడానికయ్యే ఖర్చులు ఆ పూట చంటి పిల్లాడి అనుపాలకైనా పనికొస్తుందనుకొంటుందా? అదీ నిజం కావచ్చు. సామాన్య గృహిణి ప్రతిపైసా జాగ్రత్తగా వాడితేనే నెల పూర్తిగా గడవడం కష్టం. ఇలాంటి ఖర్చులేం పెట్టగలుగుతుంది. సామాన్య జీవిత పరిధి దాటి నడిచేటువంటి వ్యాసాలను చదివి నిట్టూర్పు పూరుకొంటుంది ఎన్నో భావాలు మెదడులో తిరుగుతాయి కనీ తన మనోభావాలను వ్యాసరూపంగా చేర్చి మధ్యతరగతి కుటుంబీకుల ప్రతినిధిగా ఆ వ్యాసం పంపగల ధైర్యం, ఉత్సాహం ఉండవేమో!

ఇకనుంచైనా రచయిత్రులు సామాన్య జీవన పరిధినికూడ దృష్టిలో పెట్టుకొని రచనలు సాగిస్తే బాగుంటుందేమో? అన్నీ అలాంటివే కావాలని కాదు. రెండు రకాల వారికీ ఉపయోగించేలా ఉంటే బాగుంటుందని నా ఉద్దేశం.

ఇవి కేవలం కాలక్షేపానికే కాక, ఆచరణ యుక్తంగా కూడా ఉంటే మంచిది. వ్రాసేవాళ్ళు ఆ పరిస్థితుల్లో లేకపోయినా కాస్త చుట్టుపట్ల చూసినవన్నా అర్థం చేసుకు వ్రాయడానికి ప్రయత్నించాలి. (మధ్య తరగతి కుటుంబీకుల గురించి పూర్తిగా వ్రాయలేకపోయినా కొన్ని వ్రాస్తున్నాను.)

రెండు వందలలోపు ఆదాయం వచ్చేవారి అవస్థ చూస్తుంటే చాలా బాధగా ఉంటుంది. పూర్తిగా హీనంగా ఉండలేరు. అలాగని ధనవంతులుగా ఉండలేరు. కానీ కొంతమంది అలా ఉండాలని ప్రయత్నంలోపడి జీతానికి మించిన ఖర్చులు చేసి అప్పులు తీర్చే మార్గం కానక మానసికంగా కృంగిపోతారు. తలకుమించిన ఖర్చులు చేయకూడదని అప్పటికి తెలుసుకొని ఏం ప్రయోజనం. చేజారిన పరిస్థితికి విచారిస్తే ఏంవస్తుంది. తక్కువ జీతం వచ్చి వెనుకవచ్చే ఆదాయం (ఒక మనవి. వెనకాదాయం అంటే 'లంచం' అని విపరీతార్థం తీసుకోక వెనుకాస్తి పాస్తులు లేనివారు) గురించే నేను వ్రాసేది.

క్రొత్త దాంపత్య జీవితారంభం చేసిన యువ దంపతులతో ప్రారంభిస్తున్నాను

మూహ స్వప్నాలలో ఎన్నో స్వర్గాలు సృష్టించుకుంటున్న యువతీయువకు లిద్దరూ జీవిత భాగస్వాములైన తొలి రోజుల్లో తమ మూహాలను నిజం చేసుకోవాలనుకోవటం సహజం. కాని అవి నిజమవడమే కష్టం. అందులో సామాన్య కుటుంబంలో మరీకష్టం. కొద్దిరోజుల్లోనే తమ ఊహలు, కోరికలు స్వప్న దృశ్యాలని తెలిసొస్తుంది. దాంతో తీరని నిరాశ, నిస్పృహ జీవితంపట్ల ఉదాసీనత ఏర్పడుతుంది. దీనికి చాలవరకు కారణం తమ తమ పరిస్థితులను గమనించుకోకుండా ఏవేవో ఆకాశ హర్మ్యాలను నిర్మించుకోవడమే. దానితో నిజ పరిస్థితిలోకి, బాహ్య ప్రపంచములోకి దిగేప్పటికి నిరాశ ఆవరించుకుంటుంది.

అలాకాక ఇలా పరిస్థితిని అర్థం చేసుకొని తమ జీవితం సాఫీగా ఒడుదుడుకులు లేకుండ గడవడానికి ఇద్దరూ ప్రయత్నిస్తే సరేసరి. లేకపోతే వర్ణనాతీతం. ఏదో వెలితి. నిరుత్సాహం. అక్కడనుంచి ఇద్దరకూ భేదాభిప్రాయాలు బయల్దేరుతాయి. ఇద్దరూ ఎవరికి వారే ఎదుటివారివల్ల తమ ఆనందానికి అవరోధం కలిగినట్లు, ఎందుకో ఒకరంటే ఒకరికి కక్ష బయలుదేరుతుంది నిదానపరులైతే ఒకరి నొకరు సానుభూతితో అర్థం చేసుకొని సంసారం సాఫీగా నడవడానికి ఏర్పరచుకుంటారు. దానికి వ్యతిరేకమే ఐతే ఒకర్నొకరు సాధించుకోవాలని చూస్తారు. ఒకరి చేతలొకరికి విరుద్ధంగా కనిపిస్తాయి. అక్కడ్నుంచి ఎత్తిపొడుచుకోవడం, చిదరించుకోవడంతో సరిపోతుంది. ఇలాగే జీవితమంతా భారంగా గడుస్తుంది. ఇంకో రకం. ఇద్దరూ అనుగుణంగా జీవించినా వారిలోని కొన్ని అలవాట్ల వల్ల ధన రూపంలో చిక్కులువచ్చే ప్రమాదం లేకపోలేదు. అతనికి సిగరెట్లు (విపరీతంగా) కాల్చడం అలవాటైన (డబ్బేసి పేకాట మొదలైనవి ఐతే ఇక చెప్పనే అక్కరలేదు) ఆమెకు చీరలు, గాజులు కొనడం మోజు విపరీతంగా ఉన్నా ఆ సంసారం నెలకి వచ్చే జీతంతో పదిహేను రోజులు గడవడమే కష్టం. అసలు సరదాలు ఉండటం ఎంతవారికీ సహజం. అవి విపరీతమయినపుడు వీలైనంత వరకు తగ్గించుకోవాలి. అలాంటి ఖర్చుల్లో సినిమాలు చూడ్డం ఒకటి జీవితంలో అన్నిటితో పాటు వినోద మొకటి. కనీ ఏదీ మితిమీరకూడదు. వీలున్నంతవరకు మంచివని తోచిన వాటికి మాత్రమే వెళ్ళడానికి ప్రయత్నించాలి (ఈ భాగం చదివి చాలామంది "ఆమాత్రం మాకు తెలియదేంటి ఏదో తెలియని విషయంలా చెప్పవచ్చింది" అనుకోవచ్చు.) కానీ చాలమంది మన స్త్రీలలో కూడా ఉన్నారు. విడుదలైన ప్రతి సినిమాను విడువకుండా చూసేవారును, ఒకటి రెండుసార్లు అంతకంటె ఎక్కువసార్లు చూసేవారు, సినిమా టిక్కెట్లుకు చేతిలో డబ్బు లేకపోయినా పక్కింట్లో చేబదులు తీసుకొని చూసేవారు చాలమంది ఉన్నారన్న విషయం ప్రత్యక్షంగా చూసిన మీదట వ్రాస్తున్నా. రెండు రోజుల్నుంచి కూలి లేక పస్తుండి ఆ రోజు కూలిరాగానే మర్నాటి భుక్తి విషయం కూడా ఆలోచించకుండానే సినిమాకి దారితీసిన పాటక స్త్రీని చూసి ఓ క్షణం ఏమి అనుకోవాలో కూడా తోచలేదు నాకు

మగవారు స్నేహితులతో వెళితే ఖర్చు అధికమవుతుంది. తోటివారిలో తాను తక్కువవకూడదని తాహతుమించిన ఖర్చులు చేస్తారు పైగా అధికారులతో వెళ్ళినపుడు కొన్ని కొన్ని సందర్భాల లోనూ ఎలాగు ఖర్చు తప్పదనుకోండి ఆ విషయం వారి లోపంకాదు.

ఆ స్నేహితులు కూడా ఆర్థికస్థితి గ్రహించ గలిగినవారైతే ఫరవాలేదు. అంతేకాని తమదేం పోతుంది స్నేహితుడే పెట్టుకొంటున్నాడు కదా? అని తమ జల్సా అంతా చూపించే వారైతే కష్టం. ఇది మన విషయంవరకేకాదు. మన స్నేహితులు మనల్ని తీసుకు వెళ్ళినా ఈ విషయంలో జాగ్రత్త



# సోదరి ప్రభావతి వ్యాసంపై కొన్ని అభిప్రాయాలు

సోదరి సవని నిర్మల ప్రభావతిగారి వ్యాసం చదివిన తరువాత ఆహార ధాన్యాల అధిక ధరలను గురించి నాకు తెలిసిన విషయాలు వ్రాస్తున్నాను.

పెద్ద పెద్ద భూకామందుల దగ్గర్నుంచి మామూలు రైతు కుటుంబం వరకు సంవత్సరానికి సరిపడే ధాన్యం నిలువ చేసుకోవటం ఆనవాయితీగ ఉన్నది. ఇక ధనవంతుల విషయం చెప్పనవసరంలేదు. వాళ్ళు ఒక కిలో బియ్యం 3—00 అమ్మినా కొనేందుకు సిద్ధంగా ఉంటారు. ఎటొచ్చి బాధంతా మధ్యతరగతి కుటుంబీకులది. పేదవారిదీను. మామూలు టోకు వ్యాపారస్థుల దగ్గర బంగారు తీగలు కిలో 120 పై. ఏ రోజైన కొన్నామా.

ప్రభుత్వం ఏర్పాటు చేసిన చౌక దుకాణాలలో బియ్యం గోధుమలు, పంచదార ఇవ్వాలని నిర్ణయించారుకాని, బియ్యం తప్ప పంచదార, గోధుమలు కంటికే చూపడంలేదు. ఆ వస్తువులు లోలోపల బ్లాకుమార్కెట్‌లో అమ్ముకొంటున్నారు. బంగారుతీగెలు కిలో 50 పై. ఇవ్వాలని ధర నిర్ణయించితే దుకాణదారులు పబ్లిగ్గానే కిలో 80 పై. అమ్ముతున్నారు. పైగా ఆ బియ్యంలో చెరిసగం రాళ్ళు, నూకలు, వడ్లు కల్తీగా ఉన్నవి. ఉదయం 7 గంటలకు క్యూలో నిలబడితే మధ్యాహ్ననికి బియ్యం దొరికేసరికి బ్రహ్మాండమవుతున్నది. గంటలకు గంటలు క్యూలో నిలబడి బియ్యం తీసుకుంటే వాటినిండుకు కల్తీలు ముక్కు వాసనాను. ఆకలికి అల్లాడే పేదవాళ్ళుతప్ప ఎవరు ఈ చౌక దుకాణాల జోలికి పోవడంలేదు.

మధ్యతరగతి కుటుంబీకులు కూడ ఎట్లాగో అట్లా తిప్పలుపడి అప్పో సప్పోచేసి టోకు వ్యాపారస్థుల దగ్గరే కిలో 120 పై. కొంటున్నారు ఈ క్యూలో నిలబడే బాధ పడలేక

ఈ దుకాణదారులు ప్రభుత్వాధికారులకు లంచంగా ఎంతో సొమ్ము పోసి చౌక దుకాణాలను పెట్టేందుకు పర్మిట్లు పొందుతున్నారు. ఒకే దెబ్బకు రెండు పిట్టలన్నట్లు అటు లంచంగా పోసిన సొమ్ము, ఇటు తమకు లాభాలు రెండు ఒకేసారి లాగుతున్నారు. ప్రజల దగ్గర్నుంచి ఒక కిలో ప్రభుత్వం నిర్ణయించిన ధరకు 30 పై. రెట్టింపుచేసి అమ్ముతున్నారంటే ఇదే సరయిన కారణ మనిపిస్తుంది. పేద ప్రజల రిపోర్టులు వినేనాథుడెవరున్నారు?

పి. సులోచన.

* * *

వార పత్రికలో వనితాలోకం శీర్షికలో ప్రచురించిన "రెండు సమస్యలు" వ్యాసము చదివినాము. రచయిత్రి ప్రభావతిగారు చక్కగ వ్రాసిరి. నేడు ఎవరినోటవిన్నా అధిక ధరలు, అవినీతి గొప్ప వాదోప వాదాలు చేస్తున్నారు ఒకం[illegible] స్పట్లు చట్టాలు చేస్తున్న ప్రభుత్వములోని కొందరు ఘరానా వ్యక్తులు, నాయకులు మారాలి. అధికారుల మామూళ్ల వత్తిడి, రకరకాల పన్నుల వలన రైతులు ఎక్కువ ధరలకు తమ ధాన్యాన్ని అమ్ముకోవలసిన పరిస్థితి ఏర్పడినది. నేడు ఆహార ధాన్యాలమీద ప్రభుత్వ కంట్రోలు పెట్టిన పిదప మార్కెట్‌లో మంచి సరుకు లభ్యమగుటలేదు. పప్పులు, బియ్యం వగైరా ప్రభుత్వమువారు నిర్ణయించిన ధరకు ఎవ్వరూ అమ్ముటలేదు. కారణము అధిక ధరలు గూర్చి అధికారులు ఎట్టి చర్యలు తీసుకొనకపోవుటయే.

మా అనుభవములో పసిపిల్లలకు పనికి వచ్చే "గ్లాక్సో" నేడు బ్లాక్ మార్కెట్‌లో తప్ప సులువుగా లభించుటలేదు. కోపరేటివ్ స్టోర్సువంటి సంస్థలలో గూడ గ్లాక్సోవంటి సరుకులు సలుకుబడి, రికమెండేషన్లు యున్నవారికి మాత్రమే లభించుచున్నవి. సాధారణ వ్యక్తికి కావలసి చో నల్లబజారులో రూ 6 లేక రూ 6—50 పైలకి లభ్యమగును. నేటి అధిక ధరలు, అవినీతివలన మధ్యతరగతి ప్రజానీకము, అవినీతి గిట్టని రచయిత్రి మామయ్యగారిలాంటి వ్యక్తులు చాలా బాధలకు గురియగుచున్నారు. చక్కని వ్యాసము వ్రాసిన సవని నిర్మల ప్రభావతిగార్కి, ప్రచురించిన మీకు మా హృదయ పూర్వక ధన్యవాదాలు.

కూచిభొట్ల సీతామహాలక్ష్మి & కె. సరస్వతి చర్ల వెంకట సత్యవతి.

* * *

నిత్యావసర వస్తువుల ధర తగ్గాలంటే ధర ఎక్కువగాఉన్న వస్తువుయొక్క వాడకం మానేయాలనటంలో ఆ వస్తువు [illegible] పూర్తిగా ఉపయోగించరాదనికాదు. సాధ్య[illegible]వరకు దాని వాడకం తగ్గించాలి [illegible] పదార్థం ముందు ముందు [illegible] రాగానే పోటీపడి ఎలాగైనా కొద్దో గొప్పో నిల్వ చేసేటాన్కి ప్రయత్నిస్తున్నారు ప్రతిఒక్కరూ. అంటే ఈ పదార్థాన్కి అనవసరంగా ముందే డిమాండు హెచ్చుతోందన్నమాట. డిమాండు హటాత్తుగా హెచ్చితే ధర కూడా పెరుగుతుంది కదా. అంటే నిత్యావసర వస్తువుల ధర పెరగటాన్కి మన ఆదుర్దాకొద్దీ చేసే చర్య కూడా కొంత కారణం కాని ధర ఎక్కువగా ఉన్న వస్తువుల వాడకం తగ్గించమన్న మాత్రం [illegible] బాగుంటుందా? గమనించవలసిన విషయమేమంటే జీవితావసర వస్తువుల ధర పెరిగితే మిగతా వస్తువుల ధరలు కూడ తదనుగుణంగా పెరుగుతాయి. అందువల్ల నిత్యావసర వస్తువుల ధరలు అదుపులో ఉంచటం ముఖ్యం. బియ్యం, పప్పులు, [illegible], వాడకం గృహిణుల చేతుల్లో లేదా ధర పెరిగిపోయిన వస్తువుల [illegible] వాడుతూ చాకచక్యంగా నిర్వహించగల్గితే సమస్య పరిష్కారానికి మనం తోడ్పడవచ్చు. కొనుగోలు కోఆపరేటివ్ సొసైటీ షాపులు ఫెయిర్ ప్రయిస్ షాపుల ద్వారా సాగిస్తే సరసమైన ధరలకు పదార్థాలు లభిస్తాయి. అధిక ధరల సమస్యా పరిష్కారానికి మనం చేయూత నిచ్చినట్లౌ అవుతుంది.

రాపాక అన్నపూర్ణాదేవి (విశాఖపట్నం)

* * *

వనితాలోకం దృక్పథం రెండు సమస్యలు అనే శీర్షిక క్రింద సవని నిర్మల ప్రభావతిగారు వ్రాసిన వ్యాసము చదివిన తరువాత ఈ ఉత్తరం వ్రాయదలచుకున్నాను.

ప్రభావతిగారు వ్రాసిన రెండవ సమస్య అవినీతిని గురించి ఈనాటి చిన్న ఉద్యోగస్తుల అవస్థను, వారి ఖర్చులను గురించి ప్రభావతిగారు వారి స్నేహితురాలి ఉత్తరము గురించి వ్రాసిన సమస్య చాలా బాగుంది.

కాని ఈనాడు అనగా గ్రామాధికారుల సమస్య తీసుకుందాము. వారి నెల జీతం సుమారు రూ. 30.00 అయితే వారి ఖర్చులు నెలకు సుమారు రు. 60.00 మించుతుంది. ఎందుకంటే వారిని కొకసారి ఏ రివిన్యూ ఇన్‌స్పెక్టరో లేదా హెల్తు డిపార్టుమెంటువారో లేక తహశీల్‌దారువారో వస్తారు. లేదా ఏ పోలీసు జవానో వస్తాడు.

ఉదాహరణకు మా నాన్నగారు గ్రామ మునసబు (వూరుపేరు అక్కర్లేదనుకుంటాను) ఈమధ్య నేను, మా నాన్నగారి వూరు వెళ్ళినాను. వెళ్ళిన కొద్ది రోజులకే మశూచి టీకాలు వేయువారు వచ్చిరు, ఒకరివిన్యూ ఉద్యోగివారి జవాను ఒకేసారి వచ్చి మూడు రోజులు గ్రామములోనే మకాం చేసినారు. వారి ఖర్చు అంతా గ్రామ మునసబే భరించుకొనవలసి వచ్చినది. మరియు మాకు దగ్గరలోయున్న శ్రీశైలక్షేత్రం దర్శనార్థమై ఏ మంత్రియో లేక గవర్నరు మొదలగువారు పోయిన సంవత్సరములో అయిన ఖర్చులు ఈ గ్రామోద్యోగస్తులపైన వసూలు చేయుటను అన్నట్లు ఈమధ్య గవర్నరుగారి శ్రీశైలము ప్రోగ్రాము. అపుడే పోలీసు జవాను తయారు. కాని ఈ ఖర్చులు ఎక్కడినుండి రాబట్టుకోవలెను. గ్రామరైతులనుండియా? లేదా గవర్నమెంటువారినుండి రాబట్టుకోవలెనా? అనే సమస్య బయలుదేరును. కనుక సవని నిర్మల ప్రభావతిగారు చెప్పినట్లు పైపైకి ప్రభుత్వములోని ప్రముఖ వ్యక్తుల వరకూలోపాయికారిగా ఈ అవినీతి సాగుతున్నదనే చెప్పాలి.

పి. వెంకటశివమ్మ

సెక్రటరీ—మహిళామండలి, రేడియో మహిళా సంఘము వడ్డరామాపురం—కర్నూలుజిల్లా. ★

# ఆశ్చర్యకరమైన క్రొత్త ఫార్ములా

# పెప్సోడెంట్ యొక్క అద్భుతమైన నురుగు మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేస్తుంది

ఎలా అంటే: క్రొత్త ఫార్ములా ప్రకారము తయారైన పెప్సోడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే 'ఇరియమ్-ప్లస్' చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు పళ్లను పాడుచేసే పసుపు పచ్చని పొరను తొలగిస్తుంది. మీ పళ్లు సహజమైన తెల్లదనముతో మెరుస్తూ ఉంటాయి... మీ నోరు పెప్పర్‌మింట్ రుచితో పరిశుభ్రముగా ఉంటుంది.




హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ వారిచే భారతదేశములో తయారుచేయబడుతోంది

JWT-HDL-3469

# అపస్వరం



మూలం: త్రివేణి
అనువాదం: శర్వాణి

## జరిగిన కథ

తల్లిదండ్రుల్ని కోల్పోయి అనాథైన మీరను పెదనాన్న కృష్ణయ్యగారు చేరదీస్తారు. ఆడపిల్ల భారాన్ని నెత్తిన వేసుకోడం వల్ల భవిష్యత్తులో చిక్కులెన్నో ఎదురవుతాయని ఆయన భార్య హెచ్చరిస్తుంది. చదువులోనూ ఇతరవిషయాల్లోనూ ఎంతో చురుకుగా ఉన్న మీరకు పెదతల్లి ఆటంకం ఎదురౌతూ ఉంటుంది. కాలప్రవాహంలో కొన్నేళ్లు గడుస్తాయి. మీర అన్న గోపి డాక్టర్ పూర్తి చేస్తాడు. మీరకూడా కాలేజీలో చేరుతుంది. తనుకూడా డాక్టర్ చదవాలనుకుంటుంది. రాధ, గోపాలం దంపతులవుతారు. శామ్యూ, మీరలు పరస్పరం ఆకర్షించుకొంటారు. శామూతో వివాహానికి పెద్దలుచేసే ప్రయత్నాలు చదువుకోవద్దు మీరకు తెలియవు.

## 5

ఒకరోజు మీర చదువుకుంటూండగా కృష్ణయ్యగారు లోపలికొచ్చారు.

"ఏం చేస్తున్నావమ్మా?"

"కెమిస్ట్రీ చదువుకుంటున్నా పెదనాన్నా"

"పరీక్షలు దగ్గర కొచ్చాయికదూ?"

"అవును. అందుకే ఇంత చదువూ....."

"ఏం చదువులేవమ్మా. ఎంత చదివినా చివరికి గరిట పట్టటం తప్పదుగదా?"

తను చెప్పబోయే విషయానికి పీఠిక వేశారు కృష్ణయ్యగారు.

"అది నిజమేగాని పెదనాన్నా. కాని ఆడవాళ్ళు గరిట పట్టి తీరాలని, నిసర్గ నియమమేమీ లేదుగా! మేమూ చదువుకుని, ఉద్యోగాలు చేసుకుంటె, గరిటెందుకు పట్టాలో చెప్పండి"

"ఉద్యోగాలలో చేరినంతమాత్రాన, ఎన్నిరోజులు పెళ్ళి పెటాకులు లేకుండా ఉండగలరు? పెళ్ళి చేసుకున్నాక పరిస్థితులు ఎటుపోయి ఎటువస్తాయో ఎవరు చెప్పగలరు?"

పెదనాన్న ఏం చెప్పబోతున్నాడో తెలియక మీర, "నిజమే" అని ఒప్పుకుంది.

"మీరా, నేనొక్క టి అడగాలనుకొంటున్నా. నువ్వు నా మాట కాదనవన్న నమ్మకం నాకున్నదనుకో....."

"చెప్పు పెదనాన్నా"

"నా స్నేహితుడి కొడుకు శామణ్ణను నువ్వు చూశావుగదూ?"

మీరకు ఆశ్చర్యం వేసింది.

"చూడకేం పెదనాన్నా, మొన్న వచ్చినప్పుడేగా నేను టికెట్టు కూడా అమ్మాను, ఆయనకి."

"ఆ. అతనే నిన్నతనికిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటున్నా."

మీర చేతిలోని పెన్సిలు క్రిందపడింది. నుదుటిమీద రేఖలు స్పష్టంగా కనిపించాయి. ఆమె చెవులో వూగుతున్న పిలవు రాళ్ళ జూకాలు కూడా తమ యజమానురాలి అభిప్రాయాన్ని వినటం కోసం స్తబ్ధంగా ఉండిపోయాయి.

మీర నోటెనుండి మాట రాలేదు. ఆమెలోని మార్పును గమనించనట్టుగానే కృష్ణయ్యగారు చెప్పుకపోయారు.

"ఇలా చూడమ్మా. శామూ ఎక్కువ చదువుకోలేదు. నిజమే. కాని అతని కున్నంత మంచి బుద్ధి ఎంత మందికుంటుంది చెప్పు? చూడ్డానికి రాజకుమారుడిలా ఉన్నాడు. ఇంట్లో అత్తా, మామ ఆడ పడుచుల గొడవలేవీ లేవు. కావలసినంత ఆస్తి ఉంది. అంత పెద్ద ఇంటికీ, ఆస్తికీ మహారాణిగా సుఖంగా ఉండవచ్చు. ఇంతకన్నా ఏం కావాలో చెప్పు"

మీర కళ్ళు నేలవేపే చూస్తున్నాయి. మాట్లాడే శక్తి రాగానే

"నాకు ఇపుడిపుడే పెళ్ళి చేసుకోవాలని లేదు పెదనాన్నా" అంది.

"అలా అంటే ఎలాగమ్మా? నీకూ పదిహేడేళ్ళు వచ్చాయా? ఇంకా పెళ్ళి చేయకపోతే బావుంటుందా? చూసేవాళ్లేమంటారు? తల్లి తండ్రిలేని పిల్లను తెచ్చాడు పెళ్ళి పెటాకులు చేయలేనివాడు, తగుదునమ్మా అని ఎందుకు తెచ్చుకోవాలి? అని నన్నాడిపోసుకోరూ? ఇంతవరకూ నిన్ను పోషించి విద్య చెప్పించినందుకు నాకే ఉపకారం చేసిపెట్టమ్మా" అన్నారు కృష్ణయ్యగారు.

మీర బుగ్గలమీదుగా కన్నీరు ప్రవహించసాగింది.

"కాని .....కాని...... ఆయన ఒప్పుకున్నారా పెదనాన్నా?" మీర కంఠం వణికింది.

"ఊ. అతను ఒప్పుకున్నాకనే నిన్నడుగుతున్నాను"

"కాని పరీక్షలు ఇంకో వారం రోజులే ఉన్నాయి."

"నాకా మాత్రం తెలీదనుకొన్నావా? పరీక్ష అయ్యాకనే ముహూర్తం పెట్టిస్తాను. నువ్వు మాట్టకు దయచేసి ఒప్పేసుకో కుర్రవాడికేం లోటు చెప్పు అందానికి కొదువా? ఆస్తికి కొదువా? ఇక చదువంటావా? ఇప్పుడు మన సమాజంలో విద్యకున్న విలువ నీకు తెలిసిందేకదా. డబ్బుకున్న విలువ విద్యకులేదు. అతనూ ఎస్సెల్సీదాకా చదువుకున్నాడు."

"పెదనాన్నా నేను మెడికల్ కాలేజీలో చేరాలనుకున్నాను."

కృష్ణయ్యగారు కొంచెం కంగారుతోనూ, ఆశ్చర్యంతోనూ అన్నాడు.

"మీరా, నా ఆర్థిక పరిస్థితి నీకు తెలియంది కాదు. అంతా తెలిసి కూడా నువ్విలా మాట్లాడటం బాగాలేదమ్మా. ఎంతో తెలివిగల పిల్లవని అనుకుంటున్న నువ్వు కూడా ఇలా అనుకోవటం నాకెంతో ఆశ్చర్యంగా ఉంది. మన తాహతును మించిన కోర్కెలు నీ తలలో నింపిందెవరు? ఆ గోపీయే అయ్యుండాలి. నేనూ పెద్దవాడినవుతున్నానా? నీ పెళ్ళిచేసి ఆ బరువు వదిలించుకుంటే నాకు నిశ్చింతగా ఉంటుంది. నీకు నామీద ఏమాత్రం కృతజ్ఞత అన్నది ఉంటే ఇక ఎదురు చెప్పకు" అన్నారు. ఆఖరి వాక్యం పలికేటప్పుడు ఆయన కంఠం మరింత కఠినమయింది. విసురుగా గదిలోనుండి వెళ్ళిపోయారాయన.

మీర విరవంగా రోదించసాగింది.

చిన్ననాటినుండి అత్యాశతో పోషిస్తూ వచ్చిన ఆశాలతను ఇలా మధ్యలోనే త్రుంచివేయవలసి రావటం ఆమెకు పాలిచ్చి పెంచిన బిడ్డను తానే స్వయంగా కత్తితో పొడిచినట్టే అనిపించి బాధ పెట్టింది.

మధుర సంగీతంలో సాగుతున్న జీవితంలో మొదటిసారిగా అపస్వరం వినిపించింది.

ఇవాళ్టిందాకా పడవలేకపోయింది. ఇంతవరకూ తను 'అనాథ' అన్న భావన లేకుండా పెరిగింది. ఇపుడు మొదటిసారిగా తల్లి తండ్రిలేని లోటు పెద్దగా కనిపించసాగింది.

"అమ్మా... ...నువ్వే ఉండి ఉంటే?"

వెంటనే గోపాల్ గుర్తు కొచ్చాడామెకు.

నిస్పృహలో మునిగిపోతున్నవాడికి గడ్డిపోచ దొరికినా ఆశ్రయంగా భావించినట్టు మీర గోపాల్ సహాయాన్ని నమ్మి ధైర్యం తెచ్చుకుంది. వెంటనే ఉత్తరం రాసింది.

"ప్రియమైన అన్నయ్యకు,

అన్నయ్యా, నేనిప్పుడో పెద్ద కష్టంలో చిక్కుకున్నాను. నువ్వు తప్పితే నాకు సహాయం చేసే వాళ్లెవరూ లేరు. పెదనాన్న నాకు పెళ్ళి స్థిరపరిచాడు. నాకిపుడపుడే పెళ్ళి చేసుకోవాలని లేదు. చిన్నప్పటినుండి నీ మాట పాటించటమే నా ధ్యేయంగా పెట్టుకొన్నాను. ఆ ధ్యేయాన్ని సాధించటంలోనే, నా జీవితపు సార్థకత ఐక్యమై యున్నది. డాక్టరై ప్రజలకు సేవ చేయాలన్న కాంక్ష నా రక్తంలో జీర్ణించుకు పోయింది. ఎలాగయినా నా పెళ్ళి ఆపించు. వరుడు చదువులేని పల్లెటూరివాడు. నాకన్న తక్కువ చదువుకున్నవాడు. ఈ పెళ్ళి తప్పిస్తావంటే నీకు ఆజన్మాంతం కృతజ్ఞురాలై ఉంటాను.

మీర."

ఉత్తరం పోస్టుచేసి జవాబుకోసం ఎదురు చూడసాగింది. ఒక వారం రోజుల తరువాత గోపాల్‌నుండి రెండు ఉత్తరాలు వచ్చాయి. కృష్ణయ్యగారి ఉత్తరాన్ని ఆయన చేతిలోపెట్టి, తన ఉత్తరం తీసుకొని గదిలోకి పరిగెత్తింది మీర. కవరు చించేటప్పుడు ఆమె గుండె దడదడ లాడింది.

ం రాశాడు" అన్నయ్య అనుకుంటూ చదివింది.

"మీరా, నీ ఉత్తరం అందింది. నీ ఇష్టానికి వ్యతిరేకంగా నాన్న నీకు పెళ్ళి తలపెట్టాడని విని బాధ కలిగింది. నాకు తోచినట్టుగా నాన్నగారికి రాశాను. కానీ ఇంత దూరంనుండి ఆయన మనసు మార్చటం అంత సులభంగా అనిపించదు. ఉత్తరాల మూలకంగా చెయ్యగలిగినంత చేశాను. దాని మీద దైవేచ్ఛ. నేను నీకు ఏవిధమైన భరోసా ఇవ్వలేను. గోపాల్."

ఈ ఉత్తరం చూశాక మీర ఆశలన్నీ అడుగంటాయి. ఈ ప్రపంచంలో నావారంటూ ఎవరూలేరు! అనుకుంది మనసులోనే. ఉత్తరం పుస్తకంలో పెట్టి బయటికి వచ్చింది. వంట గదిలో కమలమ్మగారితో మాట్లాడుతున్న కంఠం వినబడింది.

"మనం పిల్లను పెంచి పెద్ద చేసినందుకు విశ్వ చూపే నిర్వాక ఇది. మీర ఉత్తరం రాసిందేమో ఈ పెళ్ళి తన కిష్టం లేదని, వాడింత పెద్ద ఉత్తరం రాశాడు, బలవంతపు పెళ్ళిళ్ళవల్ల జరిగే అనాహుతాలను గురించి నాకు. వేలెడున్నాడో లేదో, వీడూ నాకు బుద్ధి చెప్పటమే?"

ఇదే సమయమని కమలమ్మగారు చెప్పసాగారు

"మీరని చదివించొద్దని చిలక్కి చెప్పినట్టు చెప్పానా? విన్నారూ? చిన్నప్పుడే పెళ్ళి చేయొంటే ఎవరినిచ్చి చేసినా నోరు మూసుకొని చేసుకునేది

# అపస్వరం

'చదువూ', 'నాటకం', 'వేషం' అంటూ ముద్దు చేసి నెత్తి కెక్కించుకున్నారు. ఇపుడెందుకు వింటుంది? ఏమైనా చేసుకోండి, మీరాయె, మీ కూతురాయె."

ఈ మాటలతో కృష్ణయ్యగారి 'పరిస్థితి అగ్గి మీద ఆజ్యం పోసినట్టయ్యింది.

"ఎలా నా మాట వినదో నేనూ చూస్తాను. ఇందులో నీ ప్రమేయం ఏమీ లేదు ఈ పెళ్ళి విషయంలో తల దూర్చవద్దు" అని, "ఈరోజే ఉత్తరం రాస్తాను గోపీకి, పెళ్ళి సలక్షణంగా జరుగుతుంది" ఖచ్చితంగా అన్నారు కృష్ణయ్య గారు.

మీర చప్పుడు కాకుండా అక్కడినుండి వెళ్ళిపోయింది.

మీర మనసును మబ్బు ఆవరించింది. మనసుకు శాంతి లేకుండా పోయింది. మోహంలో ఎప్పుడూ వెలుగుతున్న మందహాసం మాయమయ్యింది.

పరీక్షల్లో ఏమి రాసిందో తనకే తెలియదు. పరీక్ష అయ్యాక ఆఖరిరోజు, విద్యామందిరంనుండి బయటికివచ్చి, తలెత్తి భవనంవేపు చూసింది మీర. ఇక తనకూ విద్యా మందిరానికి దూరమౌతోన్న విషయం ఖచ్చితమై పోయింది. దీర్ఘంగా నిట్టూర్చింది.

"మీరా ఎలా రాశావ్" అంటూ నిర్మల బయటికి వచ్చింది.

"ఓ మాదిరిగా చేశానంతే" మీర కంఠంలో ఉత్సాహమేలేదు.

"నువ్వలాగే అంటావులే, తరువాత ఫస్టుక్లాసులో పాసవటం మాకుతెలీదూ?"

"ఎలా రాశార్రా మీరూ?" అంటూ చంపా, రాజ్యలక్ష్మి వచ్చిపడ్డారు.

"ఏదో రాశాంలెద్దురా"

"ఇదేంటే చంపా చెయ్యంతా సిరా?"

"ఏమిటో పెన్ను కక్కుతోందే, నా కొత్త చీర కూడా కొద్దిగా ఇంకయ్యింది" అంటూ తన చీరకొంగు వైపు చూసుకుంది.

"నీ కెంత ధైర్యమే తల్లీ! పరీక్ష రోజు కొత్త చీర వచ్చినా కట్టుకోలేను నేను"

"పరీక్షలుకదా మొహం ఎలాగా కళగ ఉండదు. చీరయినా కాస్త కళగా ఉండనిమ్మని కొత్త చీర కట్టుకున్నా."

"చాలా బావుంది నీ సిద్ధాంతం! మీర ఈరోజు 'సావన్- ఆయారే' సినిమా వచ్చింది. ఫిల్మ్ ఇండియాలో తెగ పొగిడేశాడు. ఈరోజు అందరం వెడదాం"

"ఈరోజా సరేసరి. ఫిల్మ్ ఇండియా, దాని ఎడిటర్ అంటే పడిచస్తుంది" అంటూ రాజ్యాను ఏడిపించింది చంపా



"వెడదామ్రా. కిశోర్‌సాహు జీనియస్" అంది నర్మద.

"సినిమా అయ్యాక ..... లంచ్‌హోమ్‌లో టిఫిన్... ..."

సరిపోయింది. ఎప్పుడూ యిలాగే తిండిమీద్రా అని ఏడుస్తూ ఉంటే లావుకాక ఏం చేస్తావ్?" అంటూ మీర రాజలక్ష్మి చేతిని గిల్లింది.

నర్మద, "నేను మీర ఇంటికి వచ్చేస్తాను. అక్కడినుండి అందరం కలిసి వెడదాం" అంది.

"ఎండలో నేను నడవలేను బాబూ. జట్కాలో అయితేగాని రాను" అంటూ మధ్యలో పేచీ పెట్టింది రాజా.

"ఇలాగే అలవాటు చేసుకో రాజా. ఇంకో రెండేళ్ళకి రోడ్డు రోలరుని మించిపోతావంతే! ఆడవాళ్ళకి ఫిగర్ చాలా ముఖ్యం రాజా. మొహం అందంగా లేకపోయినా ఫరవా లేదుగాని ఫిగర్ లేకపోతే కష్టం......మీరని చూడు ఎలా ఉందో......" అంటూ రెండడుగులు వెనక్కి వేసి మీరనే పరీక్షగా చూస్తూ.

"ఆ నడుమూ, ఆ భుజాలు......" అంది చంపా.

"ఇక చాలు చంపా. వినలేను" అంది విసుగ్గా మీర. రాజ్యలక్ష్మి అసూయతో మీరవైపు చూస్తూ

"అలాగేలే, మీరనే బాగా ఉండనీ. నాకు ఫిగర్ ఉండి ఏం కావాలి చెప్పు! నేనేం బాల్‌డాన్స్‌కు వెళ్ళాలా ఏమన్నానా?" అంది.

ఆఖరి బెల్లు కాగానే విద్యార్థినులందరూ అల్లరి చేసుకుంటూ బయటికి వచ్చారు.

మీర ఇంటికివచ్చి పుస్తకాలు టేబుల్‌మీద పెడుతుండగానే శ్రీపాదు వచ్చి,

"ఎలా రాశావ్ మీరా?" అనడిగాడు.

'ఎలా రాస్తే ఏమిట్రా శ్రీపాదూ? ఇక నా కంతా ఒకటేగా?"

అంతవరకూ ఆపుకున్న కన్నీరు కట్టలు తెంచుకుంది. శ్రీపాదుకు ఏమీ అర్థం కాలేదు.

కాస్సేపు ఏడ్చి తన్ను తానే ఓదార్చుకుంది మీర. తరువాత మొహం కడుక్కుని కృష్ణయ్యగారివద్దకు వెళ్ళి,

"పెదనాన్నా, ఈరోజు మేమందరం సినిమా కెళ్ళాలనుకున్నాం" అంది.

"సరే వెళ్ళు. కాని రేపుమాత్రం ఇంట్లోనే ఉండు. శామువాళ్ళ మేనమామ, ఆయన భార్య వస్తారు నిన్ను చూడటానికి."

మీర జవాబు చెప్పలేదు.

మధ్యాహ్నం స్నేహితురాళ్ళంతా కలిసి సినిమాకు వెళ్ళారు. దానిలో నాయిక మీరలాగానే వివాహాన్ని వ్యతిరేకిస్తూ ఉంటుంది కాని ఒకరోజు నిసర్గపు తడిలో పిక్నిక్‌కు వెళ్ళినపుడు అకస్మాత్తు కాలుజారిపడ్డ నాయికను నాయకుడు చేయూత ఇస్తాడు. ఆ చేతిని అందుకుని పైకి లేవబోయిన నాయికకు అతని హస్త స్పర్శతో హృదయం పులకరిస్తుంది. పెళ్ళివద్దన్న ప్రతిఘటన మానుకుంటుంది. పెళ్ళి మానవునికి చాలా అవసరమన్న వాదనను అంగీకరిస్తుంది.

సినిమా చూసి విషాదంతో నవ్వింది మీర, మీరకు వివాహపు ఆవశ్యకత ఇంకా కనిపించలేదు. పెళ్ళి లేకుండా స్త్రీ తన బ్రతుకు తాను బ్రతుకగలదు అని ఆమె నమ్మకం, కనుక సినిమా ఆమె మీద ఏవిధమయిన ప్రభావాన్ని చూపలేకపోయింది.

ఇంటికి వస్తున్న వియ్యంకులకోసం అన్ని పద్ధతులా జరిగాయి.

కృష్ణయ్యగారు స్టేషనుకువెళ్ళి కాబోయే అల్లుడినీ, వియ్యంకులని స్వాగతించి తీసుకువచ్చారు. ఇంటికి రాగానే కమలమ్మగారు వియ్యపురాలిని లోపలికి తీసుకువెళ్ళారు.

"ప్రయాణం సుఖంగా జరిగిందా?"

"ఊ"

"స్నానానికి లేస్తారా?"

"స్నానం చేసుకునే బయలుదేరాం"

వాంగీభాతు, ఖీరు, బొంబాయి బోండా, కూరలతో విందు భోజనం వడ్డించారు.

మీర గదినుండి బయటికి రానేలేదు. కమలమ్మగారి బలవంతానికి కట్టుబడి, అంజూరపు రంగు పట్టుచీర కట్టుకుని జడ వేసుకుని, పూలు పెట్టుకుంది. నీలపురంగురాళ్ళ జూకాలు ఆమె మనసులాగే చంచలంగా వూగుతున్నాయి.

అందరూ హాల్లో కూర్చుని తాంబూలం వేసుకుంటున్నారు. శాము కళ్ళు ఎవరికోసమో వెతుకుతున్నాయ్. కృష్ణయ్యగారు అది గమనించి

"మీరా ఇలా రామ్మా" అని పిలిచారు.

మీర గదినుండి బయటికివచ్చి తల వంచుకుని చాపమీద కూర్చుంది. శాము చుట్టూవున్నవారు ఏమనుకుంటారన్న సంకోచం లేకుండా మీరవైపే చూస్తూ కూర్చున్నాడు.

ఇంతకుమునుపు తను వచ్చినపుడు, మీర తనకు టికెట్టు అమ్మిన దృశ్యం గుర్తుకువచ్చి, అతని మొహంలో చిరునవ్వు తొంగి చూసింది. మీరక్కూడ తనలాగే ఆ సంగతి గుర్తు కొచ్చిందేమోనని సూక్ష్మంగా ఆమె మొహంలోకి చూశాడు. క్రిందికి చూస్తున్న విశాలమైన కనురెప్పలు, నుదురు, పాపిడి మాత్రమే కనిపించాయి. మొహం భావ రహితంగా ఉంది. గాంభీర్యం తప్ప మరే భావమూ అతనికి కానరాలేదు.

శాము మనసు ఉల్లాసంతో లేగదూడలా గెంతుతున్నపుడే, మీర మనసు వికసించని మొగ్గలా ఉండిపోయింది.

శాము, తను కూతుర్నికాదని, మీరని చేసుకుంటున్న కారణం సావిత్రమ్మగారికి బోధపడింది. అతని అభిరుచిని, రసికతనూ మనసులోనే మెచ్చుకున్నారు.

రాత్రి బొబ్బట్లు పరమాన్నంతో విందు భోజనాలయ్యాక, రామశాస్త్రిగారు లగ్న పత్రిక రాశారు. నిశ్చితార్థం జరిగిపోయింది. శాము, మీరకోసం, లేత ఆకుపచ్చ రంగు పట్టుచీర తెచ్చాడు.

అస్తమానం పచ్చటి చేల మధ్య కాలం గడిపే శాముకు ఆకుపచ్చరంగంటే అమితమయిన ప్రేమ. సావిత్రమ్మగారు చీరను మీర కిచ్చి, ఆశీర్వదించారు. మీర వెంటనే ఆ చీర కట్టుకుని తనకు చూపించాలన్న ఆత్రం శాముకు. కాని మొహమాటంవల్ల ఆ మాట నోటితో చెప్పలేకపోయాడు. కాని కళ్ళతోనే ఆశతో అర్థిస్తున్నట్టుగా ఆమెవేపు చూసినప్పుడు మీర అలక్ష్యంతో చీరను పట్టుకొని వెళ్ళటం కనిపించింది. అతని మనసులోని కోర్కె అక్కడే ఉండిపోయింది.

మీర పెళ్ళి పనుల సిద్ధతతో ఇల్లంతా సందడిగా ఉంది. ఎవరికోసం ఇదంతా జరుగుతుందో ఆ పెళ్ళికూతురు మీర మొహంమాత్రం కళావిహీనంగా ఉంది. విరక్తి, ఉదాసీనతల తెరలో దాక్కుంది మీర మనసు. పెళ్ళిరోజు దగ్గర పడుతూన్నకొద్దీ ఇల్లు చుట్టాలతో నిండిపోసాగింది. ఈ గొడవల మధ్య కాస్సేపు హాయిగా నిద్రపోయి, నిద్రలో నన్నా తన మనసులోని విషాదాన్ని మరవటం సాధ్యపడలేదు. ఇంటినుండి పారిపోయి, ఎక్కడన్నా ఏకాంతంగా కాస్సేపు గడపాలనిపించింది మీరకు. కాని వివాహసమారంభంలో ముఖ్యపాత్ర మీరదే అవటంవల్ల ఎక్కడికీ వెళ్ళటానికి కూడా వీలు పడేదికాదు. పెళ్ళికి ముందురోజు పెళ్ళివారు వచ్చి విడిదిలో దిగారు. శాము మేనమామ కూతురు సరస్వతికి మీరను చూడాలని ఎంతో ఆత్రతగా ఉంది. తన్ను కాదని శాము ఏలాటి లంభను చేపడతాడోనన్న కుతూహలంతో.

"రావే రంగూ శాము మావయ్య పెళ్ళి చేసుకోబోయే పిల్ల ఎంత అందంగాఉందో చూసి వద్దాం" అంటూ తన ఈడు పిల్ల రంగలక్ష్మితో కలసి బయల్దేరింది.

కాఫీ టిఫిన్ తీసుకొన్నాక, రంగలక్ష్మితో, సరస్వతి, ఆడ పెళ్ళివారింటికి బయల్దేరింది. ఇంట్లోకి వెడుతూండగా ఎదురుగా వచ్చిన శ్రీహరిని,

"మీర ఏది? మేము మీర స్నేహితులం" అని అడిగారు.

మీర స్నేహితురాళ్ళంతా ఇంచుమించు శ్రీహరికి తెలుసు. ఈ కొత్త స్నేహితురాళ్ళెవర్రా అనుకుంటూ, "రండి" అన్నాడు. మీర గదిలో తన చనిపోయిన తల్లివేపు బంధువు పద్మక్కతో మాట్లాడుతూ కూర్చుంది. శ్రీహరి వచ్చి,

"మీరా నీ స్నేహితులట. ఎవరో వచ్చారు చూడు" అన్నాడు.

"ఉండు పద్మక్కా. రాజావో, చంపావో వచ్చి ఉంటారు. తీసుకొస్తాను." అంటూ మీర గబగబా గది నుండి బయటికి వచ్చింది. ఎదురుగా అపరిచితులను చూసి, ఆశ్చర్యంతో నిలబడిపోయింది. సరసి మీరని పైనుండి క్రిందిదాకా పరిశీలనగా చూస్తూ,

"మేము శాము మావయ్య వేపువాళ్ళం

---

పెద్ద మనిషి : (బస్సులో) సార్ నా కాలు తొక్కేస్తున్నారు. కొంచెం కాలు తీస్తారా?

మరొకరు : మీ రీ స్టాపులోనే దిగాలా?

పి. ఉపేంద్రజోగ్ (మద్రాసు)

---

# అపస్వరం

అన్నార్ని బాధ్యాలని వచ్చారే అంది.

శాముమామయ్య అనటంతోనే, వాళ్ళు నాగపెళ్ళివారింటి నుండి వచ్చారని గ్రహించి "రండి" అంటూ గదిలోకి తీసుకువెళ్ళింది.

"కాఫీ టిఫిన్ తీసుకున్నారా?"

"తీసుకున్నాం" అంది రంగలక్ష్మి.

సరస్వతి ఒకే పనుంగా మింగేసేటట్టు మీరను చూస్తూ కూర్చుంది. పావుగంటలో ఒక మాట యినా మాట్లాడకుండా విచిత్రమయిన వస్తువును చూసినట్టుగా మీరవేపు చూస్తూ ఉండి పోయి, తరువాత గబుక్కున లేచి "నే యిక వెడు తాం" అంది. మీర తలూపింది. పరిచయంలేని మనుష్యులతో అలా మౌనంగా కూర్చోవటం మీరకు దుర్భరమనిపించి వాళ్ళు వెడతా మనగానే "సరే" అంది.

బయటికి రాగానే సరస్వతి, మాత్సర్యంతో "అబ్బ శాము మామయ్య ఎలాంటి సంబంధం చేసి ఎన్నుకున్నాడో? అనుకున్నా ఛ! ఏం బాగా లేదు. మా వూళ్ళో ఇటువంటి వాళ్ళు కోకొల్లలు" అంది.

"ఎందుకే అలా అంటావ్? నాకేమో బాగుం దిప్పా ఎంత గంభీరం....."

"చాలూరుకోవే. గంభీరమట!.. . . పొగరు పోతుస్తుంతం. .. తనే చదువుల సరస్వతి అని గర్వం. మనం వెళ్ళామా? ఒక మాటా పలుకూ ఏమయినా ఉందా? ఎప్పుడిలా మూతి ముడుచుకుని కూర్చుంది"

"నీ కలాటివన్నీ లేవుగా? నువ్వెందుకు మాట్లా డించలేదుమరి?"

సరస్వతికి కోపం ముంచుకొచ్చింది.

"ఆమెగారికే అంత ఇదయితే నాకేంపట్టింది? నేనెందుకు పలుకరిస్తాను? పిట్టి జడ. మెచ్చుకున్నాను.."

"ఛ. ఛా. నువ్వు సరిగ్గా చూడలేదయితే? పొట్టయితే మాత్రంఏం? ఉంగరాలజుత్తు, లావుగా అందంగా వుంది. ఇహ కళ్ళు...అలాటి కళ్ళు నూటికి ఒక్కరికుండవు"

తనన్న దానికంతా రంగలక్ష్మి ఎదురుచెప్పటంతో సరస్వతి నోరు మూసుకుంది.

మరునటి రోజు ఉదయం తొమ్మిదింటికే ముహూర్తం. మీర తెల్లవారకుండానే వుండాలని దేవుడితో మొర పెట్టుకుంది

తెల్లవారింది. మంగళ వాద్యాలు మోగటం ప్రారంభమయ్యాయి. సుప్రభాతంలో మధురంగా ధ్వని చేస్తున్న వాద్యాలు అపస్వరంతో గోలపెడు తున్నట్టనిపించింది మీరకు.

కనకాంబరం రంగు జరీ చీర కట్టుకుని గౌరి పూజకు కూర్చుంది మీర. మామిడి పిందెల జరీ అంచు మెరుస్తోంది. సిలపురాళ్ళ జూకాలు ఆమె ఎర్రటి బుగ్గలమీద మిలమిల కాంతులను ప్రస రింపచేస్తున్నాయి. నుదిటిమీద కట్టిన బాసింగం, చెంపలకు రాసుకున్న పసుపు, ఆమె మొహానికో వింత అందాన్నిచ్చాయి. నవ వధువు మీర సౌందర్యం అపూర్వంగా ఉంది ఆ రోజు.

పూజ చేస్తున్న మీర దగ్గరగా కూర్చుని సావి త్రమ్మగారు ఆభరణాల పెట్టె తీసి ఆమెను అలంక రింపసాగారు. శాము శ్రీమంతుడన్న సంగతి అంద రికీ తెలిసినదే అతను తన భార్యకు ఏమేం నగలు పెడతాడోనని ఆడవాళ్ళంతా చుట్టూ మూగారు.

సావిత్రమ్మగారు చెవికి వజ్రపు దుద్దులువేసి చెంపసరాలు ధరింపచేశారు. చంద్రహారం, కాసుల పేరు. మామూలు రెండు పేర్ల గొలుసు, పథకం మెళ్ళో వేశారు. చేతికి పింఛీలాటం, పాతకాలపు నాలుగు జతల గాజులు వేశారు. పవిటసర్ది మువ్వల వడ్డాణం పెట్టారు ఒక్కొక్క నగే తీసి అలంకరిస్తున్నపుడు ఒక్క క్షణం ఆమె మన సులో అసూయ ప్రవేశించింది. తన కూతురు సరసికి ఈ నగలు ధరించే భాగ్యం లేనందుకు. కాని వెంటనే 'ఆ ఎంశానికంతా ఒక్కడే కొడుకు. దంపతులు నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండాలి' అనుకున్నారు.

"ఈ నగలన్నీ కొత్తగా చేయించినట్టు లేవే" అన్నారు ఆశ్చర్యంతో చూస్తున్న పద్మక్క.

"అవునమ్మా. అన్నీ పాతవే. వాళ్ళ అమ్మవి. సగం ఇంటిదగ్గరే వదిలేసి సగం మాత్రమే తెచ్చాడు.

---

ఒకడు: ఏరా నీ భార్య నీ మాటని ఒక్క సారన్నా విన్న దంటావా?

రెండోవాడు: ఆఁ! ఎందుకు వినలేదూ! ఒకసారి మా యిల్లు తగలబడి పోతుంటే బయటికి రమ్మనగానే కిమ్మని వచ్చేసింది.

ఎం. పురుషోత్తం నాయుడు (మద్రాసు)

---

కమలమ్మగారు, "చూస్తేనే తెలుస్తోందిగా. అన్నీ పూర్వకాలపు నగలే. ఎంత డాబుగా ఉన్నాయో చూడండి. ఆ వడ్డాణ ముక్కేటే ఎంత లేదన్నా ఒకటిన్నర శేరు బంగారం ఉంటుంది."

చుట్టూ చేరిన అవివాహితలు అసూ యతో చూస్తున్నారు.

కాని మీరకు ఏమాత్రం ఆనందం కలుగ లేదు. తను నిర్మించుకున్న భవ్య మయిన సుందర హర్మ్యం క్రిందికి కూలిపోవటాన్ని తలచుకొని బాధగా మూలుగుతోంది ఆమె మనసు.

"నేనూ చదవాల్సింది. గోపన్నయ్యలాగా డాక్ట రవాల్సింది. స్వతంత్రంగా ఉండాల్సింది" అని మనసు క్షోభ పెడుతోంది.

కాని అంతా మించిపోయింది.

వధూవరులు పీటలమీద కూర్చున్నారు. పురో హితుడు, మంత్రాలు వల్లిస్తూ వధువు చేతి లోని పేలాలను హోమంలో వేయిస్తున్నారు. పొగతోనో ఏమో మీర కళ్ళు ఎర్రబడ్డాయి.

పెళ్ళికి వచ్చిన వారంతా గుంపులుగా చేరి, తమలో తాము మాట్లాడుకొంటున్నారు.

"మీరేమనుకున్నా చెప్పండి లక్ష్మమ్మగారూ పిల్లమొహంచూస్తే పెళ్ళి ఇష్టమున్నట్టు లేదు"

"అలాగెందుకనుకోవాలి? అసలూ మీరకన్నా దేన్లో తక్కువో చెప్పండి. రంగులో నంటారా, మీరకన్నా ఎర్రగానే ఉన్నాడు శాముయి చేసు కోవడానికి పుణ్యం చేసుకుంది మీర. చదువులేదని మీర కాస్త బెంగ పెట్టుకుందేమోకాని చదువులు కట్టుకుని ఏం చేసుకుంటాం? ఏహా అబ్బాయి ఎం ఏ. పాసయి ఆరునెల్లయింది. ఇంకా ఉద్యోగం దొరకలా....."

ఈ సంభాషణనంతా ఆలకిస్తున్న ఇంకోకావిడ, "చదువులేకపోతే పోయింది. డబ్బున్నా ఉంది"

"డబ్బుకేం. కావలసినంత ఉంది. ఎందుకో ఉండొచ్చు"

"ఎన్ని చీరలు పెట్టారు?"

"ఆరు. అన్నీ ధర్మవరపు పట్టులే."

"పుట్టింటివాళ్లేంపెట్టారు?"

"వాళ్లేం పెడతారు పాపం! పిల్లకు తల్లీ లేదు, తండ్రీలేదు. అంతా పెద్దవాళ్లే పెంచి పెద్ద చేశారు. కాలేజి చదువు చదివించారు. అంతకన్నా ఏం చేస్తారు?"

"పోనీలే. పిల్ల ఎక్కడున్నా సుఖంగా ఉండాలి" అని ఆశీర్వదించారు ఓ పండు ముత్తైదువ.

పొగ ఎక్కువయినందువల్లనో ఏమిటో మీర కళ్ళల్లోనుండి నీరు ప్రవహించ నారంభించింది. లోపలే కేంద్రీకరించిన దుఃఖం కూడా దాంతో బాటే బయటికి రాసాగింది. పసుపు రాసిన ఆమె బుగ్గలు కన్నీటితో తడిసిపోయాయి.

"పాపం తల్లి గుర్తుకొచ్చుంటుంది" అని కొంత మంది జాలిపడ్డారు. మీర కట్టుకున్న కొత్త పట్టుచీర కొంగంతా కన్నీటితో తడిసి ముద్ద యింది. తల్లో పూలు సద్దటానికి వంగిన కమ లమ్మగారితో,

"పెట్టమ్మా. పొగగా ఉంది. ఓ జేబురుమాలు తెచ్చిపెట్టు" అంది మీర. కాని కమలమ్మగారు గమనించే లోపల తొందరలో ఆ సంగతే మర్చిపోయారు. శాము రెండు నిముషాలు ఆగి, ఆమె రాకపోవటంతో తన జేబురుమాలు మీర కిచ్చాడు. చుట్టూవున్న వారంతా నవ్వారు.

"ఏవిట్రోయ్ అప్పుడే సేవా కార్యక్రమం ప్రారంభించినావ్" అని గేలి చేశాడో స్నేహితుడు.

పెళ్ళయిపోయింది. ఆ రోజు రాత్రే రెండో శాస్త్రం కూడ కానిచ్చి మీరను తనతోనే పంపిం చేయాలని మామగారికి విన్నవించుకున్నాడు శాము.

అది విని తృప్తిపడింది మీర. కమలమ్మగారితో మొర పెట్టుకుంది.

"ఈ రోజు సద్దు పెద్దమ్మా. నాకు ఒంటరిగా అలసటగా ఉంది. అదికాక, ఈ శాస్త్రాన్ని ఈ కాలంలో ఎవరు పాటిస్తారు?"

కమలమ్మగారికి మీరమీద ఎప్పుడూ వల్ల మాలిన ప్రేమలేదు పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోతే చాలనుకునేవారు

"పెళ్ళయ్యాక నువ్వు వాళ్ళకు చెందినదానివి. ఎలా చెప్తే అలా వినాలి మీర" అన్నారు

(సశేషం)

## విచిత్రకథలు-4

# చచ్చి సాధించిన జాగిలం



ఆర్. టి. కూపర్

స్టాఫర్డ్‌షైర్ విమానాశ్రయంలో రాయల్ ఎయిర్ ఫోర్స్‌కి సంబంధించిన ఉద్యోగులూ, వారి వేటకుక్కలూ తరచుగా తలలేని ఆకారాన్నొకదాన్ని చూచి భయభ్రాంతులకు లోనవడం జరుగుతుండేది. యుద్ధంలో జరిగిన విమాన ప్రమాదంలో మరణించిన వైమానికు డొకడు దయ్యమై ఆ ప్రాంతాల్లో సంచరిస్తున్నాడని చాలామంది నమ్మారు.

ఆ నమ్మకాలనీ కేవలం ఊహలేనా??

కాదనిపిస్తుంది. ఎందుచేతనంటే సంపూర్ణారోగ్యవంతులైనవారు, ధైర్యవంతులూ భ్రాంతికి లోను కావటం అరుదు. ఒకవేళ అలా పొరపాటున జరిగిందనుకున్నా మంచి శిక్షణ ఇవ్వబడిన ధైర్యంగల వేట కుక్కలు కూడా అలాంటి అనుభవాన్ని పొందటం విపరీతమైన దేదో ఉండిఉంటేగానీ జరగదు. కుక్కలు కూడా యజమానులకి కనిపించిన దృశ్యం వాటికి కనిపించగానే భయంతో ఏడుస్తున్నట్లు అరవడమూ, చాటుగా నక్కి కూర్చోడమూ చేసేవి.

విమానాశ్రయాన్ని తలలేని దయ్యం వెంటాడటం సంభవమేనా? కావచ్చు! ఎందుకంటే ఇలా ఇంతకుముందు కూడా చాలాసార్లు కనిపించినట్లు ఆధారాలున్నాయి.

కొన్ని సంవత్సరాల క్రిందట నార్త్ ఫోక్ రైతొకడు జబ్బుగా ఉన్న తన బంధువుని చూచి తిరిగి ఇంటి కొస్తున్నాడు. దారిలో ఒక వంతెనకి ముందున్న గేటుని సమీపించాడు. పండు వెన్నెల కాస్తూ నిశ్శబ్దంగా ఉన్న రాత్రి అది. ఇంతలో నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ జోరుగా తిరుగుతున్న చక్రాల సవ్వడి అతనికి వినిపించింది. దాంతోపాటు గుర్రపు డెక్కల చప్పుడు కూడా అతను విన్నాడు.

"స్కాట్ వస్తున్నాడు" అప్రయత్నంగా అరిచాడు. "హడావుడిగా వస్తున్నట్లున్నాడు" అన్నాడు!

అతను ఆ మాటలు పూర్తిచేసేలోగానే గుర్రాలులాగే శకటమొకటి అతన్ని క్రిందకితోసేసి వెటేపోయింది. అది అతన్ని దాటగానే కొంత దూరంపోయి ఆగిపోయింది. వెంటనే చెవులు బద్దలయ్యేలా ఓ కంఠస్వరం అతన్ని ఆజ్ఞాపించింది, "ముందా గేటు తెరు"

రైతుకి ఆ ఆజ్ఞని పాటించాలనే విషయం తోచలేదు. భయంతో అక్కడనుంచి వెనుదిరిగి చూడకుండా పారిపోయాడు.

ఆ బండిని నడిపే వ్యక్తి శతాబ్దాలనాటి దుస్తుల్ని వేసుకుని ఉన్నాడు. అతని తల ఉండాల్సిన చోట కాకుండా చేతి క్రింద భాగంలో ఉంది. మోకాలిమీద మరో స్త్రీ తల ఉంది. ఇంకో చిత్రాతి విచిత్రమైన సంగతేమిటంటే ఆ బండికి కట్టిన గుర్రాల కసలు తలలే లేవు!

ఆ బండి నడిపే అతను సర్ థామస్ బొలెయిన్. ఆ స్త్రీతల అతని కుమార్తె అన్ బొలెయిన్‌ది. ఒకానొక నేరానికి శిక్షగా అతను నార్ఫోక్‌లో ఉన్న పన్నెండు బ్రిడ్జిల వలయాన్ని చుట్టి రావడానికి వీలులేదని శాశించారు న్యాయాధికారులు.

ఆ రైతుమాత్రం ఆ దృశ్యాన్ని చూచి భయంతో కంపించిపోయాడు. అతను తమాషాకు అలా చెప్పి ఉంటాడని కూడా అనుకోడానికి వీల్లేదు. అదేదో భ్రాంతి లాంటిదనుకోడానికా రైతు నరాల బలహీనతవల్ల బాధపడుతున్న వ్యక్తికాదు! అతనేకాక ఈ విచిత్రాన్ని కళ్లారా చూచిన వాళ్లు ఇంకా ఎందరో ఉన్నారు.

వాళ్లందరూ పొరబడ్డారనుకోడానికి కూడా వీల్లేదు. ఎందువల్లనంటే—ఒకరు చెప్పిన దానికీ, ఇంకొకరు చెప్పిన దానికీ తేడా లేకుండా ఒకేలా ఉన్నాయి వాళ్ల ఉదంతాలు.

ఎలిజిబెత్‌రాణి తల్లి అన్ బొలెయిన్ మరణ శిక్షకు గురైందన్న విషయం అందరికీ తెలిసిందే! ఆ సంఘటనకీ, ఆమె తండ్రికి తల లేకుండా పోవడానికీ గల సంబంధం ఏమై ఉంటుంది? ఆమె ఖర్మలో అతను పాలుపంచుకున్నట్లు కూడా ఆధారాల్లేవు.

ఇంకొక కథ కూడా ఉంది దీనికితోడు. ఇంకొక తలలేని మనిషి తన బండిని నార్త్ ఫోక్ గేటు కుండా సంవత్సరానికొకమారు నడిపిస్తుంటాడు. ఆ గేటు కట్టడం చాలా పురాతనమైందీ, శిథిలమైందీ కావటంచేత ఆ బండి వెళ్లినప్పుడల్లా ఆనవాళ్లు దొరికేవి.

ఆ కథనం నిజమని ఆ ప్రాంతంవారే చెప్పారు. "ఆ బండి ఎప్పుడొస్తుందో మాకు తెలుసు" వాళ్లల్లో ఒకడు చెప్పాడు "ఆ మర్నాడు చూస్తే ఆ గేటు స్తంభాలలో ఉన్న ఇటుకలు కొన్ని వూడి క్రిందపడి ఉంటాయి."

హైలాండ్ ఫోక్స్ ఈ రకమైన విచిత్ర సంఘటనలకి పేరు పొందింది. ముల్‌దీవిలోఉన్న లోచ్‌బూకి సంబంధించిన తలలేని కౌతుకంటే అది చిత్రాతి విచిత్రమైందని నా నమ్మకం. ఈ ఉదంతం కొన్ని శతాబ్దాలుగా నలుగురికీ తెలిసిందే! 1538 లో ఇవేన్ మేక్‌లిన్ కత్తి దెబ్బకు గురైనాడు. అతని తల ఖండించబడింది. అప్పటినుంచీ అతను దెయ్యమై లోచ్‌బూని తరచుగా వెంటాడుతుండేవాడని ప్రతీతి. ఆ దయ్యం యొక్క ప్రత్యేకతేమిటంటే అది కనపడినప్పుడల్లా చావు త్వరగానూ ఎదురు చూడని విధంగానూ సంభవించేది, ప్రతిసారి మేక్లిన్‌వంశంలో ఒక పెద్ద తల ఎగిరిపోవటం జరిగేది.

యాభైఅయిదేళ్ల క్రిందట లోచ్‌బూలో ముగ్గురు అక్క చెల్లెళ్లుండేవాళ్లు. వాళ్ల ముగ్గురు ఒకేచోట కలిసి జీవించేవారు. ఒకానొకరాత్రి వారిలో ఒకామె భయంకరమైన కేకలనూ, శబ్దాలనూ వినటం సంభవించింది. వాటి కర్థం తనకు అంత్య ఘడియలు సమీపించినయ్యనీ, వాళ్ల వంశం దెయ్యం వచ్చిందనీ ఆమెకీ తెలుసు.

ఆమె చనిపోవటాని కెంతోకాలం పట్టలేదు.

కొద్దికాలానికే ఆమె సోదరెంకొకామె అదే అనుభవాన్ని పొందింది—ఆమె జీవితం అలాగే అంతమైంది.

1902 లో ఒక నాడా దుస్సంఘటన వారిలో ఆఖరామెకి ఎదురైంది. ఆ తర్వాత ఆమె చనిపోవ

దానికి కొన్ని గంటలు మాత్రమే పట్టింది.

ఏడేండ్లు ఎంతో ప్రశాంతంగా గడిచిపోయి నయ్ అనంతరం ఆ కుటుంబంలో సభ్యుడైన మర్డూచ్ మాక్‌లిన్‌కి హెచ్చరిక వచ్చింది. కానీ దయ్యం ఇదివరకంత తీవ్రంగా మాత్రంలేదు అది చాలాసార్లు అతనికి కనిపించింది. అయితే ఎందువల్లనో మర్‌డూచ్ మాక్‌లిన్‌కి దానివల్ల ఎలాంటి అపకారమూ జరగలేదు. దీన్నిబట్టి చూస్తుంటే ఆ దయ్యం తన మారణశక్తిని కోల్పోయిందా అన్నట్లుంది. పొరపాటు!!! ఎంతమాత్రం అది తన శక్తిని కోల్పోలేదు తర్వాత కొన్ని నెలల్లోనే మాక్లిన్ మరణించాడు

క్రిందటి యుద్ధానికి పూర్వం కొంతకాలం వరకూ ఆ దయ్యం తన చేష్టలను భయంకరంగా కొనసాగిస్తూనే ఉంది ఆ చేతలను కళ్లారా చూసిన వాళ్ళూ, శబ్దాలను చెవులారా విన్నవాళ్ళూ ఎంతో మంది ఉన్నారు ఇలా జరిగిన తర్వాత కొద్ది కాలంలోనే ఆ వంశీయుడొకడు విదేశాల్లో మృతి నొందాడు

ఈ తలల్లేని మనుష్యులూ—గుర్రాలకి తోడు తలలేని కుక్కలు కూడా ఉన్న ఉదంతాలు చాలా సంభవించినయి

కొద్దికాలం క్రిందటి ఎపోక్స్‌లో ఒకతని కుక్కని ఎవరో చంపేశారు దాన్నతడు చాలా ప్రేమతో పెంచేవాడు పెద్ద శరీరంగల నల్లని ఆ కుక్క తలను ఎవరో తుపాకితో వేరు చేశారు ఆ పని ఎవరు చేసి ఉంటారో వూహించగలిగాడు కానీ, దాన్ని రుజువు పర్చటానికి తగిన ఆధారాలను సంపాదించలేకపోయాడతను.

తర్వాత కొన్నాళ్ళకి సంధ్యావేళలో అతను అడవిని కాలుస్తుండగా రెండుసార్లు తుపాకి ప్రేలిన శబ్దం వినిపించింది వెంటనే అతడు ఆశబ్దం వచ్చినవేపు వేగంగా పరిగెత్తాడు కొంతదూరం అలా వెళ్లాక తను ఒంటరిగా లేడన్న భావన అతనికి కలిగింది అతనివెంట ఎవరో మెల్లగా అనుసరిస్తున్నట్లు అనిపించింది కొన్ని నిమిషాల్లోనే అతను భయంకరమైన ఆర్తనాదాన్నొకదాన్ని విన్నాడు చాలా వేగంగా వెళ్తున్న ఒక నీడలాంటి ఆకారాన్ని తను చూశాడు. కొద్ది క్షణాల్లోనే భయంకరమైన చావుకేకొకటి అతనికి వినిపించింది నెత్తురు గడ్డ కట్టుకుపోయేటంత భయంకరంగా ఉన్న ఆ ఆర్తనాదం వినపడినవైపు పరిగెత్తాడతడు వెంటనే! కొంతదూరం వెళ్ళిన తర్వాత అతనికి కనిపించిన దృశ్యం గుండె ఆగిపోయేటంత భయంకరంగా ఉంది భయోత్పాతంతో కేకలు పెడుతూ నేలపై ఎడున్న ఓ వ్యక్తిని అతను చూశాడు, ప్రక్కగా చనిపోయి వో ఎక్కి పడిఉంది అతనిమీద ఒక జాగిలం! అది తలలేనిది! ఆ కుక్క భయంకరంగా అరుస్తూ అతన్ని చీల్చి చంపేసింది. ఆ దృశ్యాన్నిచూసిన అతను మాత్రం తను వీక్షించిన దాన్ని చెప్పినవిధం చాలా మామూలు ధోరణిలోనే ఉంది. "నేను ఫ్లోస్‌ని ఎంతగానో ప్రేమించాను" అతను నిదానంగా చెప్పాడు "అది కూడా నన్నంతగా ప్రేమించింది. నేను దాని చావు వల్లాలంగా ఎంతో కుమిలిపోయానని దానికి తెలుసు అందుకే అది తనను హతమార్చిన వాడిని వేటాడటానికి తిరిగి వచ్చింది."

ఈ విచిత్రం కేవలం పుస్తకాల్లో రాసిన రాతే కాదు! కళ్లని కనిపించిన కటిక సత్యం కూడా!

లండన్ నగర వాస్తవ్యు డొకడు ఇలాంటి సంఘటననే వెస్ట్‌మోర్‌లాండ్‌లో చూశాడు.

వెన్నెలలో విహారానికని బయలుదేరిన అతనికి కొంత దూరం వెళ్లాక కుక్క అరుపులు వినిపించినయి. కుక్కలంటే ఎంతో ఇష్టం ఉన్న అతను దాన్ని గురించి ఆందోళన పడలేదు. ఆ శబ్దం వచ్చిన దిశగా కొద్దిదూరం ముందుకి వెళ్లాడు. అలా అతడు కొన్ని గజాల దూరం వెళ్లగానే ఆ శబ్దం ఏడుపుగా మారింది. తనక్కడపడ్డ దృశ్యాన్నిగురించి అతను తర్వాత చెప్పాడు, "అప్పుడు నా కాళ్లల్లో ఎంత బలం ఉందో పరీక్షించాను. నిజంగా భయంకర దృశ్యం ఎన్నావిధంగా పరిగెత్తించింది. ఆ అరుపులు ఏ జీవించిఉన్న ప్రాణివికావు తలలేని ఒక పెద్ద జాగిలం అరుస్తున్న అరుపులవి!"

ఆ కుక్కకి కొద్దిదూరంలోనే గొర్రెల మందొకటి ఉంది. అది బహుశ ఆ గొర్రెల కాపలా కుక్క అయి ఉంటుందని, చనిపోయిం తర్వాత దయ్యమై కూడా అది ఆ మందను సురక్షితంగా కాపలా కాస్తున్నదని, అతను తన కళ్లారా చూచిన విచిత్ర దృశ్యాన్ని వివరించాడు.

(ఇంకా ఉన్నాయి)



కొలనులో ప్రతిబింబిస్తున్న అంకర్ వాల్‌లోని ఒక ఆకర్షణీయమైన దేవాలయం.



అక్కడి నె
పార్వతి

# అందచందాలను వెదజల్లే కాంబోడియా ద

ఉదయం తొమ్మిది గంటలకి 'నాంపెన్' విమానాశ్రయంలో దిగాను; 'సైగాన్' నుంచి నాంపెన్‌కి గంట ప్రయాణం చేసిన తర్వాత.



శిథిలాల్లో నించి బయటికి తీసి భద్రపరచబడ్డ గణేశుడు.

నాంపెన్ కాంబోడియా రాజధాని. అందమైన పట్నం. అధునాతనంగా కనిపించేబజార్లూ, హోటళ్లు, బార్లు, నైట్‌క్లబ్‌లు, పార్కులు కళ్లు మిరుమిట్లు గొలిపేట్లుంటాయి.

రుఖలియా అనే హోటల్లో బస ఏర్పరచుకుని వెంటనే వూరు చూడటానికని స్నేహితులతో బయలుదేరాను......

ఈ దేశపు భాషని 'కాంబోడియన్' అంటారు! ఈ భాష లిపి తెలుగు లిపిని పోలిఉంటుంది. మనకి ఇంగ్లీషు ఎలాగో ఇక్కడి వారికి ఫ్రెంచి అంత.

## ప్రజలు...

ప్రజలెలా ఉంటారు? దక్షిణ భారతదేశం వారిని కొంతదాకా పోలిఉంటారు. ఆడవారు రంగు రంగుల లుంగీలు, జాకెట్లు వేసుకుంటారు. మొగవారు లాగూ, చొక్కా మొదలైనవన్నీ వాడుతారు......

కాంబోడియాలో చైనావారు చాలా మంచి పలుకుబడి కలిగి ఉన్నారనిపిస్తుంది. వ్యాపారంలో, పరిశ్రమలలో వీరే ఎక్కువగా కనిపిస్తారు. అయితే వీరు పేరుకే కాంబోడియన్లు కాని, ఎన్నో సంవత్సరాలక్రితం వచ్చి స్థిరపడిపోయినవారు కాబట్టి వేష భాషలలో కాంబోడియన్లనే అనుకరిస్తారు....

## చైనాప్రభావం

హాంకాంగ్‌నుంచి 'చైనీస్' వస్తువులు దిగుమతికి అంతులేదు! అన్ని రకాల ఆధునిక సామ్యగ్రి ఇక్కడే లభిస్తుంది. కాంబోడియన్ల జీవితాలలో ప్రతిరంగంలోనూ చైనా ప్రభావం కనిపిస్తూనే ఉంటుంది. చివరికి అమెరికా ప్రభావాన్ని కైతం మించిపోతున్నదా అనిపిస్తుంది.

ఇదంతా అలా ఉంచండి! ఈ వ్యాసంతోబాటు వేసిన బొమ్మలనిబట్టి వూళ్లో ఎంత చక్కటి భవనాలూ, పార్కులూ ఉన్నాయో తెలుసుకో గలుగుతారు. చరిత్ర తిరగేస్తే భారత దేశానికీ ఇక్కడి ప్రాచీన సంస్కృతికీ ఎంత



అది శేషుని సాయంతో దేవతలు
మధిస్తున్న



...డాల్లో కనిపించే
...ాట్యభంగిమ.



కాంబోడియా కోటలో ఉన్న బౌద్ధస్తూపాలు,
దేవాలయాలు.

# ...శ్యాలు: పురాతన హిందూ శిల్పాల ప్రాభవం

ఆ. శివరామబ్రహ్మం

సాన్నిహిత్యం ఉందో తెలుస్తుంది.

12 వ శతాబ్దంనుంచి 15 వ శతాబ్దందాకా ఇక్కడ హైందవ రాజులు ఎందరో పరిపాలించారు. సూర్యవర్మ, భాస్కరవర్మ, ఆదిత్యవర్మ, ప్రభాకరవర్మవంటి పేర్లు నాంపెన్ మ్యూజియం లోని ప్రదర్శనలను చూసినప్పుడే కనిపిస్తాయి. ఇక చరిత్ర మాటేమిటి! పేర్లు సూర్యారాధన ప్రబలంగా ఉండేదని సూచిస్తాయి......

శిలా శాసనాలు ప్రాకృత భాషలో ఉన్నాయి.



పాల సముద్రాన్ని అమృతానికై
దృశ్యం.

నేటికీ 'మంత్రి పాఠశాల, పుస్తకాలయం' వంటి మాటలు కాంబోడియన్ భాషలో వినిపిస్తాయి.

## హనుమంతుడిబొమ్మ

మరొక విచిత్రం—కాంబోడియా ధ్వజం మీద హనుమంతుడి బొమ్మ ఉంటుంది!

నాంపెన్‌కి 300 కిలోమీటర్ల దూరంలో ఉన్న అంకర్‌వాట్ ప్రపంచంలోని అత్యద్భుతాలలో ఒకటని నిస్సందేహంగా చెప్పవచ్చు. మేము కారులో సాయంత్రం 4 గం. లకి బయలుదేరి 7—30 కల్లా 'సింరాప్' ఊరు చేరుకున్నాము. రాత్రికి అక్కడే ఉండిపోయి మర్నాడు 8 గంటలకి తిరిగి బయల్దేరి 35 మైళ్లదూరంలోఉన్న 'ఖింవస్రీ' అన్న చోటుకి వెళ్లాము. ఇక్కడ పెద్దనరసింహ స్వామి ఆలయం ఒకటి ఉంది. గుడిలోమాత్రం స్వామి విగ్రహంలేదు. ప్రాకారంమీద రామాయణం లోని ఘట్టాలు ఎన్నో చెక్కారు....

## శివాలయం

ఈ గుడి చూసేప్పటికి 12 గంటలయింది. ఆలయం పక్కనేఉన్న వాగులో స్నానం చేసి, రొట్టె మొదలయినవి ఆరగించి, కొంత విశ్రాంతి తీసుకుని 2 గంటలకి 'పేరూప్' అనే ఆలయం చేరుకున్నాము. ఇది శివాలయం. ప్రేరూప్ అంటే ప్రేతరూపం అన్నమాట. మునుపటి కాలంలో అస్తికల్ని ఇక్కడ ఒక గుండంలో పడవేసేవారట. ప్రేరూప్‌కీ, బెంవసరాక్ మధ్యలో 'బేకాంగ్' అనే



ఆభరణాలతో అందంగా అలంక
రించుకొన్న రాకుమారి.

# కాంబోడియా

మరొక శివాలయం కూడా ఉంది. ఆలయంమీద అమ్మవారి విగ్రహాలూ, ఇంకా ఎన్నో చక్కటి శిల్పాలూ కనిపిస్తాయి.

తర్వాత 'అంకర్ థోమ్' గుడికి వెళ్లాము. దీని ప్రహారిగోడమీదనంతా క్షీర సాగర మర్దనం—ఆది శేషువు, దేవతలూ, రాక్షసులూ వగైరా— చెక్కడాలు కనిపిస్తాయి. ఇంత పెద్ద శిల్పాలు మన దేశంలో ఎక్కడా లేవనుకుంటాను (బొమ్మ చూడండి.)

## పెద్ద బౌద్ధ విగ్రహం...

ఈ ప్రదేశంలోనే 60 అడుగుల ఎత్తు బుద్ధ విగ్రహం కూడా ఉందంటే, నా అభిప్రాయంలో కొంత నిజం ఉందని అంగీకరిస్తారు!

'అంకర్‌వాట్' చేరుకునేసరికి సాయంత్రం 5 గంటలు అయ్యింది. హ్మైర వంశపు రాజులు పరిపాలించేకాలంలో ఇక్కడ పెద్ద రాజధాని ఉండేది.

అంకర్‌వాట్ దేవాలయం చుట్టు కొలత 2.5 కిలో మీటర్లు.

గుడిముందొక పెద్ద సరస్సు ఉంది.

గుడికి మొత్తం 5 గోపురాలు. గుడిచుట్టూ, కోటలూ, బాటలూ, విదేశీ టూరిస్టులూ, బౌద్ధ భిక్షువులూ కనిపిస్తూ ఉంటారు.

## చక్కని ప్రాకారాలు

బయట ప్రాకారంమీద రామసైన్యాలు, ప్రజల వృత్తి విధానాలూ, వేషభాషలూ, రాజకుమారులూ, రాణులూ, వారి అలంకరణ విధానాలూ ఇవన్నీ చక్కగా చెక్కబడి ఉంటాయి.

రెండవ ప్రాకారం చాలా ముఖ్యమైనది. దీనికి ఒక పక్క మహా భారతంలోని ఘట్టాలు ఎన్నో చెక్కి ఉంటాయి—ఒక ద్యూత సన్నివేశం, అభిమన్యుని యుద్ధం మొదలైనవి.

రెండవపక్క అశోకవనంలో సీతని హనుమంతుడు దర్శించుకోవటం, వానర సేతుబంధనం, లంకాపురి వైభవ దృశ్యాలు వగైరా అద్భుతంగా చెక్కబడి ఉంటాయి. ఇలాగే భాగవతంలోని ఘట్టాలు కూడా చూడవచ్చు. ఇవి చూస్తూ ఉంటే నా మనస్సు ఎక్కడెక్కడికో వెళ్లిపోయింది.

గుడిలోని దేవుడు శ్రీమన్నారాయణుడు. ఆది శేషువుమీద పడుకుని ఉంటాడు. లక్ష్మీదేవి పాదాలు వత్తుతూ ఉంటుంది. ఇరువైపులా బ్రహ్మ మహేశ్వరులు. ఇది శివ కేశవ దేవాలయం అన్నమాట.

ఇందులో ఒకచోట గుండెమీద చరుచుకుంటే 'ఓం' కార శబ్దం ప్రతిధ్వనిస్తుంది. మళ్లీ బయటికి వచ్చి చరుచుకుంటే వినిపించదు.

పురాతన కాలంలో భారతదేశ వైభవాన్ని చాటే ఈ మహా శిల్పాలని చూస్తూ ఉంటే తిరిగి ఈ ప్రాంతం దేశాలతో మన సంబంధ బాంధవ్యాలు పునరుద్ధరణ కావాలని కోరుకోకుండా ఉండలేము.



# సంపెంగాలూ సన్నజాజులూ




## జ రి గి న క థ

మంజుల వివాహకారణంగా, ఆర్థిక అవసరాల దృష్ట్యా కొడుకుని కట్నం తీసుకొని పెళ్ళి చేసుకో మంటాడు తండ్రి; మొదట నిరాకరించినా చెల్లెలి పై గల ప్రేమతో తర్వాత సరే నంటాడు. కూతురి పెళ్ళి చూడాలని కుతూహల పడ్డ తండ్రి మరో అర్నెల్లకి తీరని కోరికతోనే కన్ను మూస్తాడు. తర్వాత మంజుల వివాహ మవుతుంది. ఆరేళ్ళు గడిచాయి. మంజు యీలోగా బియ్యే పట్టాతోబాటు నాలుగేళ్ళ మధురిమను కూడా పొందింది. అన్నయ్య సలహాపై దంపతు లిద్దరూ ఎమ్మే చదవటానికి పూనుకుంటారు. భర్తతో కాశీవెళ్ళి పరీక్షలు బాగా రాశానన్న తృప్తితో తిరిగివస్తూ అన్నయ్య సంసారం ఆందోళనకరంగా ఉండటం గమనిస్తుంది భర్త పరీక్ష పాస్ కాలేపోయినందుకు బాధపడుతుంది మంజు వాళ్ళ సంసారంలో అపార్థాలు చెలరేగి సర్దుకుంటాయి. ఎం. ఏ ఫైనల్‌కి వెళ్ళాలని ఉబలాటపడుతున్న మంజుకు ఆశాభంగం కలిగేలా ప్రవర్తిస్తాడామెభర్త. చివరికెలాగైతేనేం ఎమ్మే పాసైనా ఉద్యోగం చెయ్యననే షరతుపై భర్తని ఒప్పిస్తుంది మంజు

ఇక ... ఆ

## 8

రోజూ అలవాటైన ఆఫీసరు మాటలు ఎవరూ లెక్కచెయ్యరుగాని నారాయణ మొహంమాత్రం చూస్తూండగా ముడుచుకుపోయి, ఇంకో అన్ని తప్పులుచేసి మరో ఇన్ని చివాట్లు తింటూంటాడు. ఆఫీసరు మొహ మెదుట ఏమీ అనలేని గుమాస్తాలు అతడు వెళ్ళగానే నారయణ్ణి మొహం వాచేటట్లు చివాట్లు పెడతారు, 'నీ వల్లే ఇవన్నీ భరించవలసి వచ్చిందని.' ఇంత అవమానం చాతగానితనం దుఃఖం నారాయణలాంటి అల్పజీవి ఎలా భరించగలడు? అన్నీ కలిపి వడ్డీతో సహా తనకు లోకువైన ఒకే ఒక వ్యక్తి ఆ భార్యామణికి బాజా భజంత్రీలతో బహూకరిస్తాడు. అంతేగాక అంత అందమైన భార్యకు తను తగనని వాడికి మరో ఏడుపు. అందుకని పాపం ఆ అమాయకురాల్ని చావగొడుతూ ఉంటాడు. ఇవన్నీ మా ఫ్రండ్సందరికీ ఎప్పుడో తెలుసు. మీకు తెలుసునేమో అనుకున్నాను. నిజంగానే తెలీదా నా చేత వాగిస్తున్నారా?' గాజా గ్లాసునిండా బత్తాయిరసం ఇచ్చాను. గోపాలంగారికి ఆయన చెప్పేదంతా ఆశ్చర్యంగా వింటూ. ఈయన జరిగిందంతా అతనికి చెప్పేరు.

'బాబ్బాబు ఆ అమ్మాయిని ఒక్క వారం రోజులు మీ ఇంట్లో ఉంచుకోండి. వాడి రోగం కుదురుతుంది. ఇంటి దగ్గిర అన్నీ పెళ్ళికొడుక్కి చేసినట్టు చేసి పంపిస్తూంటే వాడికెలా బుద్ధొస్తుంది?. పక్క పూళ్ళో కలరాగా ఉందని పూళ్ళో హోటళ్ళన్నీ పదిహేను రోజులపాటు కట్టేస్తున్నారట కూడ. వాడి తిక్క కుదరాలంటే ఇంతకన్న అవకాశం ఉండదు'

'పాపం ఏమైపోతాడో' అన్నాను నేను.

'అదిగో మీ ఆడాళ్ళకున్న ఆ జాలే మా మొగాళ్ళని మరింత పనికిరానివాళ్ళని చేస్తోంది. ధ్వజస్తంభంలా ఉన్నాడు, ఇంతలో వాడేమీ అయిపోడు. ఈవేళ ఆఫీసుకు వచ్చాడుగా. మామూలుగా పని చేసుకుంటూనే ఉన్నాడు. వాడివల్ల వాడి పెళ్ళాం ఒక్కర్తే కాదు. మేమందరం మాట కాయవలసి వస్తోంది తల్లి. తల్లి... ..'

'సరళ కూడా చాలా మూర్ఖపు మనిషిలా కనిపిస్తోంది గోపాలంగారూ ప్రయత్నిస్తాంగా' ఆయన వెళ్ళిపోయాడు. వీరిని ఆఫీసుకి సాగనంపి నేను సరళ పడుకున్న గదిలోకి వచ్చాను. పక్క ఖాళీ! పక్కన పనిమనిషి మంచం కోడుకి జారపడి కునుకుతోంది! దాన్ని ఒక్కటి అంటించాను. లేచి కూచుంది. వాళ్ళింటికి వెళ్ళిపోడానికి ఆయన తాళం వేసుకుని వెళ్ళిపోయేడాయె. సరళ ఎక్కడికి వెళ్ళినట్టూ? ఇల్లంతా నేనూ రంగీ రెండు మూడుసార్లు హడావిడిగా తిరిగేం డాబామీదకువచ్చి ఎదురింటి వైపుకి అప్రయత్నంగా చూసేసరికి వీధి తలుపు తీసి ఉన్నట్టు కనిపించింది.

'చిత్రంగా ఉందే! చూడు రంగీ, ఆవిడ ఇంట్లో ఉందో లేదో! చూసి అక్కణ్ణుంచే కేకెట్టు నే నిక్కడే ఉంటాను' అన్నాను. అది గబగబా మెట్లు దిగి ఆ యింటికి పరుగెత్తి లోపలికి తొంగి చూసి 'ఉన్నా రమ్మగోరూ' అని పెద్ద కేకేసింది.

నేను వెళ్ళేసరికి ఆవిడ ముక్కలు తరుగుతోంది!

'తాళం వేసిన ఇంట్లోకి ఎలా ప్రవేశించావమ్మా, తాంత్రికురాలివి కాదుకదా?' అన్నాను ఆమాత్రం అర్థం చేసుకోలేరా అన్నట్టు వెళ్ళో పోడానికి ముడేసిన డూప్లికేటు తాళం చూపించింది. దెబ్బలాడి ఉవిణ్ణక్కణ్ణుంచి లేవదీసి పడక్కుర్చీలో కూలేశాను.

'డాక్టరేమని చెప్పేడు, రెండ్రోజులు విశ్రాంతి తీసుకోమనలేదూ?'

ఆవిడ మాటాడలేదు. అయిదు నిమిషాలు ఆగి అతి నీరస స్వరంతో అంది. 'ఏమండీ, నా కాపురం యిలా సాగనియ్యదల్చుకోలేదా?'

'ఊహు నీ కాపురం యిలా మాత్రం సాగనియ్యదల్చుకోలేదు ఇది కాపురం కాదు, కాలునిపురం'

'ఇలా దెబ్బలు తినడం, యిట్టే దులిపేసుకోడం నాకు మామూలైపోయింది. మా అమ్మకీ, నాన్నకీ రాస్సైనా ఎరగను. మీకెందు కింత పట్టుదల?'

'నోరుమూసుకు పూరుకోడానికి యిది నిర్జీవమైన ఎడారికాదు, కిక్కిరిసిన లోకం. హింసను చూస్తూ, వింటూ పూరుకోడానికి మేం చెక్కిన శిల్పాలం కాదు, మనసున్న మానవులం. ముఖ్యంగా ఆయనేం చేస్తారో నాకు తెలీదుగాని యింతగా చెబుతున్నావు కనుక దీని అంతు చూడకుండా నేను మాత్రం వదలిపెట్టను. నువ్వు ఓ పదిరోజుల పాటు మీ ఆయనకి మొహం చాటేస్తే గాని ఆయన వ్యవహారం తేలదు'

చూస్తూండగా ఆమె కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

'ఆయనేదో నన్ను హింసించా రంటున్నారు, మీకన్న వేరే హింసించేది ఎవరు? కొట్టినా, తిట్టినా భర్త కళ్ళముందుంటే చాలు. అంతకంటె ఆడది కోరేదేమీ ఉండదని మీకు తెలియదా?'

ఎంత మూరుకైన ప్రశ్న! ఎంత సూటి ప్రశ్న! ఎంత సునిశితమైన ప్రశ్న! ఆమెమీద నా అభిమానం రెట్టింపు అయింది. ఆమెను దగ్గిరగా తీసుకొని ఆమె బుగ్గకు నా బుగ్గ ఆన్చాను. నా కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

'ఇవాళ నుంచి నువ్వు నా చెల్లెలివి. నన్ను అక్కా అని పిలు.'

'అయితే సరే అలాగే పిలుస్తాను. చెల్లెలి మాట అక్క కాదనదని నాకు తెలుసు. అందుకని ....'

'.... అందుకని నిన్నిక్కడ విడిచి వెళ్ళమంటావ్. అదేం కుదిరే వ్యవహారం కాదు. నువ్వు చెల్లెలివైనప్పుడు నీ సంసారం చక్కబరిచే బాధ్యత మరింత ఎక్కువైందని నాకు తెలుసు. లే. లేచి తలుపు తాళంతియ్'

'అక్కా, ఆయన్ని నువ్వు సరిగ్గా అర్థం చేసుకోలేదు. చిటికెనవ్రేలితో పెద్ద కొండ నెత్తిన కృష్ణుడే వెన్న తినే చిన్నకృష్ణుడని మరచిపోకు. కాస్త చేతిపాటుతనం ఉన్నా ఆయన మనసు నవనీతం.'

'అవును. నాకు తెలుసు. కాస్త వేడి తగిలిస్తేగాని ఆ ఘుమఘుమ యివతలికి రాదు. నవనీతం జన్మ పునీతం కావాలంటే ఒదొకటే మార్గం' సరళ మాటాడలేదు.

'చెప్పి చెప్పి నాకు ప్రాణం విసిగెత్తిపోతోంది. ఏ కాలో చెయ్యో విరిగితే గాని నీ కెలాగా బుద్ధిరాదు. అన్నీ చూస్తూ పూరుకున్నారా అని మీవాళ్ళు రేపొద్దుట అడిగితే మేం జవాబు చెప్పుకోలేక చావాలి. ఇవాళ మీ నాన్నగారికి మీ బావగారిచేత

# సంపెంగలూ సన్నజాజులూ

'వద్దక్కా, వద్దక్కా.'

'ఏమో నీ మొండితనం చూసి ఇదివరకే మీ బావగారికి ప్రాణం విసిగింది. నే నిప్పుడు చెప్పినా వినే పరిస్థితిలో లేరు. మే మెందుకు ఇంతదూరం చెబుతున్నామో నీకే పట్టనపుడు నాకెందుకు చింత ? మీవాళ్లే వచ్చి చూసుకుంటారు. వస్తా, వెళ్తా.'

సరళ లేచి నిలబడింది.

'ఉండు. నేనూ వస్తున్నాను.'

నా కళ్లు తళతళ మెరిశాయి. ఆమె కన్నీళ్లు తుడిచి బుగ్గమీద ముద్దెట్టుకున్నాను.

'మా చెల్లి మంచిది. ఈ వ్యవహారం ఇప్పటికి వీధిన పడింది చాలు. వూళ్లకి వూళ్లు పాకడం, కన్నవాళ్లు దుఃఖపడడం ఎందుకని ఇప్పటికేనా గ్రహించావు. అంతేచాలు. నిజానికి ఆయన నిన్ను చెప్పతో కొడుతున్నప్పుడు నాకేం అనిపించిందో తెలుసా ? దెబ్బల రాచి ఆయనకీ చూపించాలని అనిపించింది. మీ బావగారికున్న పరపతికి నలుగురు రౌడీలను పిలిపించి నువ్వా అనకుండా ఒళ్లు హూనం చేయించాలన్న కసి కలిగింది. కాని ఎందుకు వూరుకున్నామో తెలుసా నీ మొహం చూసి ......'

నే అలా చెబుతూండగా సరళ తన బట్టల పెట్టె, పరుపూ పైకి తీసింది. రంగిచేత ముందవి మా ఇంటికి పంపించేశాం. తర్వాత పై తాళం వేసింది వేసినట్లు వేసేసి ఇద్దరం గుట్టు చప్పుడు కాకుండా మా ఇంటి మేడమీదకు వచ్చేశాం. ఆమె ఇలా మళ్లీ వెళ్లిపోయినట్లూ, నేను వెళ్లి తీసుకు వచ్చినట్లూ మాత్రం ఆయనకు చెప్పలేదు.

ఆ తరవాత మాత్రం సరళ మాతో బాగా సహకరించింది. ఏ పత్రికలో చదువుతూనో మధురిమకి కబుర్లు చెబుతూనో కాలక్షేపం చేసేది. అప్పుడప్పుడు వాళ్లాయన గురించి అడిగేది గాని అదే పనిగా వేధించేది గాదు.

ఆ మూడో రోజు కాబోలు మధురిమ బడినుండి వస్తూంటే వారాయన పిలిచి అడిగాడుట.

'ఏం పాపా, మా సరళ మీ ఇంట్లో ఉందా ?'

'ఊఁ'.

'ఏం చేస్తోంది ?'

'పడుకుంది.'

'ఏం ?'

'నాకు తెలీదు.'

'ఒంట్లో బాగుందా ?'

'నాకు తెలీదు.'

'మరి అన్నం తింటోందా ?'

'నే చూళ్లేదు.'

'అలా ఎన్నాళ్లు ఆ అంతఃపురంలో ఉంటుంది ?'

'నాకు తెలీదు.'

'మరి నే నోసారి కిందకి రమ్మన్నానని చెబుతావా ?'

'ఎందుకూ ?'

'ఎందుకో, నీ కెందుకూ ?'

'అయితే నే నెందుకూ ?' మధురిమ తుర్రుమని పారిపోయి వచ్చేసింది.

ఈ జవాబులకి నాకు చాల ముచ్చటేసి అది చాలా రోజుల్నుంచి అడుగుతున్న చాకలెట్ టిన్ కొనిచ్చాను.

'ఎందుకే అలా చెప్పేవ్, ఇలా చెప్పమని నీ కెవరు చెప్పేరు ?'

'బళ్లో మా మేష్ట్రుగారు చేతి మణికట్టు ఇలా పట్టుకుని గట్టిగా దువ్వకవేసి కొడతాడు. చాలా నొప్పెడుతుంది. ఏడుస్తే మళ్లీ కొడతాడు. ఆయన్నొకసారి ఎద్దు కుమ్మేసింది. మా కందరికీ ఎంత సంతోషం వేసిందనుకున్నావ్ ! కొట్టే వాళ్లని చూస్తే నా కసహ్యం. అందుకే అలా ఏడిపించాను.'



ఓసి దీని కెన్ని గోలు వచ్చా, అని ముక్కుమీద వేలేసుకున్నాను. బిస్కట్లూ, రొట్టె తెప్పించుకుని మింగుతున్నాడట, రంగు చెప్పింది, కొంచెం కొన్నైనా జబ్బువాడు వస్తే పెంచదే.

వ్యభిచారం ఒక్కటే వ్యసనమనుకుని, ఆ పాపం పోలికి వెళ్ళని పురుషులు తమంత సత్పురుషులు లేరనుకుని తక్కిన అరవిధాలా భార్యలను బాధిస్తారు. వీళ్ళకు బుద్ధి రావడమే రావడం.

ఐదురోజుల ఏమనుకున్నాడో ఏమో వారి దుకాణం మా యింటికి వచ్చాడు. 'సరళని క్రిందికి రమ్మనండి' అని పైకి కబురు పంపించాడు వారు ఇంట్లో లేరు నేనా కబురు సరళకు చేరనియ్యక నేనే మేడ దిగి వచ్చాను. దిగుతూంటే నా కాళ్ళు వణికేయి.

'నమస్కారం. కూర్చోండి. బాగున్నారా ?' అన్నాను నేనూ కూచుంటూ.

'ఆఁ, మీ దయవల్ల ఇదిగో యీ మాదిరిగా అతి కులాసాగానే ఉన్నాను' నవ్వు నవ్వు బలవంతాన పళ్ళమధ్య పట్టి ఆపి అన్నాను.

'మధ్యని మా దయేముందిలెండి, చేసుకున్న వారికి చేసుకున్నంత !'

'ఇలా ఎన్నాళ్ళు మా ఆవిడని బంధించి ఉంచదలిచారు ?'

'బంధించి, నిర్బంధించి ఎవర్నెన్నాళ్ళు ఉంచ గలరు. అదిగాక ప్రపంచంలో అందరూ గిరిగా తున్నతే ఉండరు ఆమెను ఆ పరిస్థితుల్లో వదిలేసి మిత్రతే వెళ్ళిపోగలిగారు గాని . . .'

'ఏం ఆమె కేమయింది ?' అన్నా డతడు కొంచెం దగా, ఆత్రుతగా.

'ఏమయితేనేం, మీ కిప్పుడు కావలసి వచ్చింది. అదైనా ఎందుకు, మీకు అవసరం వచ్చింది గనుక మీ కడుపులో ఎలకలు కీచుకీచు మంటు న్నాయి కనుక.'

అతడు సిగ్గుపడ్డట్టు తల వంచుకున్నాడు.

'గాయాలకు చీము పట్టేసింది- విప్పటిదాకా పత్యమే పెట్టడానికి వీలులేనంతగా జ్వరం కాసింది. ఒకపట్టాన తగ్గుతుం దనుకోలేదు మేం ఆమెను యిలా తీసుకొచ్చి వైద్యం చేయించడం మీకు తప్పని తోస్తే మన్నించండి'

అతడు మొహం రుమాలుతో తుడుచుకున్నాడు.

'మాకేం అభ్యంతరంలేదు. మీ రిప్పుడే తీసుకు వెళ్ళిపోవచ్చు'

'ఒక్కటి మాత్రం చెబుతాను భార్య అన్న ఆమె అవసరం మీ కోర్కెలు తీర్చేవరకూ మీకూ వండి పెట్టే వరకూ మాత్రమే పరిమితం కాదు. తరువాత భౌతికంగా ఆమెను గాయపరచినంతమాత్రాన మీ ఆధిక్యం బయటపడదు సరికదా, ఏవిధంగానూ మీ చాతగానితనం కప్పబడదు మీరు యిన్నాళ్ళకు యిక్కడికి వచ్చారా ఆమె మాత్రం మిమ్మల్ని తలచుకోని క్షణం లేదు మీరు యిబ్బంది పడుతున్నారని బాధపడని నిముషం లేదు అనురాగంతో నిండిన హృదయం మది. దాని నెప్పుడూ గాయ పరచనని మాట యివ్వండి. గులాబిరంగు బుగ్గల ఆ అందం చెడగొట్టనని మాట యివ్వండి. మీ మగతనం మీ ఉద్యోగంలో చూపించండి. మీమన్ను ఆవిణ్ణి తీసుకువచ్చిన పని అయిపోయింది. మీరింక ఏ క్షణమైనా తీసుకుపోవచ్చు'

కొద్దిసేపు అయిన తరువాత అతను తలెత్తాడు. అతడి బుగ్గలనిండా తడి చేతులు కంటుకుంది. రుమాలుతో తుడిచేసుకున్నాడు

'ఒకసారి ఆమెలా ఉందో చూసి వస్తాను.'

'వెళ్ళండి, దానికేం అభ్యంతరం ?'

నే నక్కడే కూచున్నాను. అతడో పావు గంటలో దిగి వచ్చాడు.

'అన్నివిధాలా మీకు కృతజ్ఞుణ్ణి. అది వచ్చేసా నంటోంది గాని, యింకా బాగా నీరసంగా ఉంది. ఇంకో వారం ఉంచేస్తాను'

'అంతకన్నానా ?'

'నన్ను క్షమించండి'

'ఇప్పుడు కాదు. మళ్ళీ మీరు ఆమెమీద చెయ్యెత్త లేదని తెలిసినపుడు. తప్పు లేకపోయినా మీ ఆఫీసరు ముందు తల వంచనపుడు'

'మూస్తారుగా ?'

'ఇంకొకమాట . . ఎంత నచ్చచెప్పుకున్నా లేని పోని ఆనవ్వూ, చొరవా తీసుకున్నానేమో అని మీకు యిబ్బంది కలుగచేసినమోనని, ఏం మనసు నొప్పించా

కారు డ్రైవరు : నా 1940 మోడలు ఫోర్డు కారు 60 మైళ్ళ స్పీడులో వెళ్తూన్నదంటే మీరేమనుకుంటారు ?

మిత్రుడు : పెద్ద తుఫాను వస్తోందనుకుంటాం.

సి. ఉపేంద్రదాగ్ (మద్రాసు)

నని నాకు బాధగానే ఉంది. దానికి మీరనా మమ్మల్ని మన్నించాలి.'

'ఎంతమాట !'

'ఉత్తి మాటతో తృప్తి పడేదాన్ని కాను— నాకు క్రియ కావాలి.'

'చెప్పండి, ఏం చెయ్యమన్నా చేస్తాను.'

'తప్పక చేస్తారుగా ?'

'అలాగే'

'మీరు తెచ్చుకున్న బిస్కట్ల పొట్లం మా మధురి మకు యిచ్చెయ్యండి రొట్టె అలా మురాలలేకుండా ఉంచేస్తే ఏ ఎలకో ఫలహారం చెయ్యకపోదు.'

'అయితే యివాళ నుంచి గాలి భోంచెయ్యమనా తమ తలంపు ?'

'మీకున్న శాంత్యం మాకుంటే ఎప్పుడో దారి లోకి వచ్చిఉందురు. ఇప్పటికే మీరు నీరసపడి పోయారని మా చెల్లి నన్ను కాల్చుకు తినేస్తోంది. అటూ యిటూ యిక నడలేను ఈ రాత్రి నుంచి మళ్ళీ మా చెల్లి వండిపెట్టేదాకా మీకు యిక్కడే భోజనం.'

నారాయణ నవ్వుతూ వెళ్ళిపోయాడు

గోపాలంగారు తరువాత చెప్పేవాడు. నారాయణ చిత్రంగా మారిపోయాడట. ముఖ్యంగా ఆఫీసులో అతడి ప్రవర్తన బాగా మారిపోయిందట. ఆఫీసరే ఏమన్నా ఇప్పు డతడు మునపట్లా పడడంలేదట. 'ఏం లేటుగా వచ్చావ్, ఒళ్ళు తెలియటేదా ?' అంటే 'లేటుగా వస్తే లేటు మార్కు చేసుకోండి ఇందులో ఎవరికి మాత్రం ఒళ్ళు తెలియవలసిన అవసర మేముంది ?' అనే వరకూ ఎదిగాడట. మునపట్లా పనిలో కూడా అస్తమానూ తప్పులు చెయ్యడం లేదుట. కర్మం చాలక చేస్తే 'మీకు లోపమని తోస్తే ఆ విషయం కాగితంమీద పెట్టండి. మాటంటే మాత్రం పడేవాణ్ణి కాను. పదవులు వేరుకావచ్చు అందరం మనుషులమేగా !' అని గలుగుతున్నాడట కూడా గుమాస్తా అందరూ కూడా యిప్పు డతన్ని అభిమానంగా చూస్తున్నా రట.

'చిత్ర మేమిటంటారా అమ్మా, అసలు మా ఆఫీ సరుగారు ఇంట్లో మాటాడలేక ఆ అక్కసు ఆఫీసు కొచ్చి వెళిగక్కేవారని వినికిడి. ఇప్పుడు ఇంట్లో కూడా గట్టిగా చెప్పగలుగుతున్నాట్ట !'

నేను నవ్వుకొన్నాను. మొహా మెదురుగుండా పొగడుతారు గాని ఇవన్నీ ఎవడు నమ్ముతాడుతే అయినా వీళ్ళందరి సొడవా నా కెందుకు ? అమా యికురాలు ఆ సరళ భర్తచేత దెబ్బలు తినకుండా ఉండడమే నాకు కావలసింది నారాయణ అమానుతం మంచి లేసుకుని పెళ్ళాన్ని చంకవేసుకున్నాడని నేను చెప్పలేను గాని మునుపటిలా గొడ్డుని బాదినట్టు బాదడంలేదని మాత్రం చెప్పగలను. ముఖ్యంగా సరళ లోని మార్పు చెప్పుకోదగ్గది. క్రమంగా నాకే సలహా లిచ్చేంతవరకూ పెరిగింది ఆమె మానసిక ప్రవృత్తి !

*    *    *

సరళ మళ్ళీ భర్తతో ఎదురింటికి వెళ్ళిపోయిన వాడే అనుకుంటా, అన్నయ్య దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది.

'మంజూ, ఈసారి మా యింటికి వచ్చి వెళ్ళిన తరువాత నాకు మునుపటంత సంతోషంగా లేదు. మీరిద్దరూ ఏ విషయంలో నైనా దెబ్బలాడుకున్నా రేమోనని నా మనస్సు బాధపడుతోంది. ఏమైనా చిన్న చిన్న తగవులు వచ్చినా వాటని లక్ష్యపెట్ట కుండా బ్రతకడం నేర్చుకుంటే అవి మనల్ని ఏం చెయ్యలేవు. అవే అస్తమానూ ఆలోచిస్తూ కూచుంటే మన బుద్ధితోపాటు మన పోరూ తిన్నగా ఉండవు ఎప్పుడూ అనుకోని దుష్పరిణామా లకి దారితీస్తాయి. నిజానికి కీచులాడుకోని భార్యా భర్తలే ఉండరు చిరుచేదు లేందే జీవితానికి రుచి ఉండదు కూడా. నీ ఉత్తరం నాకు చేరకపోయినా అందులో భావాలు మీ యిద్దరి మొహాలూ చూసి స్పష్టంగా గ్రహించగలిగాను

నీ భర్త విషయంలో ఏదైనా మార్పు వచ్చిం దేమో, నీ చదువుకి ఆటంకం కలిగిస్తున్నాడేమోనని నీ భయమూ, ఉద్వేగమూ కావచ్చు అది నిజమే. నీ చదువు విషయంలో అతడు నా దగ్గిర కూడా చాలా ముక్తసరిగా మాట్లాడేడు. మన మందరమూ పరి స్థితుల ప్రభావాలకు బానిసలమూ, దాసులమూ కూడా. అతడు కలిగించే ఆటంకాన్ని తేలికగా తీసి పారెయ్యడానికిగాని వీలయితే ఎదిరించి అధిగమించ

డాక్టరని నువ్వు ప్రయత్నిస్తే అది జయప్రదం కావాలని గుర్తుంచుకో అతడూ వివేకమూ, విశాల హృదయమూ కలవాడు అతడా విధంగా ఆలోచించ డానికి గల కారణాన్ని తెలుసుకోడానికి ప్రయ త్నించు. మంచిమాటలతో నచ్చచెప్పి అతన్ని నీ దారికి తీసుకురావడానికి ప్రయత్నించు నువ్వు తలచు కుంటే అది అంతగా సాధించలేని కార్యమేమీ కాదు.

మీ వదినగాని నేనుగాని మీ సంసార విష యాల్లో ఎటువంటి కలతలూ వూహించలేము. భరించలేము కూడా.

వెంటనే జవాబు రాయి. —అన్నయ్య.'

మనిషికి మనిషి దూరం కావచ్చు. మనస్సులకి దూరం కొలిచే కొలతేమిటి? నాకు హృదయ స్పందన, మనోసంచలనం ఎప్పుడు కలిగాయో అప్పుడు మా వదినా అన్నయ్యా నా ప్రక్కన ఉండనే ఉన్నారు. మనోహరదృశ్యాలను చూసి కన్నులు చెమర్చినప్పుడూ శ్రావ్య సంగీతం విని మనస్సు లయమై పోయినపుడూ మనకు కావలసినవారు మన ప్రక్కన లేరే అనే భావమే మనం వారిని తల్చు కునేలా చేస్తుంది. మనసారా నవ్వినా బావురుమని ఏడ్చినా వారు మనతో పాలు పంచుకోవాలి. నా మన సులో ఉంటే అన్నయ్యకు నేను రాసుకునే దేమిటి వెర్రి, అయినా రాశాను. తెలిసిన వారిని మోస పుచ్చడం అదో వేడుక!

'మీ సహాయానికి ఎప్పుడూ కృతజ్ఞురాలిని. కాని ఆయన్ని అర్థం చేసుకోడంలో మనం కొద్దిగా పొరపడ్డామా అనిపిస్తోంది. నా చదువుకి ఆయన ఏవిధంగాను అడ్డురారు, పైగా ప్రోత్సహిస్తున్నారు కూడా. ఎటొచ్చీ ఆయన కొంచెం బద్ధకం మనిషి. ఎంత బతిమాలినా ఆయన మాత్రం పరీక్షకు కూచోవటంలేదు. 'మీ ఆవిడ ప్యాసయింది, నువ్వేమో ఫెయిలయినావు' అని వాళ్ల స్నేహితులు నలు గురూ ఏడిపిస్తే కొంచెం ఉడుక్కున్నట్టు కనిపి స్తుంది. అంతే. ఆ ధుమధుమ అప్పుడే పోయింది. ఆయన నాకేసేప్పుడు కోపంగా ఉండలేరు కూడా. నువ్వు చేసిన ఎన్నిక మరోలా ఎందుకుంటుంది? ఇది చూసి నేను చేసిన ఎన్నిక ఏమంటుందిట ?'

ఉత్తరం పూర్తిచేసి చదువుకొనిచూస్తే మన స్సెంతో తేలిక అనిపించింది. దృక్పథంలో ఉన్న ప్రతివస్తువు ఎంతో అందమైన దానిలా కనిపించింది. నాకు తెలీకుండానే నాకంఠంలోంచి సన్ననిసంగీతం పుట్టుకొచ్చింది. ఆయన దగ్గరకు రావడం కూడా గమనించను. ఏమిటి నీలో నీవ్వే అలాపరవశించి పోతున్నావ్? మాతో కొంచం చెప్పకూడదా? వారిని చూస్తుంటే మొదటిసారిగా 'నేను' అనేది వేరే లేదనే భావం కలిగింది. ఇంక ఆయన దగ్గిర దాచడందేనికి? అన్నయ్య ఉత్తరమూ నాజవాబూ కూడా ఆయన చేతిలో పెట్టేను. అతి శ్రద్ధగా రెండూ చదివారు. ఆయన కళ్లలో అనేక భావాలు మారడం స్పష్టంగా చూశాను. 'నిజంగా మీ అభిరుచులు మెచ్చుకోతగినవే ఎల్లకాలం ఇలా నిలవాలిగాని!' అని వెళ్లిపోయారు.

* * *

ఎం.ఏ. ప్రీవియస్‌లో వచ్చిన మార్కులిష్టు మురిపెంగా చూసుకున్నాను. మొత్తం మీటడెబ్బై

# సంపెంగలూ సన్నజాజులూ

తొమ్మిది వచ్చాయి ఒక్కమార్కు కలుపుకుంటే సరిగా డెభ్భై అయిదుశాతం అన్నమాట అది బి హెచ్ యు రూల్సుప్రకారం సెకండు క్లాసు. లిటరేచరులో ఆమాత్రం మార్కులు రావడం కూడా కష్టమే అంటారు. ఏమో ఈ పరీక్షా విధా నాన్ని బట్టి, మార్కుల్ని వేసే పద్ధతుల్ని బట్టి మన జ్ఞానపరిమితినీ భాషలోమనకు గల ప్రవేశాన్ని నిర్ణయించుకోవడం అంత తెలివైన పనిలా నామట్టు కు నాకు కనిపించలేదు మనకు ఉన్న పాండితీ ప్రకర్షకాక పరీక్ష వ్యవధిలో మనకు గల తెలివి తేటలన్నీ నేర్పుగా కాగితం మీద ప్రదర్శించ గలిగామా లేదా, దాని విలువే ఎక్కువ. అటువైన కలిసివస్తే అదృష్టం, వెనుకబడితే వేదాంతమూ మనల్ని రక్షించడానికప్పుడూ సిద్ధంగానే ఉన్నాయి.

మొదటి సంవత్సరం పరీక్షలో నన్నెక్కువగా అలరించింది షేక్స్పియరు పేపరు. ఇదివరకు నేను విశ్వకవి నాటకాలు చదవక పోలేదుగాని ఇంత క్షుణ్ణంగా, వివరంగా విమర్శలతో సహా చదవలేదు. అందులో హేమ్లెట్ చదువుతూంటే నిజంగా నామతి పోయింది.

మేము మొదటేడు బెనారెస్ నుంచి వచ్చినప్పుడే స్టూడెంట్సు బుక్‌డిపోలో రెండవ ఏటికి కావలసిన పాఠ్యపుస్తకాలూ గైడ్సూ ఏరి కొనుక్కుని తెచ్చు కున్నాను. ఏరి అని ఎందుకు చెబుతున్నానంటే అక్కడ పుస్తకాలషాపువాళ్ల క్రయవిక్రయాలు వాళ్లకీ స్టూడెంట్సుకీ కూడా చాలా ఉపయోగ కరంగా ఉంటాయి.

తక్కువ ధరలకి పాతపుస్తకాలు కొంటారు, అమ్ముతారు. ఆఖరికి కొన్నిగంటలసేపు మనకి కావలసిన పుస్తకం పరిశీలించి చూసి ఇచ్చెయ్య డానికి కూడా ఉన్న ఏర్పాట్లు చూసి నేను ఆశ్చర్య పోయాను. మనవైపు పెద్దపెద్ద ఖరీదుగల రిఫరెన్సు బుక్కు సాధారణంగా తెప్పించరు.




తెప్పించినా వెయ్యిపేజీల పుస్తకంలో పదిపేజీల సారాంశంకోసం పాఠకులు తక్కువ కాకుండా కొనుక్కోడం అనవసరం అనేక వ్యయం. ఆ ఏకాదశి తైర్థికరింపబడినా వెళ్ళించు కుంటామా అంటే అవినెలల తరబడి ప్రొఫెసర్ల యిళ్లలోనూ, వారిబంధువుల యిళ్లలోనో ఉంటాయి గాని అవసరం తీరిపోయాకేనా రిటర్న్ చేసే సభ్యతా సౌజన్యతా వారికుండవు ఈ బాధలు పడలేక కొందరు పరీక్షార్థులు ఒకటిరెండు నెలలు ముందుగానే కాశీవెళ్లిపోయి అక్కడ చదువుకుని ఏడాది చదివిన లాభం పొందుతున్నారు.

రెండవఏడు మొదటేడు కంటె కొంచెం కట్టుదిట్టంగానూ రెగ్యులర్ గానూ చదివాననుకుంటా ను మోడరన్ పోయట్సులో నోబెల్ ప్రైజు గ్రహీత టి. ఎస్. ఇలియట్‌ని అందరూ వదిలేస్తారు గాని ఆకొరకరానికొయ్య మీదే నాకెక్కడిలేని కుతూహలమూ కలిగింది. ముఖ్యంగా పార విహీనమైన నవనాగరిక ప్రపంచాన్ని చూసి అతడు వ్యక్తీకరించిన వ్యధ నన్ను కదిలించింది.

ఈసారి బెనారెస్‌కి ఆయన రాలేనన్నారు.

నేను గట్టిగా కాదూ కూడదంటే మామేనేజరు ఏమీ అనడుగాని, అస్తమానూ అతన్ని యిబ్బంది పెట్టడం నాకిష్టంలేదు. కిందటి సారే వారం రోజులని పదిహే నురోజులు ఉండిపోయామని వాళ్ల దగ్గిరా వీళ్లదగ్గిరా విసుక్కున్నాడట!

నేనేం మాటాడలేదు.

'అయినా నువ్వొక్కర్తివే అయితే ఎక్కువ కాన్సెన్ ట్రేటుచేసి చదవడానికి వీలవుతుందేమో! ఏమం టావ్?'

'సరే మీ ఇష్టం. ....'

నేను కూడా ఆయన్నెక్కువ బలవంతపెట్ట లేదు. ఎటొచ్చీ ఒక్కర్తెనీ అంతదూరం వెళ్లలేక రుక్మిణమ్మగారికి రాద్దామనుకుంటూంటే ఆవిడ దగ్గిర్నుంచే ఉత్తరం వచ్చింది. ఆవిడకీ మధ్య చాలా సుస్తీ చేసిందిట. పరీక్షకు వచ్చే ఏడాది వెళ్లాలనుకుంటోందిట. ఇంతట్లో ఆయన ఫ్రెండు ఒకాయన దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది. వాళ్ల చెల్లెలు ఆ ఏడాది హిస్టరీ ఎం. ఏ. కి వెడుతోం దిట, మీతో తీసికెళ్లమనీ. ఇలా ఎప్పటికప్పుడు ఏదోవిధంగా దైవ సహాయం లభించడం నాలో ఆస్తికతను మరింత పెంచింది ఇక మిగిలింది మా మధురిమ వ్యవహారం. ఈసారి దానికేమో క్లాసు పరీక్షలవడంచేత మునపట్లా పదిన దగ్గిర దిగపెట్టడానికి వీల్లేకపోయింది. ఆయన కామే శ్వరిని పిలిపిస్తానన్నారు. 'ఆవిడ అల్లరి మనిషని తెలిసి కూడా ఎందుకు చెప్పండి?' అన్నాను నేను. 'పోనిద్దూ ఏదో సాయంగా ఉంటుంది, లదిగాక అది ఇందుకని పని గట్టుకుని మెడ్రాసునుంచేం రావక్కర్లేదు. విజయనగరంలో ఉందిట. ఈ పది రోజులూ ఇక్కడుంటుంది. ఏదో ఆడసాయం'. 'సరే మీ ఇష్టం' అన్నాను. సరళ ఈ విషయంలో కొంత సాయం చేసునుగాని ఆ అమ్మాయి అప్పుడు వూళ్లో లేదు వాళ్లనాన్నగారికి జబ్బుగా ఉంటే ఆ వూరు వెళ్లిందిట.

(సశేషం)

## 12-2-1965 శుక్రవారం మొదలు 18-2-1965 గురువారం వరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఈవారం ఫలించగల సూచనలు ఉన్నాయి. ఇంతవరకు వ్యాపారంలో మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావడంవలన మానసికంగా ప్రశాంతత లభిస్తుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ఊహించినంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. వారాంతంలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి బంధువులకు సహాయం చేస్తారు. ప్రయాణాలు చేయగల సూచనలు ఉన్నాయి.

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈవారం మీరు ఆర్థికంగా ఘన విజయాన్ని సాధించలేకపోయినా, వ్యాపారంలో ముఖ్ముందు మీకు యోగించగల మార్పులు రాగల సూచనలు ఉన్నాయి భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కొంతమంది మిత్రులకు సహాయం చేయడంవలన మీరే వ్యయ ప్రయాసలకు గురి కావచ్చును. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీతో సహకరించడానికి ముందుకు వస్తారుగాని అందరినీ విశ్వసించడం మంచిది కాదు ఉద్యోగంలో కార్యభారం పెరిగినా, మీ శక్తి సామర్థ్యాలు అధికారులచేత గుర్తింపబడతాయి సాంఘిక కార్యక్రమాల్లో నూతన గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు- ఆరోగ్యం అంత బాగా ఉండకపోవచ్చును. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అనుకూలమైన వార్తలను వింటారు.

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.

ఈ వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాలు అంత బాగా ఉండవుకాని రాను రాను అన్ని విధాలా అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి ఇది సమయం కాదు. వ్యాపారంలో నూతనావకాశాలు లాభించకపోయినా, ఇప్పటి వ్యవహారాల్లోనే ఆదాయం పెరగవచ్చును. వృత్తిలో ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగల సూచనలు ఉన్నాయి ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయికాని మీరు కొన్ని మొగమాటాలకు లొంగిపోవడంవలన ఇబ్బందులకు గురి కావచ్చును. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల ఒత్తిడి అధికం కావచ్చును.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | రా | చం |
| శ | వారఫలం మహేష్ | | |
| ర బు శు | | | |
| | కే | | కు |

స్త్రీలకు--సాంఘిక కార్యక్రమాలు బాగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంటారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈవారం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు కొన్ని వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించినా మరికొన్ని వ్యవహారాలు ఆకస్మికంగా చిక్కులకు గురి కావడంవలన మీరు అనుకున్నంగా ఈవారం సాధించినది ఏమీ ఉండకపోవచ్చును నూతన వ్యవహారాల్లో ప్రయోజనం కంటే ప్రయాస అధికంగా ఉంటుంది వృత్తిలో పోటీదారులతో పోటీ పెరగవచ్చును. ఉద్యోగంలో ఇతరులు చేసిన పొరపాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. స్థిరాస్తి వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఉన్నత విద్యార్థులు ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా ఉండడం అవసరం

స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు నిరాటంకంగా నెరవేరతాయి నూతన విషయాలను తెలుసుకొంటారు ఉద్యోగినులకు మంచి సమయం.

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈవారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతాయి అధికారులవలన జరుగు వ్యవహారాలు ఆలస్యం కావడంవలన వ్యాపారంలో మీరు పొందవలసినంత ప్రయోజనాన్ని పొందలేకపోవచ్చును. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆదాయం బాగానేఉన్నా, రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభించగలవు కోర్టు వ్యవహారాలు అంత బాగా ఉండవు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. శుభాలవసూలంగా ధన వ్యయం జరుగుతుంది.

**ఈవారం ధరలు**

అపరాల ధరలు నిలకడగా ఉండి కొంచెం పెరుగుతాయి. బెల్లం ధర కూడా పెరుగుతుంది. నూనె నువ్వుల ధరల్లో ఒడుదుడుకులు వచ్చి కొంచెం తగ్గవచ్చును. పసుపు ధర పెరుగుతుంది. చింతపండు ధర తగ్గే సూచనలు ఉన్నాయి.

**కన్య :**

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఇంతవరకు మీకు వృత్తి వ్యాపారాల్లో అన్నివిధాలా సహకరిస్తున్నవారే మిమ్మల్ని వ్యతిరేకించడంవల్ల మీవారెవరో పైవారెవరో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలి వేయడం మంచిది. వృత్తిలో మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో ఆందోళన కలిగించే పరిణామాలు ఏర్పడవచ్చును ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటికంటే బాగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో అనుమానాలమైన మార్పులు రావచ్చును మీ ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు.

స్త్రీలకు ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**తులా :**

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

వృత్తి వ్యాపారాల్లో కొన్ని వ్యవహారాలు మీ అనువులకు అనుకోని పరిణామాలకు లోను కావడంవలన మీరు కలయో, వైష్ణవ మాయయో అనే భ్రాంతిని పొందగల పరిస్థితి ఏర్పడుతుంది భారీ ఎత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో కొంచెం శ్రమమీద యథాతథ పరిస్థితిని కాపాడుకొంటారు. ఉద్యోగంలో ముఖ్ముందు మీకు ఉపయోగించగల పరిచయాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. కాని భవిష్యత్తుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిదికాదు రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు- ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :**

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈవారం గతవారం కంటే అనుకూలంగా ఉంటుంది. వ్యాపారంలో మీరు ఇదివరకు ఎంత ప్రయత్నించినా, నెరవేరని వ్యవహారాలు కూడా వారాంతంలో ఫలించగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో వారం

ప్రారంభంలో చికాకులు వచ్చి క్రమంగా సర్దుకొంటాయి. వృత్తిలో నూతన విషయాలను తెల్సుకొంటారు. ఉద్యోగంలో పోటీవారితో భేదాభిప్రాయాలు రావచ్చునుగాని అధికారులు మీపట్ల ఆదరాభిమానాలను చూపిస్తారు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ నాయకులకు కంట్రాక్టర్లకు యోగవంతమైన సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువులతో మాట పట్టింపులు రావచ్చును. దైవకార్యాలు నెరవేరతాయి.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈవారం అన్ని విధాల ప్రోత్సాహకరంగా వున్నా, వారం మధ్యలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలకంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. అధికారులవలన జరుగవలసిన పనులు మాత్రం కొంచెం ఆలస్యం కావచ్చును. వృత్తిలో మీ కార్యక్రమాలు చురుకుగా సాగడంవలన ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబసంతోషం లభిస్తుంది. బంధువుల వ్యవహారాల్లో చికాకులు రావచ్చును. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా కొంచెం బలహీనత కన్పిస్తుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలువైన వస్తువులు కొంటారు.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈవారం చిత్రంగా ఉంటుంది. ఇతరుల కోసం మీరు ఏ ప్రయత్నం చేసినా నిరాటంకంగా నెరవేరుతుంది గాని మీ స్వంత వ్యవహారాల్లో మాత్రం వ్యయ ప్రయాసలకు గురి కాగల సూచనలు ఉన్నాయి. రావలసిన డబ్బు సమయానికి అందక పోవడంవలన లాభం రావలసిన వ్యవహారాలను కూడా చూస్తూ వదలివేయవలసి వస్తుంది. వృత్తిలో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు ఉద్యోగంలో మెప్పుకొరాని ప్రయాసను పొందవలసి ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం మంచిదికాదు. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావచ్చును. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధు మిత్రులను కల్సుకొంటారు.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3పా)

ఈవారం గతవారంకంటే కొంచెం బాగా ఉన్నా విశేషమైన ఫలితాన్ని ఆశించడానికి అవకాశంలేదు. వ్యాపారంలో సామాన్యమైన వ్యవహారాలకు కూడా ఎంతో ప్రయత్నం చేయవలసి వుంటుంది. వ్యాపారంలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయుగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. కాబట్టి జాగ్రత్తగా ఉండడం మంచిది. ఉద్యోగంలో అనుకూలమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో బాధ్యత పెరుగుతుంది. అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—ఈవారం అంత బాగా ఉండక పోవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

## మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)

ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లో చికాకులు ఏర్పడడంవలన మీరు తాత్కాలికంగా నిరాశ నిస్పృహలకు లోను కాగల సూచనలు ఉన్నాయి. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో ప్రయాసకు తగిన ప్రయోజనం ఉండదు. మీరు ఎంత జాగ్రత్తగా ఉన్నా, [illegible] వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడంవలన [illegible] ఒత్తిడి రావచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి చురుకుగా సాగదు. కోర్టు వ్యవహారాల్లో వ్యతిరేక వాతావరణం ఏర్పడుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడవచ్చును

# జన్మదినఫలం

## ఫిబ్రవరి-12

ఈ సంవత్సరం మీ జీవితంలో చాలా ముఖ్యమైనది కావచ్చును. ఇప్పుడు జరిగే సంఘటనలు మీ జీవిత మార్గాన్నే మార్చివేసే టంత బలం కలిగినవై ఉండవచ్చును. వృత్తి వ్యాపారాల్లో కేవలం అధికాదాయమే కాకుండా మీ కార్యక్రమాలవలన భవిష్యజ్జీవితానికి సుస్థిరమైన ప్రతిపాదిక ఏర్పడుతుంది. వ్యాపారంలో ఇతరుల సహాయవల్ల మీరు ఇబ్బంది పడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది వృత్తిలో మీరు ఇదివరకు నిరాశ చెందిన వ్యవహారాలు కూడా ఇప్పుడు ఫలించగల సూచనలు ఉన్నాయి రాజకీయ వ్యవహారాల్లో బాధ్యతతో కూడిన పదవిని నిర్వహిస్తారు. ఆరోగ్యం సంతృప్తికరంగానే ఉంటుంది కాని అప్పుడప్పుడు మానసికాందోళన కలగవచ్చును. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి తీర్థ యాత్రలు చేస్తారు విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## ఫిబ్రవరి-13

ఆర్థిక వ్యవహారాలు గత సంవత్సరంలోకంటే బాగా ఉన్నా వృత్తి వ్యాపారాలు మీరు అనుకొన్నట్లుగా జరగకపోవడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో కొంత శ్రమమీద అనుకూలతను సాధించగలరు వ్యాపార విస్తరణ ప్రయత్నాలు మీరు మొదట ఊహించినంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును. వృత్తిలో కొత్తవారితో పోటీ పెరగవచ్చును ఉద్యోగంలో మాటల్లో అనుకూలత ఉంటుందిగాని చెప్పతగిన మేలు ఏమీ జరగగల సూచనలు లేవు సాహిత్య కళా రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కావచ్చును. పారిశ్రామికవేత్తలకు మంచి సమయం.

## ఫిబ్రవరి-14

వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు కొద్ది చికాకులు ఏర్పడవచ్చునుగాని మీ సామర్థ్యానికి, మిత్రుల సహకారం కూడా తోడు కావడంవలన ఈ సంవత్సరం తగిన అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఏర్పడుతుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో ముఖ్యంగా మీకు బాగా ఉపయోగించగల సంఘటనలు జరుగుతాయి వృత్తిలో ఎంతో ప్రయాసలుచేసి కార్యసాధన చేయుగలరు ఉద్యోగంలో మీరు ఇంతకాలంగా ప్రయత్నం చేస్తున్న మార్పులు రాగల సూచనలు ఉన్నాయి ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించవచ్చును. రావలసిన డబ్బు సమయానికి అందక అప్పుడప్పుడు కొంత ఇబ్బంది కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా సాధించవచ్చును ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు సులభంగా కృతార్థులు కావచ్చును.

## ఫిబ్రవరి-15

ఈ సంవత్సరం అన్ని విధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాలను గురించి మీరు ఇంతవరకు చేస్తున్న ఆలోచనలు ఇప్పుడు ఫలించగల సూచనలు ఉన్నాయి ఇంతకు ముందు వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన [illegible] సంవత్సరం మధ్యలో అనుకూలించడంవలన వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగడానికి అవకాశం ఏర్పడుతుంది భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల కంటే మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో ఆదాయంతోపాటు ఖర్చులు కూడా పెరుగుతాయి ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉన్నా భవిష్యత్తుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిదికాదు. ఆరోగ్యం బాగా ఉంటుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును.

## ఫిబ్రవరి-16

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతాయి. కొంతమంది మిత్రుల ప్రోద్బలంవల్ల నూతన వ్యాపారాలు చేయగల సూచనలు ఉన్నాయి. కాని దానివల్ల మీకు మిగిలేది ఏమీ ఉండక పోవచ్చును వ్యాపారంలో అప్పుడప్పుడు కార్యసాధనకోసం మీకు అంతగా ఇష్టంకాని వ్యక్తులతో సన్నిహితంగా వ్యవహరించవలసి ఉంటుంది. వృత్తిలో కొంత శ్రమ కలిగినా, తగిన ప్రయోజనాన్ని పొందగలరు ఉద్యోగంలో స్థాన చలనం కలగవచ్చును. కోర్టు వ్యవహారాల్లో ఇంతవరకు మీకు ఆందోళన కలిగిస్తున్న వ్యవహారాలు అనుకూలంగా పరిష్కారం కావచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## ఫిబ్రవరి-17

వృత్తి వ్యాపారాలు సంవత్సరం ప్రారంభంలో కొంతవరకు ప్రోత్సాహకరంగాఉన్నా సంవత్సరాంతంలో అకస్మికం చికాకులు ఏర్పడడంవలన ఈ సంవత్సరం మీరు సాధించిన అభివృద్ధి ఏమీ ఉండక పోవచ్చును వ్యాపారంలో మీ మనుష్యులే మిమ్మల్ని మోసంచేసే ప్రమాదం ఉంది. వృత్తిలో సామాన్య వ్యవహారలకు కూడా వ్యయ ప్రయాసలకు గురి కావలసిన పరిస్థితి ఏర్పడుతుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు మాత్రం కొంచెం బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తల ఎత్తవచ్చును ఉద్యోగంలో మీకు మేలు జరిగే సమయంలో ఏవో ఆటంకాలు రాగల సూచనలు ఉన్నాయి ఆరోగ్యం అంత బాగా ఉండదు కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. విద్యార్థులు మొదటనుంచి శ్రద్ధగా చదవడం మంచిది.

## ఫిబ్రవరి-18

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాలు అనుకూలంగానే ఉన్నా కొంతమంది మిత్రులతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో కొన్ని చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని మీ చాకచక్యంవలన వాటిని అధిగమించడమే కాకుండా తగిన అభివృద్ధిని సాధించగలరు. వృత్తిలో నూతనావకాశాలు లభించడంవలన ఆదాయం పెరుగుతుంది. అధికారులవలన జరగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరతాయి ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగానే ఉంటుంది కాని విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి అవకాశం లేదు. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారానికి కొంత డబ్బు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుతగదు. కుటుంబ వ్యవహారలు బాగా ఉంటాయి సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. ★




# అప్పిచ్చువాడు

కలువకొలను సదానంద

"అప్పిచ్చువాడు......

.....చొప్పడిన పూరవుండుము" అన్నాడు సుమతీ శతకకారుడు.

ఎప్పుడు ఎడతెగకపారు ఏళ్ళు అన్ని వూళ్ళల్లోనూ ఉండవు. బహుశా సుమతీ శతకకర్త పై సూక్తిని నిర్వచించిన కాలంలో అప్పిచ్చువాడు ఎప్పుడు ఎడతెగకపారు ఏరు వంటివాడై ఉంటాడు కాబోలు.

కాని నేటి సంగతి వేరు. ఉన్న ఏళ్ళన్నీ ఎక్కడి కక్కడ ఎండిపోవడం, అప్పిచ్చేవాళ్ళు ఎక్కడబడితే అక్కడ లభ్యం కావడం వర్తమాన యుగ విశేషం. ఓ మానవుడా! నీవు ఏ వీలునుబట్టి ఎప్పుడో ఒకప్పుడు ఎవరికో ఒకరికి—ఎంతో కొంత అప్పు ఇచ్చే ఉంటావు. ఇది పరమ సత్యం. కనుక అప్పిచ్చువాడొక సౌకర్య సాధనమని భావించేవాడికి ఏ వూళ్ళో ఉండడానికైనా వెనుకాడవలసిన ప్రమేయంలేదు.

ఋణదాతయొక్క ప్రయోజనాన్ని పొందజాలని వాడెవడైనావుంటే — వాడు ఏ నిర్జనారణ్యంలోనో ముక్కు మూసుకుని కూర్చున్న ఏకాంతరామయ్య ఒక్కడే!..... కాని సన్యాసిరావు అట్టి నిర్జనారణ్య ప్రాంతైకాంతవాసికాడు. దాదాపు పదారువేల జనాభా కల్గిన వూళ్ళో పుట్టి, పెరిగి ఆ వూళ్ళోనే జీవనం చేస్తూ ఉన్నవాడు. విచిత్రమేమిటంటే— అట్టివాడు తనకు అప్పిచ్చువాడెవడా అని ఆ పదారువేలమంది ముఖాలకేసి తేరిపారజూడసాగాడు.

అర్థికావసరాలు రాళ్ళవంటివైతే— మానవుని మస్తిష్కం నిశ్చల జలాశయంవంటిది. అటువంటి రాయి ఒకటి ఎక్కడినుండో రివ్వున వచ్చి సన్యాసిరావు మస్తిష్కతటాకంలోని నిశ్చలతను కలచివేసింది. ...ఒకటి రెండు రోజుల వ్యవధిలోనే అతనికి కొంత డబ్బు కావాలి. అతని దృష్టిలో అది పెద్ద మొత్తమే. అయితేనేం? అప్పు ఇవ్వ

గలవాడు అతన్ని శంకించేందుకు అవకాశంలేదు. అతడు గుణశేఖరుడేకాని, ఋణశేఖరుడేమీకాడు. అయితే—సంశయము అనే భావానికి ఆశ్రయ మిచ్చినది సన్యాసిరావు మనస్సే.

సన్యాసిరావు సామాన్యుడే అయినా, అతని వేతనం సామాన్యమైనదే అయినా, ఉన్నంతలో సంసారాన్ని గుట్టుగా గడుపుకుంటున్న జాగరూకు డతడు. ఒకనెల పది రూపాయలు మిగలడం, మరునెలలోనే ఏదో ఒక అవసరం అవతరించి ఆ పది రూపాయల వెన్నెలకుప్పను ఊడిచిపెట్టి పోవడం అనే రెండేత్తు గడల వెన్నెల కుప్పలాటగా ఇంతవరకూ అతని బ్రతుకు గడిచింది. అతని జీవన తులాదండం ఋణ భారంతో వాలిపోయే ప్రమాదం అదృష్టవశాత్తూ కలుగలేదు. తత్కార ణంగా మనుషులకు తాను ఋణార్థిగా మాత్రం అపరిచితుడుగా ఉండిపోయాడు.

ఇదే తనకు మొదటి అనుభవం కావడంతో ఋణసిద్ధిని గూర్చిన ఆశా నిరాశలు అతనిలో పందెపు కోళ్లకుమల్లే ఒక దానిపై కొకటి కుప్పించ సాగాయి.

అప్పు ఎవర్ని అడగాలి?.....ఇదీ ప్రశ్న.

అడుగగానే లేదనకుండా తనకు కావలసిన మొత్తాన్ని ఇచ్చేవాణ్ణి అడగాలి! ... ఇది జవాబు.

ఎవడు వాడు?. ...జవాబు తెలియని ప్రశ్న.

ఆనాడు పోస్టుమేన్ దర్శనం అయినప్పటి నుంచి నాటిరాత్రి నడిజామువరకు ఆలోచించగా ఆలోచించగా చిట్టచివరికి క్రాస్‌వర్డ్సు పజిల్ వంటి జవాబొకటి దొరికింది. ఆ జవాబు— ముకుందం!

కృషీవలుడు ఎండిపోయిన తన పొలంలో నిల ఒడి మింటిలోని మొయిలుకేసి ఆశతో చూస్తాడు. ఆ వర్షామేఘం అతని పొలంమీద వర్షిస్తే వర్షించ వచ్చు; వర్షించకనే కదలిపోవచ్చు. ఏమైతేనేమి— కృషీవలునికి చేయూత నివ్వగల శక్తి దానికి ఉన్నది. ఆ జలధరం వంటివాడు ముకుందం. వూరిలోవున్న కొద్దిమంది లక్షాధికారుల్లో అత డొకడు. వూరికి నాలుగు దిక్కుల వచ్చని పొలాల పడుమ నాలుగు పంపుసెట్లు, గుట్టక్రింద పదెక రాల మామిడితోపు, వూరిలో చిన్న చిన్న గదు లలో క్రిక్కిరిసి కందిరీగల తుట్టెల్లావున్న రెండం తస్తుల భవంతులు మూడు, బజారులో బెల్లపు మండీ, అనువైనచోట బియ్యపుమిల్లు, పిల్లనిచ్చిన మామగారు వగైరాలన్నీ అతని పాలిటికి అల్లాఉద్దీన్‌మార్కు అద్భుత దీపాలు.

ఒక్కొక్క రోజుకు ఒక్కొక్క పద్ధతిలో సాక్షాత్కరించే దుస్తులు, రెండు వ్రేళ్ళకు రెండు రాళ్ళ ఉంగరాలు, బంగారు గొలుసుతో విలువైన చేతి గడియారం, నాణ్యతకు సమానాలనిపించే పాదరక్షలు, ఎటువంటి అందగాడి ముఖంమీదనైనా సరే నిలచి, చూపరుల దృష్టిని ముమ్ముందుగా తన వైపుకు ఆకర్షించగలిగే చలువ అద్దాలు— ఇవన్నీ మకుటంలేని మహారాజువంటివాడైన ముకుందానికి వందిమాగధులవంటి సాధనాలు.

సన్యాసిరావు ముకుందాన్ని ఎన్నుకోవటానికి— అతని కలిమి ఒక్కటే కారణంకాదు. తాను అత నికి సుపరిచితుడు, బాల్యమిత్రుడు, సహాధ్యాయి.

కనుక అతడు తనకు ఈ తక్షణ సహాయాన్ని చేయగలడు.

తెల్లవారింది.

తొమ్మిది గంటలకు ఇంటి గడప దాటుకో బోతుండగా వెనుకనుంచి "ఏమండోయ్?" అంది అతని అర్థాంగి— దమయంతి. సన్యాసిరావు ఆగాడు.

"రేపు బుధవారం. ఎల్లుండి గురువారం ఆ మరునాడే శుక్రవారం" అంది ఆమె.

"సరే" అంటూ సన్యాసిరావు గడపదాటు కువేశాడు.

ముకుందం ఇంట్లోలేడు. మండీ దగ్గరికి వెళ్ళాడు సన్యాసిరావు. రూపాయల్ని ఎంచుతూ కూర్చుని ఉన్నాడు ముకుందం తండ్రి. "...... నలభై ఆరు, నలభై యేడు, నలభై ఎనిమిది, ముకుం దమా? ..... నలభై ఎనిమిది, నలభై తొమ్మిది, మిల్లులో ఉంటాడు, ఏభై....."

.....ఆతరువాత సన్యాసిరావు ఆలకించలేదు. బియ్యపు మిల్లులో ముకుందాన్ని తిలకించినాడు. నిశ్శబ్దంగా కుడిచేయి పైకెత్తి పాశ్చాత్య పద్ధ తిలో అభివందనసమాచరించాడు. మిల్లులో ముకుందం కూర్చున్న మూలగదిలో గోడమీద మహావిష్ణువు కేలెండరు వేలాడుతోంది. శంఖము, చక్రము, గద, పద్మము మొదలైన హంగులతో అలరారుతూ ఉన్నాడు మహావిష్ణువు. తెల్లటి పైజామామీద సిల్కు లాల్చీ తొడుక్కున్న ముకుందం కూడ ఎప్పటిలాగునే తన నిత్యాభరణా లను ధరించినవాడై ఉన్నాడు.

"ఏం సన్యాసీ? ఇలా వచ్చావు?" అని అడి గాడు ముకుందం దగ్గరగా.

మిల్లు రణగొణ ధ్వనిలో తన ఋణ గుణ ధ్వని స్పష్టంగా వినబడదేమోనని భావించిన సన్యాసిరావు జంకు గొంకులతో పళ్ళికిలిస్తూ—"కొంచెం మాట్లాడాలి" అన్నాడు.

ముకుందం లేచాడు. మిల్లు బయటికి నడి చాడు. సన్యాసిరావు అనుసరించాడు. ఇద్దరూ గేటు దగ్గర ఆగారు.

"ఏం సన్యాసీ?"

మేరుపర్వతంవంటి ముకుందం ముందునిల బడిన సన్యాసిరావుకు తన అల్పత్వం బెల్జియం అద్దంలో ప్రతిబింబంలా స్పష్టంగా కనిపించింది. "మరేంలేదు ముకుందం ఒక యాభై రూపా యలు కావాలి ......మళ్ళీ ఇచ్చేస్తాను" అన్నాడు దీనాతిదీనంగా.

"ఏభై యా?......ఇప్పుడు నా దగ్గరలేదే .... ఎప్పుడు కావాలి?......"

"ఒక పెళ్ళికి వెళ్ళవలసి వుంది ముకుందం! శుక్ర వారం ఉదయం ముహూర్తం. చాల దగ్గరి చుట్ట రికం కావటంచేత, తప్పనిసరిగా వెళ్ళాలి. సకుటుం బంగా గురువారం బయలుదేరాలని అనుకుంటు న్నాను" అన్నాడు సన్యాసిరావు.

ముకుందం ఐదు సెకన్లు ఆలోచించాడు. "తిరిగి ఎప్పుడిస్తావు?"

మరో అంచు సెకన్ల కాలంలో సన్యాసిరావు ఆలోచించడం, సమాధానమివ్వడం జరిగిపోయాయి. "జీతం రాగానే ఇస్తాను. ఒకటో తారీఖున మాకు జీతాలు."

"వెంకటేశం వంద రూపాయలివ్వాలి. ఈ రోజు ఇస్తానన్నాడు. తీసిపెడతాను సన్యాసీ సాయం కాలం ఒకసారి కనిపించు" అన్నాడు ముకుందం.

సన్యాసిరావు సంధ్యాగమనంకోసం ఎదురు చూడ సాగాడు. ముకుందం తనకు డబ్బిస్తాడు. ఆ బాకీ తాను ఎప్పుడు చెల్లించాలి? ఒకటో తారీఖున ... చెల్లించగలడా తాను? చెల్లించవచ్చు .... లేదా— వెనువెంటనే మరెవరినైనా నలభై రూపాయ లైనా బాకీ అడగవలసిన అవసరం కూడా ఉంది. ఈ పద్ధతి ప్రతినెల చర్విత చర్వణం కావడం తథ్యం. మధ్యలో మరే అర్థికావసరమూ వచ్చి పడకుంటే—నాలుగైదు నెలల్లోనే ఈ ఋణ భారాన్ని దింపుకోవచ్చు. అయితే—విధి ఏమన్న రానివాడు.

..... తలలో మెదిలిన ఈ ఆలోచనలను సన్యాసి రావు బలవంతంగా ఒడుపుకు నెట్టివేశాడు ఇప్పటి ఈ అవసరం గడిచిపోతే తరువాతి సంగతులు ఆ తరువాతనే ఆలోచించుకోవచ్చు.

సాయంకాలమైంది. కనిపించిన సన్యాసితో ముకుందం ఇలా అన్నాడు. "వెంకటేశం కనిపించ లేదు సన్యాసీ! నీ అదృష్టమేమోగానీ, నా దగ్గర డబ్బులేకపోవడం ఎప్పుడూ జరుగలేదు. సరే ఉదయంరా!"

నిరాశ ఆవరించిన హృదయంతో సన్యాసిరావు ఆ రాత్రి గడిపాడు. తెల్లవారింది. ఆది బుధవారం సన్యాసిరావు మిల్లు దగ్గరికి వెళ్ళాడు. మండీ దగ్గరికి వెళ్ళాడు. అతని ఇంటికే వెళ్ళాడు. ముకుందం జాడ కానరాలేదు. మూడు నాలుగు పర్యాయాలు ఈవిధంగా సిటీ బస్సులా తిరిగే సరికి—ముకుందం మిల్లులోనే దొరికాడు. ఆ రోజు పంట్లాము, టెర్లిన్ స్లాక్ తొడుక్కు న్నాడు.

"కాస్సేపుండు సన్యాసీ! నిన్న నువ్వు ఇటు వెళ్ళగానే వెంకటేశానికి కబురు పంపాను ఇప్పుడు తెచ్చిస్తానన్నాడు. ఒరే సూరీ వెంకటేశం దగ్గరికి వెళ్ళిరా."

మిల్లులో పనిచేసే కుర్రవాడు వెంకటేశం ఇంటికివెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు. "సాయంత్రం ఇస్తానన్నాడు బాబూ....."

సన్యాసిరావు మళ్ళీ సాయంకాలం వెళ్ళాడు. సూరి వెంకటేశం ఇంటికివెళ్ళి వచ్చాడు. "ఉదయానే వస్తాట్ట, నన్ను వెళ్ళమన్నాడు బాబూ....." అన్నాడు.

గంట అరైంది. ఏడైంది. వెంకటేశం రాలేదు. అతనికోసం మళ్ళీ సూరిగాణ్ణి పంపాడు ముకుందం. సూరిగాడు వెళ్ళి వచ్చి, "ఆయన ఇంట్లోలేడు బాబూ!" అన్నాడు. ఏడున్నరకు మళ్ళీ ఒకసారి వెళ్ళివచ్చి అదే వార్త తెచ్చాడు. ఎనిమిది గంట లకు మరొకమారు వెళ్ళి వచ్చి, "ఉదయం ఎని మిది గంటలకల్లా తప్పకుండా వచ్చి ఇస్తాట్ట!" అన్నాడు.

"డామిట్!" అన్నాడు ముకుందం.

వెంకటేశం 'డామిట్' కావడానికి తాను కారకు డౌతున్నాడేమోనని మథనపడ్డాడు సన్యాసిరావు.

గురువారం ఉదయం తొమ్మిది గంటలకు

# అప్పిచ్చువాడ

ఆక్రోశంతో మిల్లు దగ్గరికి వెళ్ళాడు. ముకుందం మల్లు ధోవతి కట్టుకున్నాడు. పొడుగు చేతులు చొక్కా తొడుక్కున్నాడు. మీద కండువా వేసుకున్నాడు. సన్యాసిని చూచి కూర్చోమన్నాడు. అతని గాంభీర్యాన్ని చూచి సన్యాసి పలికే ధైర్యాన్ని కూడా కోల్పోయి మౌనంగా కూర్చున్నాడు.

"ఒరే సూరీ! వెంకటేశం దగ్గరికి వెళ్ళిరా!"

సూరిగాడు వెళ్ళివచ్చేడు. "మధ్యాహ్నం వచ్చి ఇస్తానన్నాడు బాబూ!"

"ఒకసారి ఇలా రమ్మన్నానని చెప్పు!" అన్నాడు ముకుందం. "నువ్వు ఎప్పుడు వెళ్ళాలి సన్యాసీ?"

"రాత్రి ఎనిమిది గంటలకు చివరి రైలు" అన్నాడు సన్యాసి.

సూరిగాడు తిరిగివచ్చాడు. "ఎవరో డబ్బిస్తానన్నారట— బాబూ! తీసుకుని అయిదు నిమిషాల్లో వచ్చేస్తానన్నాడు"

"వెంటనే రమ్మంటున్నానని చెప్పి పిలుచుకురా! వెళ్ళు! ఇంట్లో లేకుంటే—ఎక్కడున్నాడో వెతికి వెంట బెట్టుకునిరా!" అంటూ గద్దించాడు ముకుందం.

మరో అరగంటకు మృగరాజు చెంతకు తరలి వచ్చే అల్ప జంతువులా అల్లంత దూరంలో వెంకటేశం కనిపించాడు. వెనుకనే సూరిగాడున్నాడు.

ముకుందం వీధిలోకివచ్చి నిలబడ్డాడు. వెంకటేశం సమీపించాడు. ఇంకా పదడుగుల దూరం ఉండగానే ప్రార్థనా పూర్వకమైన స్వరంతో "డబ్బు సమకూరలేదు ముకుందం! ఏ బాధలైనా పడి నీ డబ్బు నీకు . " వెంకటేశం మాట అంతటితో ఆగిపోయింది. ముకుందం కండువా వెంకటేశం మెడమీదికి విసిరి, ఎడమ చేతితో గట్టిగా లాగి పట్టుకున్నాడు "ఆ మాటలన్నీ తరవాత. ముందు డబ్బు అక్కడ పెట్టు."

అవాంఛనీయమైన ఈ సన్నివేశాన్ని గూర్చి ఎక్కువగా చెప్పడం తగదు గారడీవాడిచుట్టూ మూగినట్లున్న జనం నడుమ వినోద వస్తువులా నిలబడిన వెంకటేశం అవమానాతిశయంతో కంట తడిపెట్టుకున్నాడు. "తలైనా తాకట్టు పెట్టి మధ్యాహ్నానికల్లా నీ డబ్బు నీకు చెల్లించుకుంటాను" అని సంజాయిషీ చెప్పుకుని, జీవన్మృతుడిలా అక్కడినుంచి సాగి పోయాడు.

నిశ్చేష్టుడై నిలబడిపోయిన సన్యాసిరావుతో— "నువ్వు సాయంకాలంవచ్చి డబ్బు తీసుకుని వెళ్ళు సన్యాసీ!" అన్నాడు ముకుందం

సాయంకాలం ఆఫీసునుండి బయటపడిన సన్యాసిరావు ముకుందం వద్దకు వెళ్ళడానికి మారుగా పూరిబయటికి షికారు వెళ్ళాడు. అతని మనస్సున ఏదో వగాగ బాధ ఆవరించుకొన్నది. పాపం వెంకటేశం! ముకుందానికి బాల్యమిత్రుడు! అతని డొక్కువేటు! అతని నోట్సులన్నీ ఎప్పటికప్పుడు రాసి పెట్టినవాడు! ఈ యోగ్యతలేవీ కూడ ఈనాడు జరిగిన భంగపాటునుండి అతన్ని తప్పించలేకపోయాయి.

సన్యాసిరావు ఇల్లు చేరుకునేసరికి గంట ఏడైంది అప్పటికే ముస్తాబై సిద్ధంగావున్న దమయంతి అతన్ని చూచి చిటపటలాడింది. "రక్షించారు. తీరా పరిగెత్తే రైల్లోనే ఉరకమంటారేమోనను కున్నాను ఇప్పటికైనా వచ్చారు. నయమే! . మీకోసం గంటక్రితం ఎవడో కుర్రాడు వచ్చి పోయాడు ."

"ఎవరు?" అన్నాడు సన్యాసిరావు

"ఎవరో ముకుందంగారట మీరు డబ్బు అడిగారటగా? రమ్మన్నారట!....."

సన్యాసిరావు విన్నాడు. కాళ్ళు చేతులు కడుక్కున్నాడు "అన్నం వడ్డించు" అన్నాడు.

ఆమె అన్నం వడ్డించి, "వెళ్ళి వచ్చారా?" అని అడిగింది.

"లేదు."

సన్యాసిరావు భోజనం చేశాడు. "వెళ్ళి త్వరగా రండి మరి. రైలుకు వేళైంది" అంది దమయంతి

సన్యాసిరావు విధిలేక బయలుదేరాడు.

తెల్లవార ఝాము నపెండ్లి ముహూర్తం. తానూ, తన భార్య తప్పనిసరిగా వెళ్ళవలసిన పెండ్లి అది. వెళ్ళ గలిగితేనే కలిగే తృప్తి కంటే—ఈనాడు వెంకటేశానికి కలిగిన ఘోర విపత్తు తనకు కలుగబోదు అన్న సంతృప్తి ఎన్నో రెట్లు హెచ్చుగా కనిపించిం దతనికి.

ఒకగంటసేపు పురవీధుల్లో యథేచ్ఛగా సంచరించిన పిమ్మట సన్యాసిరావు గృహోన్ముఖుడయ్యాడు. రైలు ఈపాటికి వెళ్ళిపోయుంటుంది. తాను తన భార్యతో ఇప్పుడొక అబద్ధం చెప్పబోతున్నాడు. ఫరవాలేదు. ప్రాణాంకంటె మానం గొప్పది. మానరక్షణార్థం అబద్ధమాడడంలో తప్పులేదు.

అతడొకటి తలచితే దైవం మరొకటి తలచాడు. ఇంటికి సమీపించిన సన్యాసిరావు కనులకు గోచరించిన దృశ్యం ఎట్టిది? .. ఇంటిముందర ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లు ఒక కూలివాడు నిలబడి ఉన్నాడు. ఇంటి అరుగుమీద పరుపు చుట్ట, ట్రంకు, మరచెంబు వగైరాలు విడిచి ఉన్నాయి. ప్రక్కనే ఆత్రుత, విసుగు, కోపము నిండిన ముఖంతో దమయంతి నిలబడి ఉంది. ఇల్లు తాళం వేయబడిఉంది

సన్యాసిరావు రాగానే కూలివాడు సామానంతా నెత్తిమీదికి ఎత్తుకున్నాడు

"ఇదేమిటే? ఎక్కడికి? ముకుందం కనిపించలేదు ." అంటూ సన్యాసిరావు వారించబోయాడు.

దమయంతి చిచ్చుబుడ్డిలా బుస్సుమంది. "చాల్లెండి ఇక! ఎందుకు కనిపిస్తాడు మీకు? అసలు ఈ పెళ్ళికి వెళ్ళాలనుందా మీకు?.. ఆ ముకుందంగారే డబ్బు పంపించారు. ఇకనైనా స్టేషనుకు నడవండి....."

సన్యాసిరావు ఆశ్చర్యంతో మ్రాన్పడిపోయాడు. ఇక తాను గండంనుండి తప్పించుకోవడానికి ఒక్క అవకాశం మాత్రం మిగిలిఉంది. "అయితే— ఇప్పుడు గాడీ ఏదీ?. ."

"ఈ పూట రైలు రెండు గంటలు ఆలస్యం బాబూ!" అన్నాడు కూలివాడు. సన్యాసిరావు హతాశతో నిరుత్తరుడైపోయాడు చివరిక్షణంలో తప్పించుకోగలిగాననుకొన్న ముప్పు మళ్ళీ వచ్చి తలపట్టింది. జరుగవలసినది జరిగిపోయింది, తీరనిది తెలిసికొనుటతప్ప తాను ఇక చేయగలిగిందేమీలేదు. సంకల్పశూన్యుడైన సన్యాసిరావు కూలివాడి నెత్తిమీది ట్రంకు పెట్టెలా స్టేషనువైపు సాగాడు.

* * *

"అప్పిచ్చువాడు..... చొప్పడకున్నట్టి వూరు చొరకుము. ." అన్నాడు సుమతీ శతకకారుడు. మీ ఎరుకలో అటువంటి వూరేదైనా ఉంటే సన్యాసిరావుకు తెలియజేయవలసింది. సుమతీశతక కారుని మాటలు పెడచెవిని పెట్టడానికి సన్యాసిరావు సంసిద్ధుడుగా ఉన్నాడు. ★

# ఆధునిక క్రొత్త టూత్ పేస్టు




# హెక్సాక్లొరోఫిన్ చేర్చినది

దంతాల ఆరోగ్యాన్ని ఎల్లప్పుడూ కాపాడుటకు అవసరమైనది ఎపిక్. హెక్సాక్లొరోఫిన్ కలసిన ఎపిక్ టూత్ పేస్టు యొక్క నురుగ బక్టీరియా క్రిములను నాశనముచేసి పళ్లను తెల్లగా శుభ్రపరుచును. రోజంతా నోరు సువాసనగాను చల్లగాను వుంచుటకు ఎపిక్ టూత్ పేస్టు ఉపయోగించండి.

తెల్లని
ఎపిక్ టూత్ పేస్టు
పళ్లను తెల్లపర్చి
నోటి దుర్వాసన
పోగొట్టును




ఓరియంటల్ ఫార్మ ప్రైవేటు లిమిటెడ్, మద్రాసు 43

ajanta OP.E/64-2-A-TG

## వేల్పులకైనా మార్పులు తప్పవు

మహేష్

# పరమశివునిగురించి మరికొన్ని ముచ్చట్లు!

ద్రావిడదేశంలో శైవమంత అత్యంత ప్రాచీనమైనది. సంగంయుగంనాటి సాహిత్యంలో కూడా శివుడు కొనియాడబడుచున్నాడు. త్రినేత్రుడు, చంద్రధారి, నీలకంఠుడు అయిన దేవుడు ద్రావిడ దేశంలో పూజించబడుచున్నట్లు ప్రాచీన సాక్ష్యాలు ఉన్నాయి. చేరరాజా అయిన శెంగుత్తువన్ శివ విష్ణువులను పూజించినట్లు శిలప్పదికారంలో చెప్పబడింది. శివుని అష్టమూర్తిగా భావించే శైవులు ఉన్నట్లు మణిమేఖలైలో చెప్పబడింది.

కేవలం ద్రావిడ శైవవాఙ్మయంలోనే కాకుండా మొత్తం శైవ సాహిత్యంలోనే తిరుమూలర్ యొక్క తిరుమందిరం అమూల్యమైనది. ఇందులో వేదాలకు, ఆగమాలకు సమన్వయం సాధించబడింది. శుద్ధి, అశుద్ధి, మార్గ, కడుంశుద్ధ అనే నాలుగు రకాలుగా శైవ మతాన్ని తిరుమూలర్ విభజించియున్నాడు. సాధకుడు కార్య, క్రియ యోగ జ్ఞానములనే నాలుగు స్థితులను దాటవలెనని చెప్పబడింది. సాధకుడు జ్ఞానమును పొందిన తరువాత భగవత్కృపకు పాత్రుడగుచున్నాడు. ఇదియే శక్తి నిపాతమని వర్ణించబడింది. భగవంతుని యందు ఐక్యము పొందుటే సాధకుని అంతిమ లక్ష్యమని పేర్కొనబడింది.

ద్రావిడ శైవ సాహిత్యంలో ప్రమాణికమైన తేవారంలోని మొదటి మూడు పడిగములు తిరుజ్ఞాన సంబంధర్‌చేత రచింపబడినవి. శివుని వరముచేత పుట్టిన బాలుడు పార్వతీదేవి స్తన్యమును గ్రోలి జ్ఞానసంబంధర్ అయినట్లు కథలు ఉన్నాయి. మధురా నగర రాణి అయిన మంగయ్యర్కరసిచేత ప్రార్థింపబడి ఇతడు జైనులను ఓడించి రాజును శైవునిగా మార్చినాడు.

త్రిమూర్తులలో శివుడు అగ్రగణ్యుడు. శివుడు నిరాకారుడు కావడంచేత బ్రహ్మ విష్ణువులు కూడా అతనిని దర్శించలేరు. మలనిర్ముక్తుడై పంచాక్షరీ ధ్యానముచేత శివానుగ్రహమునుపొంది శివముక్తిని పొందవలెనని జ్ఞానసంబంధర్ అభిప్రాయం.

తేవారంలోని తరువాత మూడు పడిగములను రచించినవాడు అప్పర్. ఇతని మొదటి పేరు తిరునావుక్కరసు. వయోధికుడైన ఇతనిని జ్ఞానసంబంధర్ అప్పా అని పిలవడంవలన ఇతనికి అప్పర్ అనే పేరు వచ్చినది. ఇతడు జైనులను ఓడించి పల్లవరాజైన మహేంద్రుని శైవ మతములోనికి మార్చేడు. ఇతడు కేవలం శైవ సిద్ధాంతాన్నే కాకుండా ఇతర మతాల్ని కూడా అధ్యయనం చేసేడు.

ఇతడు శివుని మూడు రూపాలు కలవానిగా భావించేడు. (1) త్రిమూర్తుల్లో ఒకడై, సంహార ప్రధానుడైన శివుడు. ఇది సామాన్య రూపం. (2) శివశక్తి సంయోగమైన పరా పరమే మధ్యమ రూపం. దీనినే పరంజోతి అందురు. (3) మాహాతీతమైన జ్యోతిర్లింగ స్వరూపమే ఉత్తమ రూపం. సాంఖ్యులు చెప్పే ఇరవై అయిదు తత్వాలకు శివుడు అతీతుడు. మానసిక పూజకు ఇతడు ప్రాముఖ్యత నిచ్చేడు. బ్రాహ్మణులకు వేదమే అమూల్యాభరణంకాగా శైవులకు పంచాక్షరియే అమూల్యాభరణం అని అప్పర్ అభిప్రాయం.

తేవారంలోని ఏడవ పడిగాని రచించినవాడు సుందరమూర్తి. ఇతని వివాహ సమయంలో శివుడే స్వయముగా ప్రత్యక్షమై ఇతనికి తత్వోపదేశం చేసినట్లు కథలు ఉన్నాయి. ఇతడు శివుని సఖ భావంతో కొల్చేడు.

వేదాల్లో ఉపనిషత్తుల స్థానాన్ని, శైవ సాహిత్యంలో తిరువాచకం పొందింది. దీనిని రచించినవాడు మాణిక్యవాచకర్. ఇతడు బాల్యంలోనే సకల శాస్త్రాలను అభ్యసించి పాండ్య రాజ్యానికి ప్రధాని అయ్యేడు. ఇహ సుఖాలయందు విరక్తుడైన ఇతనికి శివుడే స్వయంగా పంచాక్షరీ తత్వమును ఉపదేశించినట్లు కథలు ఉన్నాయి. ఇతడు వాదంలో బౌద్ధులను ఓడించేడు.

శివుడే సర్వోత్కృష్టుడు. సర్వ జీవశాసకుడు, కరుణా సముద్రుడు. శివుడు కేవలం దేవాలయాల్లోనేలేడు, సర్వాంతర్యామి, సర్వ హృదయాంతర్వర్తి. శివుడే గురు రూపంలో మోక్షమార్గాన్ని ఉపదేశించుచున్నాడని మాణిక్యవాచకర్ అభిప్రాయం

పెరియ పురాణంలో అరవైమువ్వురు నయనార్ల కథలు వర్ణించబడినాయి. మొత్తంమీద ద్రావిడ శైవం భక్తికి అత్యంత ప్రాధాన్యాన్ని ఇచ్చింది. మైకండదేవ, అరళ్‌నంది శివాచార్య మొదలైనవారు ద్రావిడ శైవ మతానికి సంబంధించిన తత్వ శాస్త్రాన్ని రచించేరు.

ఇందులో స్పంద, ప్రత్యభిజ్ఞ అనే రెండు శాఖలు ఉన్నాయి. వసుగుప్తుని శివ సూత్రం స్పందమార్గానికి ఆధారమని శ్రీ భండార్కర్ అభిప్రాయం. ఈ శివ సూత్రాలను సాక్షాత్తు శివుడే వసుగుప్తునికి ప్రసాదించినట్లు కథలు ఉన్నాయి. ఈ శాఖలో శివ సూత్రాల తరువాత ప్రధానమైన స్పందకారికలను వసుగుప్తుడే రచించేడని కొందరి అభిప్రాయం. ఇతని శిష్యుడైన కల్లటుడు స్పందకారికలను రచించినట్లు మరి కొందరు అభిప్రాయపడుచున్నారు.

శివుడే సర్వ జీవాత్మ, చైతన్యుడు. పరమేశ్వరుడు, సర్వాధారుడు, అనాది, అనుత్తరుడు, విశ్వమయుడు, విశ్వోత్తీర్ణుడు, స్వతంత్రుడు, శివుడు తన ఇచ్ఛా శక్తి చేతనే ఈ విశ్వాన్ని తనయందే సృష్టించుచున్నాడు. ఈ విశ్వం శివునికంటె భిన్నంగా కన్పిస్తుందిగాని అది సత్యంకాదు. శివుడే పరమాత్మ. జీవాత్మ కూడా. జీవాత్మ తన మాలిన్యమువలన తనే పరమాత్మగా తెలిసికొనలేకపోతున్నది. ఈ మాలిన్యం (1) అణవ, (2) మాయీయ, (3) కర్మ—అని మూడు రకాలు. నిరంతర ధ్యానంచేత జీవాత్మ మాలిన్యరహితమై పరమాత్మను పొందుచున్నది.

సోమానందుడు వ్రాసిన శివదృష్టియే ప్రత్యభిజ్ఞా శాఖకు ఆధారం. సోమానందుడు కూడ వసుగుప్తుని శిష్యుడే అని కొందరి అభిప్రాయం. సోమానందుని ప్రశిష్యుడైన అభినవగుప్తుడు వ్రాసిన పరమార్థసారం కాశ్మీర శైవ సాహిత్యంలో శ్రేష్ఠమైనది.

ఒక గృహం, అద్దంలో ప్రతిఫలించినప్పుడు ఆ ప్రతిబింబం అద్దంకంటే భిన్నం అయినట్లు కన్పిస్తుంది కాని అది భిన్నంకాదు. అలాగే శివునిచే సృష్టింపబడిన ఈ విశ్వం శివునికంటే భిన్నమైనట్లు కన్పిస్తుందికాని నిజంగా భిన్నంకాదు. దీనినే అభాసవాదం అంటారు. శివుని సృష్టి సామర్థ్యమే శక్తి. శివునికంటే అభిన్నమైన ఈ శక్తివల్లనే శివుడు ఈ జగత్తును సృష్టిస్తున్నాడు. అనంత రూపమైన ఈ శక్తికి ప్రధాన రూపాలు అయిదు. (1) చిచ్ఛక్తి, (2) ఆనందశక్తి, (3) ఇచ్ఛాశక్తి, (4) జ్ఞానశక్తి, (5) క్రియాశక్తి. ఈ శక్తివల్లనే ఉత్పత్తి స్థితి సంహారాలు జరుగుతున్నాయి. అజ్ఞానబద్ధుడైన జీవుడు పరమాత్మ జ్ఞానంచేత మోక్షాన్ని పొందుచున్నాడు. దీక్షను పొంది జీవుడు అజ్ఞానమును తొలగించుకొని, జీవాత్మ పరమాత్మ భేదాన్ని అధిగమించి బ్రహ్మయందు పాలలో పాలు, నీళ్ళలో నీళ్ళువలె ఐక్యమగుచున్నాడు.

## వీరశైవం

ఈశ్వరుని సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన ముఖములనుండి ఉద్భవించిన రేణుక, దారుక ఘంటాకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణులే వీర శైవాన్ని స్థాపించినట్లు చెప్పబడుచున్నది. వీరే కలియుగంలో, రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్యులై అవతరించి కాశీ కేదారము మొదలైన పంచ మఠాలను స్థాపించినట్లు చెప్పబడుతుంది. వీరి చరిత్ర స్వాయంభువాగమంలో వివరంగా వర్ణించబడింది.

వీర శైవులకు, పంచాచార్యుల తరువాత పరమ పూజనీయుడు బసవేశ్వరుడు. ఇతడే వీర శైవమతాన్ని స్థాపించినట్లు కొందరి అభిప్రాయం. కాని వీర శైవ మత వ్యాప్తికొరకు భూలోకమందు జన్మించవలసినదిగా ఈశ్వరునిచేత ఆజ్ఞాపించబడిన నంది, బసవేశ్వరుడై జన్మించినట్లు బసవ పురాణంలోనే చెప్పబడింది. అందుచేత బసవేశ్వరుడు కేవలం వీరశైవ మత వ్యాప

శైవుడేకాని స్థాపకుడుకాడు. కళ్యాణ నగరంలో విజ్జలుని (బిజ్జలుడని బసవ పురాణంలో చెప్పబడింది) మంత్రియై వీర శైవ మత వ్యాప్తికి పాటుబడినాడు.

బసవేశ్వరుని మేనల్లుడైన చెన్న బసవేశ్వరుడు కూడా వీర శైవ మత వ్యాప్తికి కృషి చేసినాడు. ఏకాంత రామయ్య అనే వీర శైవుడు జైనులను ఓడించినట్లు అబ్లూరువద్దనున్న శిలా శాసనం చెబుతుంది.

శివుడు సర్వశక్తి సమన్వితుడు, సమస్త కళ్యాణ గుణ సంపన్నుడు, జగత్కారణుడు, ఆదిమధ్యాంతరహితుడు, సచ్చిదానందమే శివతత్వము. ఇదియే వీరశైవ మతంలో 'స్థలం' అని పిలవబడుచున్నది. స్థల పదానికి చోటు అనే సామాన్యార్థం కాకుండా విశేషార్థం ఇవ్వబడింది. స్థ అనగా స్థానం అని ల అనగా లయం అని అర్థం. మొత్తం మీద స్థల శబ్దానికి అర్థం ఈ జగత్తు శివుని యందే ఉంటూ శివునియందే లీనమగుచున్నది. శివుడే స్వకీయమైన శక్తివలన లింగాంగ రూపాలను పొందుచున్నాడు. శక్తి కూడా కళా భక్తి రూపాలను పొంది శివ జీవులను పొందుచున్నది షట్స్థలాలకు ప్రత్యేకార్థాలు ఇవ్వబడినాయి. జీవుడు శివునిలో భాగమే కాబట్టి, జీవుడు శివునియందు ఐక్యమగుటయే మోక్షమని వీర శైవ మత సిద్ధాంతం. ఈ మతస్థులు తమ ఇష్ట లింగాన్ని ఎల్లప్పుడూ తమ శరీరమందే ధరించెదరు. ఉపనయనానికి బదులు దీక్ష వారి ఆచారం. స్త్రీలు కూడా లింగమును ధరించెదరు బసవేశ్వరుడు కేవలము వీర శైవ మత వ్యాప్తినే కాకుండా కొన్ని సాంఘిక సంస్కరణలను కూడా చేసెడు. వీర శైవ మతాన్ని శక్తి విశిష్టాద్వైతమని కూడా కొంతమంది భావించెదరు.

## శివాద్వైతం

పరమ శివుడే పరబ్రహ్మ అని ప్రతిపాదించుతూ శ్రీకంఠ శివాచార్యులు వ్రాసిన బ్రహ్మసూత్ర భాష్యమే ఈ శాఖకు ఆధారమని కొందరి అభిప్రాయం ఇతని వాదము శంకర రామానుజాచార్యుల అభిప్రాయాలకు మధ్యగా ఉంటుంది.

శైవమతంలో కూడా కాపాల, కాలాముఖ అని రెండు వామాచార శాఖలు ఉన్నాయి. ఇవి పరసాధనకు వారు ఆదరించే కార్యాలు (1) కపాలంలో భుజించడం, (2) చితాభస్మధారణ భక్షణ (3) దండాన్ని ధరించడం, (4) మధుపాత్రలో భైరవుని అర్చించడం. వీరు ముఖ్యంగా చండికా సహిత భైరవుని ఆరాధిస్తారు నరబలి కూడా ఆచారంగా కలదని ప్రతీతి ఉంది. క్రకచుని నాయకత్వంక్రింద ఉన్న కాపాలికులను శంకరాచార్యులు ఎదుర్కొన్నట్లు శంకర విజయంలో చెప్పబడింది. ధూమ్రవర్ణం, త్రినేత్రం, దీర్ఘ దంతాలు లంబోదరం, రక్తవసనం, కపాలమాలాభరణం, ఖట్వాంగాయుధం, భయంకర రూపం కలిగిన బాలుని రూపంలో ఉన్న మహాకాలుని కొన్నిచోట్ల పూజించెదరు.

శివుని విగ్రహాలు అసంఖ్యాకమైన స్వరూపాల్లో అనేక స్థలాల్లో ఉన్నాయి. వాటిని అన్నిటినీ వివరించడం అసాధ్యం. అందులో ముఖ్యమైన మూర్తులు (1) అనుగ్రహమూర్తి (2) సంహారమూర్తి (3) భిక్షాటనమూర్తి (4) మహేశమూర్తి (5) నృత్యమూర్తి. నృత్యమూర్తి అంటే నాట్యము చేస్తున్న శివుడు. ఇందులో కూడా నాలా రకాలు ఉన్నాయి. నటరాజుయొక్క హస్తపాదముద్రలకు ప్రత్యేకమైన అర్థాలు ఉన్నాయని కొందరి అభిప్రాయం.

డమరుకం ధరించిన ఊర్ధ్వ దక్షిణ హస్తం శబ్ద గుణకమైన ఆకాశాన్ని సూచిస్తుంది. ఆకాశాన్నుంచే మిగిలిన భూతాలు జన్మించేయి కాబట్టి యీ హస్తం ఈశ్వరుని సృజన శక్తికి చిహ్నం. అర చంద్ర ముద్రతో అగ్నిని ధరించిన ఊర్ధ్వ వామ హస్తం సంహార శక్తికి చిహ్నం. అభయ ముద్రతోవున్న దక్షిణాధోహస్తం రక్షణకు చిహ్నం. గజహస్త ముద్రతో ఉన్న వామ హస్తం గజాననుని కార్యమైన విఘ్న నాశనానికి చిహ్నం. ఉత్థానవామపాదం భక్తునికి మోక్ష ప్రదానాన్ని సూచిస్తుంది. దిగువనున్న అపస్మార పురుషుడు మానవుని అజ్ఞానానికి చిహ్నం. అపస్మార పురుషుని జయించుట బంధమోక్షానికి గుర్తు. విగ్రహానికి చుట్టూ ఉన్న అగ్నిజ్వాల, జ్ఞానానికి చిహ్నమని కొందరు, ప్రణవ సూచకమని కొందరు లయ కారకత్వ సూచకమని కొందరు అభిప్రాయపడుచున్నారు.

విగ్రహాల ప్రత్యేక లక్షణాలనుబట్టి వాటికి కొన్నిపేర్లు వచ్చేయి. వాటిలో ముఖ్యమైన పేరుల శివ, రుద్ర, శంకర, పశుపతి, గంగాధర, గజసంహార, సోమస్కంధ, అర్ధనారీశ్వర, హరిహర, శిఖరేశ్వర, వైద్యనాథ, కాలసంహార, కళ్యాణసుందర, పాశుపతాస్త్ర ప్రధానమూర్తులు వీటి పేర్లను బట్టి విగ్రహాలయొక్క ప్రత్యేక లక్షణాలను వూహించవచ్చును. ఇవికాక కొన్ని విచిత్రమైన మూర్తులు ఉన్నాయి. శరభేశమూర్తి. ఇది నర మృగపక్షి సమ్మేళనం. హిరణ్య కశ్యపుని వధించిన నరసింహుని గర్వభంగము చేయుటకు శివుడు ఈ అవతారం ఎత్తేడని అందురు. వీణాధర దక్షిణామూర్తి ఈశ్వరుని జ్ఞాన ప్రదాయితావనికి చిహ్నం. సదాశివమూర్తి, ఈ విగ్రహానికి అయిదు ముఖాలు ఉంటాయి. మహా సదాశివమూర్తి, ఈ విగ్రహానికి ఇరవై అయిదు ముఖాలు, యాభై చేతులు వుంటాయి. ఈ ఇరవై అయిదు ముఖాలు సాంఖ్యుల ఇరవై అయిదు తత్వాలకు చిహ్నమని కొందరి అభిప్రాయం.

జరతుష్ట్ర మతంలో శివుని హోర్మ్జ్ అహోమాజ్ద్ అనే పేరుతో శివునిగా భావిస్తారు. ప్రతి మతంలోను సంహార కారకులైన దేవతలు ఉన్నారు కాని స్థలాభావంచేత వారిని గురించి ఇక్కడ వివరించలేదు. షట్చక్రాల్లో నాలగవదైన అనాహత చక్రానికి శివుడే అధిపతి.

శివుని చరిత్ర అనంతమైనది. అందుచేత శివ స్తోత్రాల్లో నాయకమణి లని చెప్పతగిన మహిమ్నస్తోత్రంలోని ఒక శ్లోక భావంతో ఈ వ్యాసాన్ని ముగించడం ఉచితం.

"ఈశా! కొండంత కాటుకను సముద్రములో కలిపి, కల్పవృక్షముయొక్క పెద్ద కొమ్మను కలముగాను, భూమినే కాగితముగాను గ్రహించి సరస్వతీదేవియే అహర్నిశలు వ్రాసినను, నీ గుణముల పరిమితిని కనుగొనజాలదు."

(సశేషం)

# ఉత్తమ చిత్రానికి నిర్వచనం ఏమిటి?

## 'గంపెరాలియా' మీద నాలుగు మాటలు...

ప్రపంచ దేశాలన్నీ ప్రాతినిధ్యం వహించిన ఒక పెద్ద 'ఫిలిం ఫెస్టివల్'లో అతి చిన్న దేశానికి చెందిన (అ) సాధారణ చిత్రం 'గంపెరాలియా' ఉత్తమంగా ఎన్నికయిందనగానే ఫిలిం ప్రముఖులంతా ముక్కుమీద వేలేసుకున్నారు. 13 దేశాలకు చెందిన 19 'పేపర్' చిత్రాలతో పోటీపడి శ్రీ సత్యజిత్‌రాయ్ అధ్యక్షతన ఏర్పడిన న్యాయ నిర్ణేతల బృందం ఈ 'గంపెరాలియా'కి బంగారు నెమలిని బహూకరించారు.

'గంపెరాలియా' అనే సింహళ పదానికి 'గ్రామం మార్పు' అని అర్థం. లెస్టర్ జేమ్స్ పెరిస్ అనే సింహళ దర్శకుని అపూర్వసృష్టి ఈ గంపెరాలియా.

ఈ చిత్రాన్ని విమర్శనాత్మకంగా చూసిన ఏ విమర్శకునికైనా ఎదురయ్యే మొదటి ప్రశ్న — ఉత్తమ చిత్రానికి నిర్వచనం ఏమిటి!

సరే! ఈ నిర్వచనం నిశ్చలంగా ఉంటుందా? లేక ప్రతి సంవత్సరం మారుతూ ఉంటుందా?

చిత్రంలోని ఏ ఏ అంశాలను ఆధారంగా చేసికొని ఆ యా చిత్రాలలోని ఉత్తమత్వాన్ని అంచనా వేస్తారు?

* * *

పియాల్ యువకుడు. చదువుకున్నవాడు. పేదవాడు కావటం మూలంగా కేవలం 'ప్రయివేట్‌లు' చెప్పుకొంటూ జీవిస్తూ ఉంటాడు. తాను చదువు చెపుతున్న నందా అనే అమ్మాయి తనను ప్రేమిస్తున్న సంగతి అతనికి తెలిసీ, ఏమీ చేయలేక పోతాడు. విధివశాత్తూ, నందా మరొకడి భార్య అవుతుంది.

నందా భర్త జినదాస కొంతకాలం భార్య దగ్గరే ఉండి, ఆ తరువాత జీవనోపాధికోసం ఉద్యోగాన్వేషణలో తిరుక్కుంటూ మరో వూరికి వెళతాడు. రెండు సంవత్సరాలవరకూ జినదాస ఎక్కడ ఉన్నదీ తెలియకపోవటంచేత, చివరకు నందా ఒకర్ని పంపిస్తుంది, జినదాస జాడ తెలిసికొనేందుకు. ఫలితంగా జినదాస చనిపోయాడన్న వర్తమానం వస్తుంది.

ఈలోగా పియాల్ పట్నానికివెళ్లి, మంచి కంపెనీలో పెద్ద హోదాగా సంపాదించి లక్షాధికారి అవుతాడు. తన పూర్వ ప్రేమికురాలైన పియాల్‌నే నందా తిరిగి వివాహం చేసుకుంటుంది. కొంతకాలం సుఖంగా నడిచిన వీరి కాపురంలో కొద్దిగా అలజడి ప్రారంభమవుతుంది. ఒకనాడు పియాల్ బయటికి వెళ్లిన సమయంలో "మీ భర్త జబ్బుగా ఉన్నాడు ఫలానా ఆస్పత్రిలో" అని టెలిగ్రాం వస్తుంది. నందా అక్కడికి వెళ్లగానే అప్పుడే మరణించిన 'జినదాస' కనుపిస్తాడు. ఆ పరిస్థితుల్లో తాను వేయి గలిగిందేమీలేక మౌనంగా ఇంటికి వస్తుంది. పియాల్ ఇంట్లో ఉంటాడు.

పియాల్ నందాల మధ్య ఇటీవలగా జరిగిన కొంత అలజడికి కారణం జినదాస బ్రతికి ఉండటమే. ఈ సంగతి నందాకు తెలియదు. జినదాస సజీవుడై ఉన్న సంగతి తనకు ముందే తెలుసునని పియాల్ చెప్పటంతో నందాతోబాటు ప్రేక్షకులు కూడా దిగ్భ్రాంతి చెందుతారు. పియాల్, నందాలు మళ్లీ సుఖంగా ఏకమవుతారు.

ఇందులోని కథ చాలా సహజమయినది. ఈ సహజత్వం ఇంతా అంతా అని చెప్పటానికి వీల్లేనంత చిక్కుటంగా ఉంది. కొన్ని సందర్భాలలో కేవలం సహజత్వాన్ని ప్రముఖంగా నెలకొల్పేందుకే కొన్ని అసహజమయిన సన్నివేశాలను పెట్టారని కూడా అనిపిస్తుంది.

ఇందులో ముఖ్యపాత్రధారులిద్దరే. ఒకరు పియాల్, మరొకరు నందా. ఒకే ఒక నెలలో పూర్తిగా తీయబడిన చిత్రం ఇది.

పాటలులేవు. ఆటలు లేవు. బహుశా ఇంకా ఎక్కువగా వాస్తవికతను సృష్టించాలనే ఆరాటంతో పాటలను, ఆటలను ప్రవేశపెట్టి ఉండక పోవచ్చును.

దర్శకుడు లెస్టర్ జేమ్స్ పెరిస్‌కు ప్రారంభం నుంచి 'వాస్తవికత' అంటే ప్రాణం. తన తొలి చిత్రాలైన 'రెకావా'లో 'సందేశయా'లలో కూడా వాస్తవికతను చూపించి, ఎవ్వరూ సాధించలేని కొత్తదనాన్ని తీసుక రావటంతో, ఆయన పేరు సింహళంలో మారు మ్రోగిపోయింది.

కాని ఒక్క ప్రశ్న?.... ఉత్తమ చిత్రానికి చిహ్నం వాస్తవికత ఒక్కటేనా? 'వాస్తవికత' కొరవడిన చిత్రాలన్నీ ఉత్తమ చిత్రాలుకావా? ఈ వాస్తవికతకు పరిహద్దులు అక్కర్లేదా?..... అన్న ప్రశ్నలు ఈ చిత్రం చూశాక ఉదయించక మానవు.

ఉదాహరణకు ఒక పిచ్చివాని పాత్రను సృష్టించాలి ఆ పిచ్చివాడు రోజూ మామూలుగా పనులు చేస్తాడు. వాటన్నింటినీ 'వాస్తవికత' పేరుతో 'సెల్యులాయిడ్' మీదికి ఎక్కించటం ఎంతవరకు సమంజసం?

ఇదీ అంతే. వాస్తవికత పరిధులను మించిపోయింది ఈ చిత్రంలో.

మొదటి భర్త జినదాస చనిపోయాడని తెలిశాక ఎంత తెలివి కలదైనా ఒకటి, రెండు మార్లన్నా ఆలోచించుకోకుండా మళ్లీ పెళ్లి చేసికోదు.

న్యాయ నిర్ణేతల సంఘం అధ్యక్ష స్థానంలో ఉన్న కళాకారుడు సత్యజిత్‌రాయ్ 'వాస్తవికత'కు పేరెన్నికగన్న వాడు గనుక ఈ 'గంపెరాలియా' ఇంతటి సత్కారాన్ని పొందింది.

ఇంకా 'వాస్తవికత' ఎక్కడ దొర్లిపోతుందోనని నటీనటులిద్దరూ కొన్నిచోట్ల నటించటం మానేశారు. ముఖ్యంగా పియాల్ మొదటినుంచి మనస్సు తిన్నపాములాగా కనుపిస్తాడు. అతను ఎప్పుడు సంతోషిస్తాడో ఎప్పుడు దుఃఖపడతాడో ఎవరికీ తెలియదు. అంటే చిత్రం సహజంగా ఉండాలనే నెపంతో నటీనటుల నటనకు కూడా బంధాలు ఏర్పడ్డాయన్నమాట.

నందా పాత్రధారి పున్యాహీరా దేనియా మొదట్లో పెళ్లి కాకముందు—ఏ ఒక్క సన్నివేశంలోనైనా పెళ్లి కావలసిన చిన్న పిల్లగా కనిపించదు. పోనీ పెళ్లిఅయిన తరువాతనైన ఆమెలో ఎలాంటి మార్పూ రాకపోవటం మరీ విడ్డూరం. కాని, చక్కని విగ్రహపుష్టి, ఆహ్లాదకరమైన ముఖం ఈ పాత్రకు వన్నె తెచ్చాయి.

డైలాగులను గురించి వ్రాసే అధికారం, అవకాశం నాకులేదు. కారణం ఈ చిత్రాన్ని సింహళ భాషలో తీశారు. ఆ భాష నాకు రాదు. ఎటొచ్చీ కనిపించినంతవరకూ వినిపించినంతవరకు సంభాషణలు క్లుప్తంగా ఉన్నాయి. (భాష తీరే అంత కాబోలు!)

ఫొటోగ్రఫీ అపూర్వమే. కారణం: ఈ సినిమా చూస్తున్నంతసేపు మనం సింహళ దేశాన్ని చూస్తున్నట్లు, అక్కడ ప్రజలతో మనమే మాట్లాడుతున్నట్లు అనిపిస్తుంది!

కథ చాలా గొప్పది. ఈ కథ తిరిగిన మలుపులు అసమాన్యమైనవి. కథకునికి నివాళులు అర్పించాల్సిందే!

సింహళదేశంలో చిత్రరంగం బాగా అభివృద్ధి చెందలేదు. అలాంటి స్థితిలో ఈ చిత్రం వెన్నెక రావటం పెటీ ప్రదర్శనకు అర్హత పొందటం, 'బంగారు నెమలి' చేపట్టటం సింహళ దేశానికి నిజంగా గౌరవమే! కాని, ఒక్క సంగతి ఈ చిత్రంలోని కొన్ని లోపాలకు సమాధానంగా అక్కడి చిత్రరంగం బాగా అభివృద్ధి చెందలేదని చెపితే మన లోప మవుతుంది. కారణం ఏమంటే చిత్రాల గొప్పతనం నిర్ణయించేందుకు ఆ యా చిత్రాలనే పరిశీలించాలిగాని, ఆ యా దేశాలలో చిత్రరంగం పరిస్థితి గమనించకూడదు.

చిత్రంలో సన్నివేశాలు క్రమంగా ఒక దానితో మరొకటి చేరిపోలేదు. గుర్రపుస్వందాల్లోని గుర్రాల్లాగా గబగబా దూసికిపోయాయి. దీని మూలంగా కథ నడిచిన తీరు దెబ్బ తింటుందికదా! అయినా, ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న సింహళ చిత్రరంగం ఇంతటి మంచి చిత్రాన్ని ప్రసవిస్తున్నదని ఆశించవచ్చు. అందువల్ల 'గంపెరాలియా' ఒక ఘన విజయమే.

### మనసుకు నచ్చిన కొన్ని దృశ్యాలు

మేష్టారు ప్రైవేటు చెపుతూ ఉంటారు. అమ్మాయి నందా వింటూ ఉంటుంది ఒక ప్రేమికుల కథ. ప్రేమకూ, అంతస్థుకూ సమన్వయం కుదరదని సారాంశం. ఈ సన్నివేశంలో వారికి వారికి ఇద్దరూ ఎంతో బావున్నారు.

నందాకు వివాహమవుతుందని తెలిసికొన్న పియాల్ మనోభావాలు, ప్రవర్తన రమ్యంగా ఉన్నాయి.

భర్తకు జబ్బుగా ఉన్నదని తెలిసి, ఆస్పత్రికి వెళ్లగానే మొదట భర్త 'జినదాస' కనిపించిన

దృశ్యం చూస్తే ఒళ్ళు జలదరిస్తుంది. 'జినదాస్' బ్రతికిఉన్నట్లు నాకు ముందే తెలుసునని పియాల్ చెప్పిన సన్నివేశం ఎంతో మృదువుగా ఉంటుంది.

చివరకు ఇద్దరూ ఒకటయిపోయిన దృశ్యం చాలా సహజంగా ఉంటుంది.

ముఖ్యంగా రజతోత్సవాలు, స్వర్ణోత్సవాలు జరుపుకొంటున్న 'భారతీయ చలన చిత్రరంగం' ఇంక బాక్సాఫీసు పెద్దబాల శిక్షలనే సెల్యులాయిడ్ మీదికి ఎక్కిస్తున్న తరుణంలో 'గంపెరాలియా' లాంటి చిత్రం రావటం ముదావహం.

జీవిత సత్యాల వెన్నింటినో చాటే చిత్రం ఇది. ఈ చిత్రాన్ని చూస్తున్నంతసేపూ ప్రేక్షకుడు, తన కథనో, లేక తన పొరుగింటివారి కథనో చూస్తున్నట్లు అనిపిస్తుంది. అదే ఈ చిత్రంలోని గొప్పతనం.

'ఇండియాలోని ఫిలిం ఫెస్టివల్'లో మరొక చిన్న దేశం రూపొందించిన కళాఖండం పట్టాభిషేకం చేయించుకోవటం ఇక్కడి నిర్మాతలకు, దర్శకులకు గౌరవప్రదమా? కాని ఈ సంఘటన నుంచి ఏదైనా నీతిని నేర్చుకొనేటంత సహృదయులైన నిర్మాత, దర్శకులు ఈ దక్షిణ దేశంలో ఉన్నారా? ★

* * *

# అసమగ్రమైన ఏర్పాట్లతో మద్రాసులో ఫిలిం ఫెస్టివల్!

ఎప్పుడెప్పుడు వస్తాయోనని ఎదురు చూచిన 'ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్' ఉత్సవాలు చడీ, చప్పుడూ లేకుండా జరిగిపోయాయి.

అంతర్జాతీయ స్థాయిని ఉత్తమ చిత్రాలు మన దేశానికి, మన దగ్గరకు వస్తున్నాయంటే ఎంతో ఆశగా ఎదురు చూస్తాము. అది సహజం!

పదిరోజులక్రితం ఈ ఉత్సవాలు ఢిల్లీలో ప్రారంభమయ్యాయి. దేశం నలుమూలలనుంచి 'ఫిలిం పెద్ద'లంతా ఈ ఉత్సవాలకు వెళ్ళారు. రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ వీటిని ఆరంభిస్తే, ఉపరాష్ట్రపతి డాక్టర్ జకీర్ హుస్సేన్ వీటికి మంగళం పలికారు. వివిధ దేశాల ప్రతినిధులు ఈ ఉత్సవాలకు హాజరయ్యారు.

ఉత్సవాలు ఆ పూరూ, ఆ పూరూ తిరిగే ముందు మద్రాసు కూడా వచ్చాయి. శాంతి థియేటర్లో ఈ ఉత్సవాలను మద్రాసు గవర్నర్ శ్రీ పి. చంద్రారెడ్డి ప్రారంభించారు. ముఖ్యమంత్రి శ్రీ భక్తవత్సలం అధ్యక్షత వహించారు. శ్రీ పి. బి. శ్రీనివాస్ ప్రార్థనలతో కార్యక్రమం ఆరంభమయింది. సెన్సార్ అధికారి శాశీపతిగారు ఇతర దేశాల ప్రతినిధులను పరిచయం చేశారు. శ్రీ నాగిరెడ్డి వందన సమర్పణ చేశారు.

ప్రతినిధులు నగరంలో మకాం చేసిన నాలుగు రోజులపాటూ పూళ్ళో అక్కడక్కడ విందులూ వేడుకలు జరిగాయి. అక్కడ చేరిన వారంతా చేతులు చేతులు కలుపుకొని 'ఓహో, ఓహో' అనుకొన్నారు. అవి అంతటితో సరి.

ఇకపోతే, నగరంలో అక్కడక్కడ కొన్ని థియేటర్లలో కొన్ని చిత్రాలను ప్రదర్శించారు. 'ఫిలిం ఫెస్టివల్' కేవలం ఈ కార్యక్రమాల వరకే పరిమితి చేయబడిందన్నమాట.

ప్రభుత్వంయొక్క ప్రముఖ పాత్రతో నిర్వహించబడిన ఈ 'ఫిలిం ఫెస్టివల్' రూపం మొత్తంమీద ఆశాజనకంగా కనిపించదు. కాగా, సాగా ఇండియాలోని ప్రధానమైన ఫిలిం కేంద్రాలు మద్రాసు, కలకత్తా, బొంబాయిలలోని 'ఫిలిం వ్యాపారస్తులకు' విదేశాల ఫిలిం పెద్దలతో పరిచయాలు అయ్యాయి.

ప్రభుత్వ రంగంలో, ఇంతటి వ్యయ ప్రయాసలకోనర్చి జరిపే ఇలాంటి ఉత్సవాలు ప్రణాళికాయుతంగా క్రమమైన పద్ధతిలో జరిగినట్లయితే ఇంకా బాగా జరగవచ్చును.

ఇతర సమయాల్లో చీటికి మాటికీ 'ప్రెస్ కాన్ఫరెన్సు'లను ఏర్పాటుచేసే ప్రభుత్వ సమాచారశాఖ ఈ సందర్భంలో కనీసం ఒక పత్రికాగోష్ఠినయినా ఏర్పాటు చేయలేకపోయింది. విదేశాలలో చిత్రాలను గురించిన వివరాల 'ప్రచురణలు' అంతకన్నా లేవు.

'ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో'వారు విలేఖరులకు ఇచ్చిన 'పాస్'లు కూడా కొన్ని థియేటర్లలో చెల్లని సంగతి సమాచారశాఖ పెద్దలకీ ఈ సరికయినా తెలిసి ఉంటుందని అనుకుంటాము.

'ఫిలిం ఫెస్టివల్' మొత్తంమీద నన్ను బాగా ఆకర్షించిందల్లా మద్రాసు వీధుల్లో సినిమావారి కార్ల సత్తిడివల్ల తరచుగా అక్కడక్కడ 'ట్రాఫిక్ బంద్' కావటమే! ఇదే 'ఫిలిం ఫెస్టివల్'కు సంబంధించిన కొన్ని విశేషం!!



వాస్తవికతకు ఆరాధకుడు
శ్రీ సత్యజిత్ రాయి

## బహుమతుల వివరాలు

సింహళ దేశానికి చెందిన 'గంపెరాలియా' అంతర్జాతీయ ఉత్తమ చిత్రంగా ఎన్నికయింది. లెస్టర్ జేమ్స్ పెరీస్ అధ్వర్యాన తయారయిన ఈ చిత్రానికి భారత దేశపు చిన్నదైన 'బంగారు నెమలి' విగ్రహాన్ని ఉపరాష్ట్రపతి డాక్టర్ జకీర్‌హుస్సేన్ బహూకరించారు.

ఉత్తమ సంక్షిప్త చిత్రంగా క్యూబాకు చెందిన 'సైక్లోన్' ఎన్నికయింది.

'ఫీచర్ ఫిలిమ్స్'కు సంబంధించినంతవరకు 13 దేశాలకు చెందిన 19 చిత్రాలు పోటీలో పాల్గొన్నాయి. శ్రీ సత్యజిత్‌రాయ్ అధ్యక్షతన ఏర్పాటయిన న్యాయ నిర్ణేతల సంఘం పై పందొమ్మిట్లో 6 చిత్రాలను బహుమతులకుగాను ఎన్నిక చేసింది.

సంక్షిప్త చిత్రాలకు సంబంధించినంతవరకు 23 దేశాలకు చెందిన 28 చిత్రాలు పోటీలో పాల్గొన్నాయి. ఈ చిత్రాల న్యాయ నిర్ణేతలు మూడు చిత్రాలను మాత్రమే బహుమతులకు ఎన్నిక చేశారు.

ఫీచర్ చిత్రాలలో ఉత్తమ నటనకు వెండి నెమలి విగ్రహాన్ని బెంగాలీ చిత్రం 'నిర్జన్ సైకతో'లో ఐదుగురు నటీమణులు—షర్మిలాటాగోర్, రూమాగుహా ఠాకుర్తా, ఛాయదేవి, భారతీదేవి, రేణూకారాయ్‌లకు లభించాయి. ఉత్తమ నటనకుగాను రష్యన్ నటుడు యోగని లెనోవ్‌కు, లభించింది.

జపాన్ చిత్రం 'కుడో ఐ బట్ లివ్'కు ఈ ఉత్సవాలలో ప్రత్యేక స్థానాన్ని ఇవ్వటం జరిగింది. 'విలువైన కథ' ఈ చిత్రంలోని ఆకర్షణ' అంటారు న్యాయ నిర్ణేతలు.

కలకత్తా క్లబ్‌వారు సృష్టించిన 'బెంగాల్ టైగర్' అనే బహుమతి శ్రీ యస్. సుఖదేవ్ నిర్మించిన "అండ్ మైల్స్ టు గో" అనే సంక్షిప్త చిత్రానికి లభించింది.

—వాశిరాజు ప్రకాశం ★

# మీ చర్మానికి తగినది

# నివియా




## ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ. స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను గోల్పోవునట్టి మీ చర్మమందలి చెమ్మదలను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్యవంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది నివియా — ఇప్పుడే!

నివియా — వివిధోపయుక్తమైన క్రీమ్






ఇండియాలో సోల్ డిస్ట్రిబ్యూటర్లు: జె. ఎల్. మారిసన్, సన్ & జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్,
పోస్టు బాక్సు నెం. 1746, బొంబాయి-1



అక్కినేని నాగేశ్వరరావుగారి 'నేను చూచిన అమెరికా' పుస్తకాన్ని మంత్రి శ్రీ చెన్నారెడ్డి విడుదలచేసినప్పటి చిత్రం

# అక్కినేని అమెరికా అనుభవాలు

"నాటకరంగం అమెరికాలో మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లుతోంది. సంగీత, సాహిత్య శాఖలకు, చలన చిత్రాలకు, టెలివిజన్‌కు—అన్నిటికీ దీటైన స్థాయిలో ఉంది. వాటికి కళాకారులను అందిస్తోంది.''

''అమెరికాలో మొత్తం రెండు వందల యూనివర్సిటీలుంటే, నూటికి 80 వంతుల యూనివర్సిటీలలో నాటక కళలో కోర్సులున్నాయి. మొత్తం కరిక్యులమ్‌లో నూటికి 15 వంతులు నాటక కళకు సంబంధించిందే.

''ఈ కోర్సులలో వేర్వేరు విభాగాలున్నాయి. వాటిలో వాచికం, ఆంగికం, డైరెక్షన్, నాటక రచన, నాటక ప్రయోగం, చిత్రలేఖనం, శిల్పం డిజైనింగ్, స్టేజి, టెలివిజన్, ఫిలిమ్ టెక్నిక్ మొదలయిన విషయాలు నేర్పుతారు. అధ్యాపకులు సమర్థులు, అనుభవజ్ఞులు అయి ఉంటారు. ప్రతి విభాగంలోను ఆనాటివరకు కనిపెట్టిన ఆధునిక విశేషాలన్నిటినీ బోధిస్తారు.

''నేర్చుకునేది నాటక కళ గనుక, కఠినమైన రూల్స్, రెగ్యులేషన్స్ ఉండవు. అంతా హాయిలా హాయిలాగా జరిగిపోతున్నట్లు కనబడుతుంది.

'థియేటర్ కోర్సులలో మూడు గ్రేడులున్నాయి. మొదటిది బాచిలర్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ (బి. ఎఫ్. ఎ.) రెండోది మాస్టర్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ (ఎం. ఎఫ్. ఎ.), మూడోది డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ (పి. హెచ్. డి.) ఈ గ్రేడులలో ప్రవేశించగోరే ప్రతి విద్యార్థికి కొన్ని కనీసపు విద్యార్హతలుండాలి. ముందుగా పెద్ద ఎత్తున ఒక పరీక్ష జరుపుతారు. అందులో విద్యార్థి తెలివి తేటలనుబట్టి ఏ గ్రేడులో చేర్చుకోవలసిందీ, ఏ పద్ధతిలో చేర్చుకోవలసిందీ నిర్ణయిస్తారు.''

అమెరికాలో నాటకరంగం అభివృద్ధికి తీసికొంటున్న కొన్ని చర్యలు ఇవి. ఈవిధంగా అమెరికా ఆదర్శప్రాయం అవుతోంది. ఈ విషయాలన్నీ ''నేను చూసిన అమెరికా'' పుస్తకం చదివి తెలిసికోవచ్చు. దీనిని సినీనటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు రచించారు. జ్యోతి బుక్స్ వారు ప్రచురించారు.

శ్రీ నాగేశ్వరరావు తన అరవై రోజుల అమెరికా పర్యటన విశేషాలను నూరు పుటల గ్రంథంలో పొందుపరచారు. దీనిని ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖా మాత్యులు డాక్టర్ మర్రి చెన్నారెడి జనవరినెల 15 వ తేదీన విజయవాడలో ఆవిష్కరించారు.

ఈ ఆవిష్కరణోత్సవ సభకు అమెరికా సమాచార శాఖకు చెందిన సాంస్కృతిక విభాగ అధికారి (మద్రాసు) శ్రీ ఫెంటన్ గార్డినర్ అధ్యక్షత వహించడం విశేషం. ఈయన మద్రాసులో ఈ ఉద్యోగంలో చేరి, అప్పటికి మూడు వారాలు మాత్రమే అయింది. ఉద్యోగంలో ప్రవేశించాక ఆయన తలపెట్టిన మొదటి పర్యటన—బహుశః ఇదే.

''నా జీవితంలో ప్రప్రథమ పర్యాయంగా ఆంధ్రప్రదేశ్‌కు వచ్చాను. ఇక్కడికి వచ్చి మిమ్మల్ని అందరినీ కలిసికొనడం ఎంత ఆనందంగా ఉందో చెప్పలేను'' అన్నారు శ్రీ గార్డినర్ అధ్యక్షత వహిస్తూ.

శ్రీ గార్డినర్ ఉన్న ఈ సమయాన్ని శ్రీ చెన్నారెడ్డి బాగానే వినియోగించుకున్నారు. అయితే ఆయన కోర్కె ఎంతవరకు సఫలం ఔతుందో చూడవలసి ఉంది.

''పరికరాల రూపంలోగాని, ఇతర విధాలుగా గాని అమెరికా సహకారం లభిస్తే, ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి జిల్లాలోనూ ఒక్కొక్క థియేటర్‌ను ప్రభుత్వం నిర్మిస్తుంది. దీనికి సంబంధించి ప్రతిపాదనలు ఏవయినా వస్తే, వచ్చే బడ్జెట్‌లోనే కొంత ధనాన్ని కేటాయిస్తాం కూడా.'' అన్నారు శ్రీ చెన్నారెడ్డి.

తాము చలన చిత్ర పరిశ్రమకు ప్రతినిధిగా అమెరికాలో పర్యటించినందున, ఈ [illegible] ఆ దేశంలో చూసింది రాసినట్లు వివరించడమే ఈ పుస్తకం లక్ష్యమని శ్రీ నాగేశ్వరరావు అన్నారు. ఈ పుస్తకంలో అక్కడి సినిమా పరిశ్రమను గురించి ఉన్నది చాలా స్వల్పం. నాటక రంగాన్ని గురించి ఈయన చాలా రాశారు. హాలీవుడ్ ఫిలిం పరిశ్రమలో జరిగే ప్రతి ప్రక్రియ, తయారయే ప్రతి చిత్రం ఎప్పటికప్పుడు మన దేశానికి వస్తున్నాయి కనుకా, ఆ దేశ సినీ నటులకు మన దేశంలో మన నటులతో సమానమైన పేరు ప్రఖ్యాతులుండడంవల్లా, పరిశ్రమకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలు తప్ప అక్కడ ప్రత్యేకించి చూసి చెప్పేది లేదని శ్రీ అక్కినేని భావించారు.

ఈ పుస్తకంలో 12 పేజీలలో ఫొటోలను ప్రచురించారు.

'ఇరవై కోట్ల కథా నాయకులు', 'నమ్మితే నమ్మండి', 'రంగస్థల రాజధాని', 'అయోవాఘును సభ', 'నిజమైన జర్నలిజం', 'నాటక విశ్వ విద్యా పీఠాలు', 'చలన చిత్ర రాజధాని', 'వింతల తథ మానికం' (డిస్నీలాండ్) మొదలైనవి ఈ పుస్తకంలోని ఉప శీర్షికలు. తమ లండన్, హాంకాంగ్, సింగపూర్‌లలో పర్యటనలను కూడ ఈ పుస్తకంలో రచయిత పొందుపరిచాడు.

చెన్నారెడ్డి దంపతులకు, నాగేశ్వరరావు దంపతులకు, సభాధ్యక్షుడు శ్రీ గార్డినర్‌కు ప్రచురణ సంస్థవారు నూతన వస్త్రాలను బహూకరించారు.

శ్రీ పి. సుబ్బారావు వందన సమర్పణ చేశారు.

ఈ సభలో పాల్గొనేందుకు అమెరికా సమాచారశాఖ (మద్రాసు)లోని తెలుగు చీఫ్ ఎడిటర్ శ్రీ బి. ఎస్. ఆర్. కృష్ణ కూడ ప్రత్యేకంగా వచ్చారు. పుర ప్రముఖులు చాలామంది సభకు హాజరయ్యారు.



# సరాగమాల — వి. ఎ. కె. రంగారావు

"పాండవవనవాసం" లో నాకు నచ్చనివి రెండే రెండు. ఒక పాటపల్లవిలో "హిమగిరి సొగసులు" అనే సంకర సమాసం ఉండటం. అర్థం ముఖ్యం అనుకుంటే మధ్యన ప్రత్యయం చేర్చి "హిమగిరులు సొగసులు" అనే మాత్రతే ముఖ్యం అనుకుంటే 'మంచు మల సొగసులు' అని సుకరంగా, సుబోధకంగా వ్యాకరణ సూత్రానుసారంగా మార్చుకోవచ్చునుగదా! ఈ సంకర సమాసోత్పన్నమైన బాధను ద్విగుణీకృతం చేస్తున్నది ఈ పాట వ్రాసినది సినియర్ సముద్రాల సరే నన్నది కమలాకర కామేశ్వరరావువంటి వ్యక్తులు కావటం తెలియనివారు తప్పుచేస్తే చూసీ చూడనట్లు పూరుకుంటాం చెప్పగలిగితే చెప్తాం తెలిసినవాళ్ళే, ఒకరికి చెప్ప గలిగిన వాళ్ళే చేస్తే ఇంకా చేయగలిగిన దేమిటి? తలవంచుకోవటం తప్ప!

ఇందులో నచ్చని నాటలో రెండవది దుర్యోధనుని సభా మందిరంలో ఇద్దరు నర్తకీమణులు నాట్యం పేరిట చూపిన వికారమైన అంగ విన్యాసం అసలు హిందుస్తానీ బాణీలో చేయబడ్డ వరసే బాగులేదు కాని అది సంగీత దర్శకుని ఇష్టా ఇష్టాలపై ఆధారపడి ఉంటుంది కనుక దానిని గురించి పెద్దగా చెప్పుకో నవసరంలేదు కాని కంటికి అతి అసహ్యంగా కనుపించింది భరత నాట్యపు దుస్తులు బలవంతంగా తొడగబడిన ఆ అసహ్య నృత్యం. వికల మనస్కుని వికృతోహేలాల ఒడలు అటూ ఇటూ కదలిస్తేగాని రససిద్ధి కలుగదా సామాన్య ప్రేక్షకులకు? అయితే "పిలచిన బిగువటరా", "విరాళి సైపజాలరా", "కాగిరి కైలాసమూ" లోని పూర్వభాగం ఎలా రాణించినట్లు? నన్నడిగితే అటువంటి వికృత నృత్యాలకు కారణం కేవలం బద్ధకం ఎంతటి క్లిష్టమైన సాహిత్యాన్నయినా సులభమైన పదజాలంలో ఎలా ప్రతిబింబించగలమో, సామాన్య జనానికి ఆకర్షణీయంగా, శృంగతిని మీరకుండా నృత్యాన్ని కూడ మలచగలము. దీనికి కావలసిన ప్రతిభా వ్యుత్పత్తులు వారిలో ఉన్నవి ఈ కోరికా, వోపికా కొరవడినవి పాపం ఎందుకోమరి! "నర్తనశాల"లో ఉత్తరా బృహన్నలల విన్యాసాలు ఎంత ఆహ్లాదకరంగా ఉన్నవో మొదట పూర్వశి చేసిన నృత్యం అంత అసహ్యంగా ఉన్నది వరసా, వాద్య గోష్ఠి కేవలం హిందీ అపరాధ పరిశోధక చిత్రాలలో, ద్యూత మందిరాంతరాలలో జరిగే కాబరే డాన్సును తలపుకు తెప్పించినట్లు ఉన్నది

ఈ రెండు పాటలూ "సరసరా కురువరా" అన్నది దుర్యోధన సభలోనిదీ, చక్కని సాహిత్యానికి ఉదాహరణలు ఈ సంగతినైనా తలపులో ఉంచుకొని ఆ నృత్య దర్శకుడు తన ఆలోచనా విహంగాన్ని మరికొంత ఎత్తులో పయనింపజేస్తే ఎంత అందంగా ఉండేది?

ఇంత తర్జన భర్జనా సన్నివేశౌచిత్యం పాటంత లేదే! అడవిలో, ఘోషయాత్ర సందర్భాన చేసిన నృత్యానికి- ఎవరైనా ఈ విధమైన వంక పెట్టగలరా!

*    *    *

ఈమధ్య నాకు అతి విచిత్రమైన లేఖ ఒకటి వచ్చింది ఉన్న దున్నట్లుగా దాన్నిక్కడ ఉదహరిస్తున్నాను

"ఆర్యా, మూగమనసులు చిత్రంలోని రెండు రికార్డులు సి నారాయణరెడ్డి వ్రాసినవి కావని శ్రీ భావనారాయణగారు వ్రాసినవని తెలిసినది అవి (1) నా పాట నీ నోట పలకాల సిలకా, (2) ముద్దబంతి పూవులో శ్రీ భావనారాయణగారు సికింద్రాబాద్ రైల్వే క్లెయిమ్సు ఆఫీసులో పని చేసారు గవర్నమెంటు సర్వీసులోఉన్న కారణాన ఆయన పేరు ప్రచురణ చేయకూడదని సి నారాయణరెడ్డిగారు ఆ రెండు పాటలను రచించినట్లు వెలువడిందని తెలిసినది ఇది ఎంతవరకూ నిజమో మీరు మాకు ఆంధ్ర సచిత్ర వార పత్రిక ద్వారా తెలుపవలసిందని కోరుతున్నాను"

సికింద్రాబాద్‌నుంచి "కుమారి సరిపెల్ల వెంకట సత్యవతి"

'అమ్మాయీ! సి నారాయణరెడ్డి మూగమనసులో పాటలు వ్రాయకపోవటం నిజం. రైల్వే భావనారాయణ పాటలు అందులో ఉండటం అబద్ధం ఈ సరాగమాల తక్కువ పోమయాజి నిర్వహిస్తున్నా డనుటంలో ఎంత నిజమున్నదో ఆ పాటలు ఆత్రేయవి కావనుటలోనూ అంతే నిజమున్నది. ఇంతటి అభూతకల్పన మీ చెవిని ఎవరు వేశారో, అతి ప్రాథమికమైన వివేచనా శక్తిని మీరు ఎలా ఉపేక్షించి దాన్ని నమ్మినారో నా కవగాహన కావటంలేదు.

*    *    *

హెచ్. ఎం. వి. వారి కొత్త గాయకుడు బి. విజయకుమార్. వీరి స్వంత వూరు ఖమ్మంమెట్టు. నల్లాని చక్రవర్తుల రామానుజాచార్యులవద్ద కొంత వరకు సంగీతం అభ్యసించారట. ఇప్పుడు కూడా శాస్త్రీయ సంగీతాధ్యయనం చేస్తు ఉన్నారనే తెలుస్తున్నది.

ఇటీవల జిక్కితో రెండు తెలుగు పాటలూ, దాశరథి రచనలు పాడారు. కన్నడంలో శ్రీ వేంకటేశ్వరునిపై స్తోత్ర గీతాలు రెండు సదాశివయ్య కృతాలు, వీరు పాడినవే ఒక రికార్డుగా విడుదలైనవి. కొత్త కంఠాలను ప్రోత్సహించాలను కొన్న సంగీత దర్శకులు వీరి కంఠాన్ని విని, తగు రీతిగా సత్కరించాలి మరి. పై పాటలకు సంగీత కారులుగా పి ఎస్ ఆనంద్ పేరు, టి ఎ కల్యాణం పేరూ [illegible] విజానికి వారు చేసింద్సే లేదు.

★



'చదువుకున్న భార్య'లో సూర్యకాంతం, వాసంతి, కృష్ణకుమారి.

## సౌందర్యమునకై
## సౌందర్య సాధన!

# లక్మె



**ఉదయము లక్మె వానిషింగ్ క్రీమ్ రాసుకోండి...**

మరియు దినమంతా సౌందర్యముగా తయారై వుండండి. లక్మె వానిషింగ్ క్రీమ్ మీద పౌడర్ చాలా సేపటి వరకు కూడ అదుకొని వుండును. ఇందువల్ల మీ ముఖము దినమంతా అందముగాను, కోమలముగాను వుండును.

**...మరియు రాత్రి లక్మె కోల్డ్ క్రీమ్!**

మీరు విశ్రాంతిగా నిద్రిస్తారు. లక్మె కోల్డ్ క్రీమ్ వల్ల 'మేకప్' మరియు రోమ రంధ్రముల మీద వున్న ధూళి కణములు వదలిపోవును. చర్మము కొరకు ఉపయోగకరమైన నూనెలతో తయారైన లక్మె కోల్డ్ క్రీమ్ మీ ముఖచర్మమును కోమలముగాను, ప్రకాశవంతముగాను వుంచును.



## దేవత

రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ వారి "దేవత" చిత్రానికి జనవరి 22 న వాహినీ స్టూడియో రెండవ ఫ్లోర్‌లో ఉదయం తొమ్మిదిన్నర, పది గంటల మధ్య ముహూర్తం జరిపారు.

ప్రారంభానికి వచ్చిన వారిలో శ్రీయుతులు చక్రపాణి, కాకర్ల వెంకటేశ్వరరావు (వాణీ ఫిలిమ్స్) ఏ. ఎస్. ఆర్. ఆంజనేయులు, డి. రామానాయుడు, వేదాంతం రాఘవయ్య, జెమినీ శ్రీనివాసన్, పింగళి నాగేంద్రరావు, పెండ్యాల నాగేశ్వరరావు, కె. వి. రెడ్డి, ఎన్. టి. రామారావు, సావిత్రి, గీతాంజలి, జెమినీ గణేష్, హాస్యనటుడు బాలకృష్ణ మొదలయినవారు ఉన్నారు.

అతిథులకు నిర్మాత, హాస్యనటుడు, శ్రీ పద్మనాభం, దర్శకులు శ్రీ కె. హేమాంబరధరరావు స్వాగతం చెప్పారు. కలకండ, పాలకోవా, స్పుట్నిక్‌లతో అందరి నోళ్లు తీపి చేశారు.

"పద్మనాభం మరి వెళ్తున్నా!" అన్నారు చక్రపాణి బయలుదేరుతూ.

"మీ ఆశీర్వాదం నా కెప్పుడూ ఉండాలి!"

"తప్పకుండా" అంటూ పద్మనాభంగారిని దీవించి, ప్రేమాదరాలతో పైకి లేవనెత్తారు శ్రీచక్రపాణి. అభినందించి వెళ్ళిపోయారు.

చుట్టూవున్న కెమెరాల సందడిని చూసి ఫోటోకి వించోవున్నారు. జెమినీ గణేష్ కొంత అవతలగా కూచుని ఉన్నారు. ఎన్. టి. ఆర్. చూసి "ఆదేమిటి బ్రదర్, అక్కడుండిపోయారు! రండి, రండి!" అంటూ పిలిచి, సావిత్రివేపు తిరిగి "మా బ్రదర్, నా తరపు" అన్నారు.

చాలా సందడిగా గడిచిందాపూట.

ఈ "దేవత" సాంఘిక చిత్రంలో ఎన్. టి. రామారావు, సావిత్రి, పద్మనాభం, గీతాంజలి మొదలయినవారు నటిస్తున్నారు. మాటలు, పాటలు వీటూరి రూపొందించారు. సంగీతం : ఎస్. పి. కోదండపాణి, ఆర్ట్ : బి. ఎన్. కృష్ణ, కెమెరా : ఎం. జి. సింగ్, దర్శకత్వం : కె. హేమాంబరధరరావు.

## సురేష్ పిక్చర్స్ జానపద చిత్రం

"ఆడపిల్ల మగవాడు కలసినప్పుడు
అనుకునే మాటలు రెండే రెండు"

అన్నది అమ్మాయి, అబ్బాయి దాపునకు వచ్చి. అబ్బాయి కూడ అందుకున్నాడు : "లేడి కనుల లేత మనసు కలసినప్పుడు పాడుకునే పాట ఒకటే ఒకటి!" —ఈ గీతం వ్రాసినది ఆరుద్ర. సంగీతం సమకూర్చినది వేణు. జనవరి 19, 20, 21 తేదీలలో ఈ పాట నాయికీ నాయకులు రాజశ్రీ, కాంతారావులపై వాహినీలో ఆరో ఫ్లోరిలో చిత్రీకరణ జరిపారు. ఇది సురేష్ పిక్చర్స్ జానపద చిత్రానికి సంబంధించిన దృశ్యం.

తారాగణంలో మిగిలిన ముఖ్య భూమికల్లో రాజనాల, పద్మనాభం, బాలకృష్ణ, ఎల్. విజయలక్ష్మి, వాణిశ్రీ ఉన్నారు. సంభాషణలు : సముద్రాల (జూనియర్) పాటలు : ఆరుద్ర, సంగీతం : వేణు, నృత్యాలు : కె. ఎస్. రెడ్డి, కళ : రాజేంద్ర

# చిత్రలహరి

కుమార్, ఎడిటింగ్ : మార్తాండ్, కెమెరా : అన్నయ్య, దర్శకత్వం : సి. ఎస్. రావు, నిర్మాత: డి. రామానాయుడు.

## ఆర్ట్ డైరెక్టర్ బి. సి. బాబు మృతి

ఆర్ట్ డైరెక్టర్ బి. సి. బాబు జనవరి 14 వ తేదీ సాయంకాలం హృద్రోగంతో మద్రాసులో మరణించారు. చనిపోయేనాటికి ఆయన వయసు నలభై. ముప్పయిఅయిదు చిత్రాలకుపైగా, ఆయన కళా దర్శకత్వం వహించారు. దాదాపు విఠలాచార్యగారి చిత్రా లన్నిటికీ ఆయన ఆర్ట్ డైరెక్టరుగా పని చేశారు. ఆయనమృతి చిత్ర పరిశ్రమకు వెలితి!

## ఉక్కుమనిషి

రవిశ్రీ ఫిలిమ్స్‌వారు "ఉక్కు మనిషి" చిత్రం తయారు చేస్తున్నారు. ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబడుతున్న ఈ తెలుగు చిత్రంలో దారాసింగ్, హెలెన్, నిషి, బి. ఎం. వ్యాస్, కింగ్‌కాంగ్, ఆల్రెడ్ గోమ, టైగర్ జోగింద్ర, మారుతి, ఇందిర, ముంతాజ మొదలయినవారు నటించారు. రచనా బాధ్యత అనిసెట్టి చేపట్టారు, సంగీత దర్శకుడు: సామర్తి.

## వీరప్రతాప్

శివశక్తి మూవీస్‌వారి జానపద చిత్రానికి "వీరప్రతాప్" అని నామకరణం చేశారు. ఈ చిత్రంలో రాజశ్రీ, కాంతారావు, నాగభూషణం, ధూళిపాళ, బాలకృష్ణ, రాజబాబు, వాణిశ్రీ మొదలయినవారు నటిస్తున్నారు. కథ, సంభాషణలు :



'సుమంగళి'లో సావిత్రి

ఆదుర్తి వెంకట నరసింహమూర్తి రూపొందించారు. ఇంతవరకు ముళ్లపూడి వెంకట రమణ రెండు, మల్లాది రామకృష్ణశాస్త్రి రెండు పాటలూ వ్రాశారు. ఈ నాలుగూ రికార్డు చేశారు. వాటిలో రెండు గీతాలు సుశీల, ఒకటి పి. బి. శ్రీనివాస్, మరొకటి జానకి పాడారు. సంగీత దర్శకుడు : కోదండపాణి. కెమెరా : వెంకట్, కూర్పు : బి. గోపాలరావు, దర్శకత్వం : ఎస్. ఆర్. శర్మ. ఈ చిత్రంలో వాంప్ భూమికలో దేవకి అనే కొత్త అమ్మాయిని పరిచయం చేస్తున్నట్టు చెప్పారు. ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ శ్రీ డి. బి. నారాయణ మరో రెండు పాటలు జనవరి నెలాఖరులోగా రికార్డు చేసి, చిత్రీకరించుతారు. ఇది ఈస్టిండియా ఫిలిం కంపెనీవారి ద్వారా ఆంధ్రలో విడుదల అవుతుంది. ఇందులో నాయకీ, నాయకులకు వేసిన కాస్ట్యూమ్స్ కొత్త రకంగా, అందంగా, కన్నుల విందుగా ఉన్నవి. కళా దర్శకుడు కృష్ణారావు వేసిన సెట్స్ కూడ కొత్తదనాన్ని తోపింప జేస్తున్నవి.

## పల్నాటి వీరకథ

శ్రీ అనురూపావారి "పల్నాటి వీర కథ" చిత్రం రామినీడు దర్శకత్వంలో భారీ ఎత్తుల్లో రూపొందించబడుతున్నది. విజయా స్టూడియో మూడో ఫ్లోరిలో షూటింగ్ జరుగుతున్నది. పెద్ద పెద్ద సెట్స్‌తో, విలువైన కాస్ట్యూమ్స్‌తో, అధిక వ్యయ ప్రయాసలతో నిర్మించబడుతున్న చిత్రమిది. ఎన్. టి. రామారావు, కాంతారావు, గుమ్మడి, రాజనాల, హరనాథ్, మిక్కిలినేని, కె. వి. యస్. శర్మ, బాలయ్య, ప్రభాకరరెడ్డి, భానుమతి. జమున, ఎల్. విజయలక్ష్మి పాల్గొంటున్నారు. స్క్రీన్‌ప్లే, సంభాషణలు : సదాశివబ్రహ్మం, పాటలు : మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల (సీనియర్), ఆరుద్ర, సంగీతం : యస్. రాజేశ్వరరావు, కళ : గోఖలే. ఈ చిత్రంలోని సెట్స్ చూస్తుంటే గోఖలే చాలా శ్రద్ధ తీసుకుని పని చేశారనిపిస్తుంది. నృత్యాలు : వెంపటి సత్యం, కెమెరా : సి. నాగేశ్వరరావు, నిర్మాతలు : టి. హనుమంతరావు, డి. సూర్యనారాయణ, వై. లక్ష్మయ్యచౌదరి.

## బెంగుళూరు లత

నర్తనశాల చిత్రంలో 'సలలిత రాగసుధా', 'శివపతి నీగతి' పాటలద్వారా తెలుగు పరిశ్రమకూ, ప్రేక్షకులకూ పరిచితమయినది నేపథ్యగాయని బెంగుళూర్ లత. హిందీలో లతా కంఠంలా లత గొంతులో కూడ చక్కటి మాధుర్యం ఉన్నది. ఆమె పాడుతుంటే, సంగతులు వేస్తుంటే— సంగీతజ్ఞానం ఉన్నవారికి ఎంతో ముచ్చట వేస్తుంది. మరల, మరల వినాలనిపిస్తుంది. పెన్నిధి చల్లదనమూ, సన్నజాజుల సౌరభమూ, కోయిల కంఠంలోని కమ్మదనమూ—తన గొంతులో నింపుకున్నదేమో అనిపిస్తుంది లత. ఆమెకు యిప్పుడు తెలుగు చిత్రాలలో కూడ మంచి అవకాశాలు వస్తున్నవి.

— మోహన్‌కుమార్ ★

చిత్రసమీక్ష :

# 'ఆంఫిబియన్ మాన్'

సముద్రగర్భంలో మానవ చలనం, ఇతర జీవ రాసుల సంచలనాన్ని వివరపరుస్తూ రష్యాలోని లెన్ ఫిల్మ్ స్టూడియోవారు నిర్మించిన కలర్ చిత్రం "ది ఆంఫిబియన్‌మాన్" లో కథకంటె, సాంకేతిక విలువలు గొప్పగా ఉన్నాయి.

దాదాపు ఈ చిత్రాన్నంతా సముద్ర ప్రాంతంలోనే చిత్రీకరించటం జరిగింది. ముఖ్యంగా సముద్రం అడుగున తీసిన కొన్ని దృశ్యాలు ఎంతో రమ్యంగా ఉన్నాయి. సముద్రంమీద నడిచే పడవలోనుంచి చిత్రీకరింపబడి సన్నివేశాలు కూడా చిత్రంయొక్క సాంకేతిక విలువలను తెలియచేస్తాయి.



నాయకి గుటియర్

ఈ చిత్రం ఒక ముత్యాల వర్తకుని కథ. పేరు పెద్రో జ్యూరిటా. తన పాకలో పనిచేస్తున్న గుటియర్ అనే అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని అతని ఆశయం.

సముద్రం అడుగున ఇక్తియాండర్ అనే వ్యక్తి ఉభయచరుడై జీవిస్తూ ఉంటాడు. ఒకానొకసారి ప్రమాదవశాత్తు సముద్రంలో దూకిన సుందరి గుటియర్‌ను ఇక్తియాండర్ ఒక పెద్ద ఆపద నుంచి కాపాడుతాడు. అంతేగాక, ఉభయులు ఒకరి చేత మరొకరు ఆకర్షింపబడుతారు. ఇరువురూ ప్రేమికులవుతారు. ఇది చూచి భంగపాటు చెందిన జ్యూరిటా, గుటియర్‌ను బలవంతాన పెళ్ళిచేసికొంటాడు. కాని, ఆమె అతని వశంకాదు. బందీ అయిన ఇక్తియాండర్ ఒక మిత్రుని సాయంతో విడుదల అవుతాడు. కాని, ఇంతలోనే అతడు పోలీసుల చేతిలో చిక్కుతాడు. జైలులో నానా బాధలు అనుభవించి, సముద్రంలో తప్ప మరెక్కడా జీవించలేని స్థితికి వస్తాడు. గుటియర్ తండ్రి వివరిపారిగా సెలవు తీసికొంటాడు. జ్యూరిటా గుటియర్ తండ్రి చేతిలో మరణిస్తాడు. స్థూలంగా ఇదీ కథ.

చక్కని రంగులతో నిర్మాణం కావటం ఈ చిత్రంలోని ప్రధానమైన ఆకర్షణ. గుటియార్‌గా నటి అనస్తాషియా వర్టిన్‌స్కియా చక్కని కన్నులతో, ఎంతో ఆహ్లాదకరంగా నటించింది. కథా నాయకుడైన ఇక్తియాండర్ అమాయకుడైన ప్రేమికుడుగా బాగున్నాడు.

ఈ చిత్రాన్ని ఇటీవలనే మద్రాసులోని "సిపిసిన్" థియేటర్లో విలేఖరులకు ప్రత్యేకంగా ప్రదర్శించారు.

దీనికితోడుగా రష్యన్ వ్యోమగాముల వ్యోమయాత్రకు సంబంధించిన మరో సంక్షిప్త చిత్రాన్ని కూడా ప్రదర్శించారు. —ప్రకాశం ★

## 35 ఎం. ఎం. హోమ్ సినీ ప్రొజెక్టర్

మీ యింటిలోనే సినిమా చూచి ఆనందించండి. మీరు కోరిన చిత్రమును మీ గదిలో తెరమీద టార్చి లేక ఎలెక్ట్రిసిటీ సహాయంతో చూడవచ్చును. సినిమాలో వలె పూర్తిసైజు చిత్రములు నటన, నాట్యం చూడవచ్చును స్లయిడ్సు కూడ ప్రదర్శింపవచ్చును. ధర: రు22-50



వి.పి.పి.చార్జి రు4-50 20 అ॥ ఫిలిం ఉచితం. ఇద నపుఫిలిం గజం25పై. స్పెషల్ స్క్రీన్ గుడ్డ రు 4

SULEKHA TRADERS (APM-27)
BEAT NO. 13, Aligarh.

---

## సలహా

క్రోల్పోయిన ఆనందం, బలం, శక్తిని తిరిగి యిచ్చేందుకు ఆహ్లాదకరమైనది. నరాల బలంకు పై పూతకు వాడే తైలం. 1 సీసా రు 11-50 స్పెషల్ రకం అర్జంటు గుణంకు రు. 27/- ఎడ్వాన్సు పంపుతూ జవాబుకు కవరు పంపాలి.

డాక్టర్ రత్నం సన్స్,
Sex Specialists (Estd 1904)
ఆజంపురా మార్కెట్ వద్ద, మలకపేట బిల్డింగ్సు
హైద్రాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

---

## అతిమూత్ర రోగులందరికీ ఉచిత సలహా

మూత్రము ద్వారా చక్కెర వెలువడుట "మెల్లిటస్" అతిమూత్రవ్యాధి. (Diabetes Mellitus) చక్కెరలేకుండ తరచుగా మూత్ర విసర్జన జరుగుట "ఇన్‌సిపిడస్" అతిమూత్రవ్యాధి (Diabetes Insipidus) అనబడును. అమిత ఆకలి, దాహము, శరీరమంతా పోట్లు, బరువు తగ్గిపోవుట ఈ వ్యాధి యొక్క ముఖ్య చిహ్నములు. ఇవిగాక, చర్మవ్యాధులు, దురద, మూత్రకోశము, కాలేయము బలహీనమగుట మున్నగునవి గూడ పొడసూపవచ్చును. వీటికి వెంటనే తగుచర్య తీసికొనకున్నచో దృష్టిమాంద్యము, నిద్రలేమి, కీళ్లవాతము, మానసిక శారీరక శ్రమలయందు అయిష్టత మున్నగువాటికి దారి తీయ వచ్చును. ఇటువంటి లక్షణములతో బాధపడుచున్న రోగులు, ఇన్‌జెక్షన్లు, కఠిన పత్యములు, ఉపవాసములు లేకుండ తమ వ్యాధిని నివారణ చేసుకొనుటకు తగిన ఉచిత వైద్యసలహా కొరకు మాకు వ్రాయవచ్చును. మించిపోకముందే మాకు వ్రాయండి.

VENUS LABORATORIES (A' M.)
P. O. Box No 587 Calcutta-1.

---

## ఏరో కింగ్ ట్రాన్సిస్టర్

జపాన్‌లో తయారైన పాకెట్ రేడియో. పెద్ద రేడియో వలె పని చేయును. అన్ని ట్రాన్‌సిస్టర్లు, లౌడ్ స్పీకరు, గ్యారంటీగలవి జపానులో తయారైనవి మీరు కోరినచోట సంగీతం, వార్తలు వినవచ్చు. స్థానికంగా ప్రపంచంలోని ప్రతిస్టేషను వినవచ్చు. వినుటకు సిద్ధంగా పంపబడును టార్చి సెల్‌తో పనిచేయును అనువైనది. అందమైనది తేలికైనది. సోప్ కేస్ వలె చిన్నసైజు. 3 సం॥ గ్యారంటీ. డీలక్సు రకం నెం. Am 55-ధర రు. 45-50. VPPఛార్జీలు రు.4/-రేడియో తోలుకేసు రు 5/-



**Tagore Vigyan Mandir (WAP R)**
Phapaha, Aligarh

---

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో శాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

సం॥

---

# ఆల్బో-సాంగ్

## అన్ని వయసుల వారికి ఆదర్శక బలవర్ధకం

మీరు అన్నివిధాల ఆరోగ్యంగా వుండాలంటే మీకు ఆల్బో-సాంగ్ అవసరం. వృద్ధులకు, యువకులకు కూడా పటిష్టమైన శరీరాన్ని ఆరోగ్యాన్ని సంపాదించుటకు ప్రత్యేకమైన పదార్థాలు ఆల్బో-సాంగ్‌లో చేర్చబడ్డాయి ఈ రోజు ప్రతి రోజూ కూడా ఆల్బో-సాంగ్ తీసుకోండి. సర్వదా మీరు ఆరోగ్యంగా వుంటారు






జె. అండ్ జె. డీషేన్
హైదరాబాదు (దక్కన్).

# అవీ - ఇవీ - అన్నీ

## నార్త్ మద్రాస్ ఆర్ట్స్ అకాడమీ సమావేశం

రిపబ్లిక్ దినోత్సవంగా నార్త్ మద్రాసు ఆర్ట్స్ అకాడమీవారు శ్రీ బాలువెట్టి అధ్యక్షతన సభ జరిపారు. శ్రీ ఆర్. కామేశ్వరరావు ప్రార్థనా గీతముతో సభ ప్రారంభమైనది.

శ్రీ వెంకటదాసు సభికులకు అతిథులను పరిచయం చేసారు. శ్రీ నారాయణస్వామి మాట్లాడుతూ, వనితాలోకం ముందంజవేసి ఇందులో సభ్యులుగా ఉండటం సమంజసమన్నారు. శ్రీ పి. వి. జి. రత్నం మాట్లాడుతూ సభ్యులందరు కృషిచేసి అకాడమీని అభివృద్ధి చేయాలన్నారు. శ్రీ పుణ్యం ప్రార్థసారధి మాట్లాడుతూ మానవునికి కళలు ఎంతో ఉపయుక్తమైనవని, మనోవికాసానికి, జీవితాన్ని సమరసభరితము చేయుటానికి ఉపకరించేవాటి ఆవశ్యకతలను పేర్కొన్నారు.

అనంతరము శ్రీ వి. వాసన్ తమ 'వికట' ప్రదర్శనతో ప్రేక్షకుల నానందపరచారు. శ్రీ వెంకటదాసు వందన సమర్పణ చేశారు.

## న్యూఢిల్లీలో ఆంధ్రులు

భారత దేశములో గొప్ప పారిశ్రామిక నగరమైన నైవేలిలో "నైవేలి తెలుగు సమితి" అనే పేరుతో ఒక చిన్న సంఘాన్ని స్థాపించి తెలుగు పండుగలను, తెలుగు సంస్కృతికి దోహదమిచ్చే సభలు సమావేశములు జరుపుటకు నిశ్చయించారు.

ఇటీవల 1965 జనవరి 10 వ తేదీన స్థానిక ఉన్నత పాఠశాల భవనంలో సమావేశమై సంక్రాంతి పండుగ వేడుకలు జరుపుకున్నారు. ఆ సమావేశమునకు సి. ఆర్. రెడ్డి అధ్యక్షత వహించిరి. సమావేశము కుమారి సుధ ప్రార్థన గీతముతో ప్రారంభమైనది. సంఘ ఉపాధ్యక్షులు శ్రీ ధానువయ్యగారు సభ్యులకు, సభాధ్యక్షులకు స్వాగతము చెప్పిన తరువాత సంఘ అధ్యక్షులు ఉన్నత పాఠశాల ప్రధానాధ్యాపకులు శ్రీ హనుమంతరావుగారు, కార్యదర్శి మల్లికార్జునరావుగారు సంక్రాంతి పండుగ ప్రాముఖ్యత గురించి చక్కగా వివరించిరి.

శ్రీయుతులు చారి, గఫూర్, పద్మనాభయ్య, సూర్యనారాయణమూర్తిగారలు లలిత సంగీతాన్ని మనోరంజితముగా ప్రేక్షకులకు అందించి, జాన్సన్ వారి అనుచరులువాద్య సంగీతము చక్కగా వినిపించిరి.

మద్రాసునుంచి వచ్చిన మాస్టర్ సంపత్ కుమార్, బేబి గీత చక్కని నృత్యములతో ప్రేక్షకుల మన్ననలను పొందిరి. కుమారి శాంతి, శ్రీమతి రాణి శాస్త్రీయ నృత్యము ప్రదర్శించారు.

సహాయ కార్యదర్శి ఎస్. భీమశంకరరావుగారి వందన సమర్పణ సభ్యుల జాతీయ గీతముతో సభ ముగిసింది. ★

తప్పక చూడండి




శ్రీ వాణి ఫిలింస్

# నాదీ ఆడజన్మే











దర్శకత్వం

A.C. త్రిలోక్‌చందర్ M.A.

నిర్మాత

S.V. రంగారావు B.Sc.

స్టూడియో

వి.పి.ఎమ్





విజయ

G.H. RAO

వెండితెర నవల వెల 1 రూపాయి. ప్రతులకు-ప్రజారంజని, బెంగుళూరు-25.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6&7 Thambuchetty Street Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



కృష్ణా బ్యారేజీ దృశ్యం ఫొటో: పి. వి. యస్. శర్మ

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



చంద్రకాంత

మృదుత్వమునకు, నునుపైన సున్నిత చర్మానికి

# రెమి

స్నో

ఉపయోగించండి